# సమష్టి కుటుంబం

రచన :

ఎమ్. టి. వాసుదేవన్ నాయర్

అనువాదం :

ఎన్. దక్షిణామూర్తి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

1980 (1901)



రూ. 11-25

*Original Title* : NALUKETTU *(Malayalam)*
*Telugu Title* : SAMISHTIKUTUMBAM



PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA. A-5, GREEN PARK, NEW DELHI-110016 PRINTED AT: NATIONAL ART PRINTERS, RENIGUNTA ROAD, TIRUPATI

# పరిచయము

కేరళ భాషైన మళయాళమందు ప్రప్రథమముగ ప్రచురితమైన నవల శ్రీ అప్పునెడుంగాడిగారి 'కుందలత' (1887). ఒక విధంగా చూస్తే ఇది పురాతన సంబంధమైన కథలు, శృంగార కథలతోను కూడినది. నవల అందించిన విధానంలో క్రొత్తదనమున్నప్పటికీ నవలా ప్రారంభము కృత్రిమముగానున్నది. కథాంశములు షేక్స్పియర్ విరచితమైన సింబలిన్ (Cymbaline), స్కాట్ విరచితమైన "ఐవన్‌హెూ" (Ivan hoe)ల నుంచి గ్రహింప బడినవి. నవలా రచన చక్కగాను, సమర్ధవంతముగాను ఉన్నప్పటికీ కథలోని సంఘటనలు, అవ్యక్త దృశ్యములను అస్పష్టమైన ప్రారంభమును తెలియచేస్తాయి. సంఘటనలుగాని, పాత్రలు గాని, కేరళ జీవిత విధానమును ప్రతిబింబించవు.

1887లో వ్రాసిన "కుందలత" లోని కథాసంవిధానము పురాతన కట్టు కథలను, శృంగార కథలను జ్ఞప్తికి తెస్తాయి. కాని, రెండేండ్ల అనంతరము వ్రాయబడిన శ్రీ చందుమేనొన్‌గారి "ఇందులేఖ"లో అనుభవాలు, భావాలు ఈ నాటి అనుభవాలకు, భావాలకు దగ్గరగా వున్నాయి. కథలోను స్థల నిర్ణయములోను కొంచమైనను ద్వందార్ధత స్ఫురించకపోవుటయే ఇందులకు కారణము. సంఘటనలు, పాత్రలు, కథాంశములు కేరళ యొక్క పందొమ్మిదవ శతాబ్దపు చివరి రోజులకు చెందినవి.

మాతృ వారసత్వముగల ఒక పెద్దనాయర్ కులము ఉమ్మడి కుటుంబము చాల కాలముక్రితం భూస్వామ్యమునకు సంబంధించినది. ఆ విధానము నవీన యుగములో ఉండబోదన్న విషయము అప్పుడే సూచింపబడింది. ఆ నాయరు కుటుంబము ఈ నవలలోని కథా వస్తువు. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కాలము తెచ్చిన మార్పులతో క్షీణతను, కష్టములను నాయరు ఎదుర్కొనుటయే ఈ నవలలోని కథాంశము. మలయాళేతరులు నాయర్ల ఉమ్మడికుటుంబ వ్యవస్థ యొక్క సాంఘిక సంప్రదాయములను తెలుసుకొనుటకు ఈ నవల ఉపయోగపడును.

ఉత్తర ప్రాంతము నుండి వైదిక బ్రాహ్మణము ప్రచారములోనికి రాక పూర్వము, బ్రాహ్మణ్య ప్రచారము కొంచముగానే యున్నది. కాని ఎనిమిది.

తొమ్మిదవ శతాబ్దములలో బాగుగ తలెత్తి ఒక స్థాయికి చేరింది. కేరళీయ సము దాయముతో కర్షకులు, పశువుల కాపరులు, చేపలుపట్టేవారని వారి వారి వృత్తి ధర్మములననుసరించి విభజింపబడినా సాంఘిక కట్టుబాటులను గురించి వారికి తెలియదు. కాని, వైదికబ్రాహ్మణ్యము "చాతుర్వర్ణ్య" వ్యవస్థను ఆమోదించింది. సంఖ్యలో అల్ప వర్గమైనప్పటికీ బ్రాహ్మణ్యము అర్చకత్వముతో ప్రతిష్ఠను, అధికారమును చేజిక్కించు కొన్నారు. ఈ రెండింటి సహాయముతో వారు కేరళ సాంఘిక జీవన విధానములను పూర్తిగ మార్పు చేయగలిగారు. ఈ క్రొత్త సాంఘిక పిరమిడ్ యొక్క ఉచ్ఛస్థానమును ఆక్రమించుకొనుటలో జాగ్రత్తపడ్డారు. పరిపాలిస్తున్న యువరాజులు, అనాగరిక జాతి నాయకులు కొన్ని మత సంబంధమైన వేడుకలు, అందులోను కొన్ని దైహికముగాను, మానసికముగాను బాధాకరమైనవి జరిపించవలసి వచ్చెను. ఆ విధమైన కర్మలలో వారు క్షత్రియులుగామారి వ్యవహరించారు.

కేరళ రాజ్యమేలిన చేర రాజులకు తమిళ దేశ మేలిన చోళరాజులకు పదవ శతాబ్దారంభములో జరిగిన వంద సంవత్సరముల పోరు, చేరరాజులకు రాజధానియైన మహెూదయన పురము ముట్టడితో అంతమైనది. చోళుల బారినుంచి తమను తాము కాపాడుకొనేందుకై కేరళ దేశం ప్రయత్నించుటకు ముఖ్య కారణము ఆ దేశ సైన్యముల ప్రతాపమే. ప్రసిద్ధిచెందిన ఆత్మార్పణ కుల దళము (చావెర నాయర్లు) యొక్క వీరోచితమైన కృత్యములు చరిత్రకే ఒక సవాలు. ఆ కాలములోనే "నాయర్" అన్న పేరు ఉపయోగించబడినట్లు మనకు తెలియుచున్నది. మొదట్లో ఈ పేరు ఒక్క కులమును తెలియజేయు నని నిశ్చయముగా చెప్పలేము. కాని, ఈ ఆత్మార్పణకుల దళములో అది ఒక ఉన్నత పదవినికాని, బిరుదును కాని తెలియజేస్తుంది. సైనిక సేవయే వారి వృత్తి ధర్మముగా భావించ బడినప్పుడు త్వరలోనే ప్రత్యేక కులముగా వారు స్థిరపడిపోయారు. సమాజములో వారియొక్క పాత్ర రాజసేవలో జీవ న్మరణ సమస్యగా నుండుటచే నాయర్లు రాచకుటుంబములకు దగ్గరైనారు అందుమూలముగా సంఘములో వారికి ఉన్నతపదవి ఇవ్వడమైనది. క్షత్రియ యువకులు, బ్రాహ్మణులు నాయరు కన్యలను వివాహమాడ వచ్చును.

సాధారణముగ వలస వచ్చేగుంపులలో ఉన్నట్లుగా కేరళ దేశమునకు వలస వచ్చిన వారిలోకూడ స్త్రీలకన్న పురుషులే ఎక్కువగ నుండేవారు.

బ్రాహ్మణ కులములో జ్యేష్టునకుమాత్రమే అంతర్వర్ణ వివాహముచేయువాడుక ఏర్పడినది. మిగిలిన కుమారులు క్షత్రియ లేక నాయరు కులమునకు చెందిన కన్యలను వివాహమాడిరి. కాని వారికి వారసత్వపు హక్కు లేకుండాపోయింది. అందువలన వారికి పిత్రార్జితమైన ఆస్తుల బాధ్యత వహించ వీలులేక పోయింది అందువలన మాతృవంశ వారసత్వము తల్లినుంచి కుమార్తెకు సంక్రమించేది. చోళులతో యుద్ధమునకై నాయరు కులములోని పురుషుల అవశ్యకత ఎక్కువైనందున బ్రాహ్మణ కులములో అధిక నిష్పత్తిలోనున్న స్త్రీసముదాయమునకు మాతృవంశ వారసత్వము నిర్బంధమైనది.

సాంప్రదాయ సిద్ధమైన అధికారము, మాతృవంశ వారసులుగానున్న రాచ కుటుంబములలో పౌరోహిత్యాది బ్రాహ్మణ సేవలను చేయుటవల్ల లభించిన రాజకీయ అధికారము, అనేకమైన భూములను స్వంతము చేసుకొనుట వలన కలిగిన ఆర్థిక స్థోమత నంబూద్రిలు (బ్రాహ్మణులు) కేరళ సంఘ సముదాయములో పటిష్టమైన భూస్వామ్య వ్యవస్థ ప్రవేశపెట్టుటకు అవకాశమిచ్చినది. ఈ వ్యవస్థలో బ్రాహ్మణులు, నాయర్లు గుత్తదారులుగా అత్యధికమైన ప్రయోజనములు పొందారు. క్రైస్తవ, మహమ్మదీయ మొదలైన జాతులు వారిని విడతీసినందున ఇదొక వరముగా పరిణమించినది. ఇది వారి వృత్తి వ్యాపారములలో ప్రజ్ఞను పెంచుటకు దోహదకారి అయినది. కేరళదేశము చిన్న చిన్నరాజ్యములుగా విభజింప బడినప్పుడు ఒక్కొక్క రాజ్యములోనున్న సైనిక కేంద్రములలో నాయరులే ఉన్నత గౌరవములనుపొందారు. కాని పదునెనిమిదవ శతాబ్దంలో మార్తాండవర్మ చిన్న రాజ్యములన్నిటిని ఒకటిగా చేసి తిరువాంకూరును రాజధానిగా చేసికొని ఏకచ్ఛత్రాధిపత్యము వహించెను. నాయర్లకు సైనికకేంద్రముల నిర్మూలనవలన ఏర్పడిన కష్టములు, క్రొత్తజీవిత విధానములను వెతకుటలో అడ్డుపడిన గతములోని వారి గర్వము అనైకమత్యమునకు దారితీసెను. భూవ్యవస్థను అన్యాయముగా అంటి పెట్టుకొనుట గురించి, శ్రీ కుంజన్ నంబియారు పద్యములు వ్రాయుట జరిగినది.

ఇందు లేఖలో నంబియారు వ్రాసినట్లు మనస్సును కష్ట పెట్టే చాటువులుగా కాకపోయినా, శ్రీ ఎం.టి. వాసుదేవన్ నాయర్ మరి ఏ రచయితల వలె వ్యాఖ్యానించక పోయినను కథాగమనము వినోదాత్మకముగ వున్నది.

తమపొలములనుండి ఏవిధమైన ఉత్పత్తినిఆశించక, పొలములకు సంబంధము లేకుండ వున్న ఉచ్చ వంశీయుల గురించి ఇందు మనకు తేటతెల్లముగా స్పష్ట మవుతుంది. ఇనుప హస్తము కలిగిన పెద్దల్లుని నిర్వహణ అధికారమునకు, అతని మేనల్లుళ్ళు మేనకోడళ్ళ ఆశలకు మధ్య నిత్యం జరిగే పోరాటములు ఇందు వివరింప బడ్డాయి. మాతృ వంశ వారసత్వపు ఉమ్మడి కుటుంబములు అపరిమితముగా పెరిగి పోతున్నవి అనే సత్యం స్పష్టం చేయబడింది.

మలయాళము యొక్క ఔన్నత్యము మనముందుంచిన నవలలో ఛాయామాత్రముగనున్న ముఖ్యత్వమును గమనించినచో అది ఏ వర్గమునకు చెందినదో తెలియును. మారుతున్న సాంఘిక ప్రపంచములో, ప్రతి యొక్క సముదాయములోను సమూహ మనస్సులలోని తమ తప్పొప్పులను పరిశీలించుకొను తత్వమును " ఇందు లేఖ " లో కానవచ్చును. కాని ఈ పద్ధతి ముందుకు సాగక ముందే ఒక నూతనమైన, కాని ఒక విధముగ వెనుకడుగు వేయు, ఒక వర్గము అడ్డుపడినది. ఇది పౌరాణిక రూపములో నున్న చారిత్రాత్మక నవల. 1891—1920 సంవత్సరముల మధ్య శ్రీ సి.వి. రామన్ పిళ్లె, వాటిని స్థిర చిహ్నములుగా సృష్టించటం జరిగింది. మారుతున్న కాలములో సముదాయ సమూహమనసులలో ఆక్రమించి ఆలోచనలు భూమట్ట మునకు కృంగిపోయాయి. ఒకప్పుడున్న నాయర్ వంశస్థుల రాజకీయ అధి కారము తగ్గిపోయినది. పదునెనిమిదవ శతాబ్దాంతపు సమయములో హైద రాలి అతని కుమారుడు టిప్పుసుల్తాను మైసూరు రాజ్యమును పరిపాలించారు. అప్పుడు తీవ్రమైన కష్టములకు లోనై నాశనమునకు దారి తీయుచున్న తిరు వాంకూరు సంస్థానమును రాజా కేశవదాసు అనునాయరు కులముఖ్యుడు అతి జాగ్రత్తగ కాపాడినట్లు శ్రీపిళ్లెగారు తమకథలద్వారా జ్ఞప్తికితెచ్చారు. గతములో తనయొక్క శక్తిని, నమ్మకమును నిరూపించుకొనిన సముదాయమును ఆదరించ వలెనని సంస్థకు గుర్తుచేయునట్లు రూపొందాయి వారి రచనలు.

వంట ఇంటికే అంకితమైన స్త్రీలను, యుక్తవయసు రాకముందే ధన వంతులైన వృద్ధులకు కట్టబెట్టే నంబూద్రుల సంప్రదాయము బాధాకరముగా నుండెడిది. పాశ్చాత్య మత సంఘములతో బంధమేర్పరచుకొనుట వలన క్రైస్తవ మతము, గాలిపాటుకు వచ్చిన మార్పుల వలన, అనుకరణమును,

అధునికత్వమును, నిశితముగ పరీక్షించవలసి వచ్చెను. పురాతనమైన, పెద్ద వైన ఉమ్మడి కుటుంబముల జీవనము కాలమునకు తగిన మార్పులు జరుగుటకు అన్వయించు విధముగ ఆ కుటుంబములు చిన్నవై అధునికత్వము కలిగి యుండ వలెనన్నదే నాయర్ల వంశ సముదాయము ఎదుర్కొన్న సమస్య. మహమ్మదీయ వంశములో ఘోషా పద్ధతులు, మత సాంప్రదాయక పద్ధతులు కష్టమైనవి. ఈ రంగములన్నియు కొన్ని మంచి నవలల్లో వివరింపబడినాయి.

ఒక్కొక్క జాతియొక్క సమూహ మనస్తత్వములో నున్న విశేష సమస్యలు, సర్దుబాట్లతో ఈ నవల ఆర్థిక, రాజకీయ పటుత్వములతో ముందుకు సాగుతుంది. శ్రీ చెరుకడ్ భూస్వామి-కౌలుదారుల మధ్య జరిగే తగవులను నిశితముగ పరీక్షించి, గ్రామాంతరములలోని ముఖ్యమైన పోకడల యొక్క అల్పత్వమును వివరించటం జరిగింది. తకళి శివశంకర పిళ్లె మరియు కేశవ దేవ్ తమ గ్రంథములలో గ్రామ్య, పట్టణ ప్రాంతములలోని జాత్యధములు, వ్యవసాయ కూలీలు, వీధులు శుభ్రము చేయువారు, రిక్షాబండ్లు లాగువారు మొదలగు వారిని గురించి వివరించారు.

సాంప్రదాయక జీవనా పద్ధతులు శీఘ్రగతిని తమ యొక్క విలువలను పోగొట్టుకొనినవి. కేరళ జీవితములో రాజకీయ తత్త్వము ప్రబలి యుండుట ఒక విశేషము. వదులుకున్న సంబంధములు ఎదురు చూడని సంఘటనలు అనేక నవలల్లో ప్రతిబింబించటం జరిగింది. గుణ విశేషములో అవి చాల బేధము కలిగియున్నవి-ఉదాహరణకు శ్రీ వి. టి. నందకుమార్ గారి నవలలో మనుష్యులను తోలుబొమ్మలుగా చిత్రీకరించుట మొదలుకొని శ్రీ ఒ. వి. విజయన్ గారి నవలలో చిత్రీకరింపబడిన మానుష్యావస్థ వరకు. కాని అవి మనిషికి లక్ష్యము లేకపోవుటయు, ఆ లక్ష్యముచేయుటకు శక్తిలేకపోవుటయు చిత్రీకరించటం జరిగింది.

దీనికి విరుద్ధంగా చాలా కొద్దిమంది నవలాకారులు మాత్రమే మనిషి నుండి కొత్త విశ్వాసము పొందుటలో అగ్ని పరీక్షల నెదుర్కొనేవారు. శ్రీ కె. సురేంద్రన్ గారి "రియల్ పాలిటిక్" క్షున్నంగా పరిశీలించినచో ముద్ర వేసుకొని యున్న పాత రాజకీయాదర్శము కనబడదు. గుప్తముగా నున్న మానసిక సంకల్పములను వెలికి తీయుటకు ఆయన ప్రయత్నించారని

సాంఘిక కట్టుబాట్లు వాటియొక్క అనిశ్చితమైన పోకడలతో ఆయన జోక్యము కలిగించుకోలేదు. మానవులందరు ఇరుగు పొరుగువారు మాత్రమే కాక ఒకరికై యొకరు అని నిర్ధారించ ప్రయత్నించారు.

ఇప్పుడు మనముందున్న ఈ నవల యొక్క రచయిత గురించి తెలుసుకుందాము.

శ్రీ ఎం. టి. వాసుదేవన్ నాయర్ గారి నవలలు సంఘటనల కూడిక అనవచ్చును. కాని ఆ నవలల్లో సాంఘిక సదాచారముల సహజత్వమును, వాటివల్ల ఉత్పన్నమయ్యే కష్టనష్టాలను గూర్చి సూటిగా చెప్పటం జరగలేదు. ఇది వారి మనసులో వ్రేళ్ళు పాతుకొని పోయిన నాస్తికత్వమును తెలియ జేస్తుంది. 1967 వ సంవత్సరములో రాసిన "శరణార్థి" (Refugee) అనే సాధారణమైన నవలలో ఒక మనిషి తన గ్రామమును విడిచిపోయి అనేక సంవత్సరములు గడచిన అనంతరము పాత స్నేహితులను కలుసుకొని వారితో సంబంధ బాంధవ్యములను పెంపొందించుటకై ఆ గ్రామమునకు తిరిగి వచ్చును. కాని అతనికి ఎదురు పడినవి అన్నియు క్రొత్త ముఖములే. వారు అతనితో స్నేహము కలిగి యుండలేక పోయిరి. శ్రీ ఒకెట్ గారి "వెయిటింగ్ ఫర్ గోడట్" కథాంశములు, కాఫ్కా గారి "కేజిల్" (castle) కథాంశములు ఇయానాస్కోగారి అర్థవంతమైన ప్రసంగములు ఈ కథలో వస్తాయి. కథలో భయము గొల్పు స్వప్నములను, విశదీకరించి నప్పుడు ప్రపంచమును తనకు అనువుగా చేసుకొనుటలో మనిషియొక్క తీవ్ర ప్రయత్నములను నిరాశను చూడగలము.

ఈ ప్రపంచములో పరిస్థితుల ప్రభావం వల్ల మానవుడు అనుభవించే సుఖదుఃఖాలతో పోల్చి చూస్తే, వాటిని తప్పించుకోవాలనే వాంఛ ప్రముఖంగా కనబడుతుంది. అందుకని అలా పరిస్థితులను తప్పించుకునే వారే ఎల్లప్పుడూ సరైన నిర్ణయాలు చేసుకుంటారనటం సవ్యం కాదు. ఏలననగా, కథాంశము నవలాకారునిచే ఎన్నుకొనబడినదియును, కాల్పనికము అగుటయే. వీరిదే మరొక నవల "మనస్సుయొక్క అంధకారము" (Soul of the Darkness) లో పరిస్థితుల ప్రాబల్యము వల్ల ఏర్పడినది. ఒంటరి తనముతో కూడిన విషాద

సంఘటనలు విశదీకరించ బడినవి. 1965లో వ్రాసిన అద్భుత నవల "మంచు"(Mist) లోని కథాంశము చాల చిన్నది. ఇద్దరి వ్యక్తుల అర్థరహిత మైన నిరీక్షణను గురించిన కథ ఇది. యాత్రలకు పోయినప్పుడు నైనితాలు లో ఒక యువకునితో సంబంధం ఏర్పరచుకొని అతను తిరిగి వచ్చునట్లుగా వాగ్దానము తీసుకొని, అతనికై నిరీక్షించుచున్న విమల అనే యువతి యొక్క; ఆంగ్లేయ యాత్రికునికి ఒక కొండజాతి స్త్రీతో సంబంధము వలన గలిగిన భాటియా పేరుగల కుర్రవాడు కనీసం ఒక్కసారైనా తన తండ్రిని చూడవలె నని నిరీక్షించుట–కథ ఇతివృత్తము. శ్రీ వాసుదేవన్ నాయర్ రచనలలో తాను సృష్టించిన పాత్రలలో సహజత్వము లోపించి చెదరి ఛిన్నా భిన్నమైన ముక్కలను ఒకటిగా చేయాలన్న ప్రయత్నము కనబడుతుంది. ఇటీవల వెలుగులోకివచ్చిన వారి"సమయము" (Time) నవలలోకూడ అదరముకన్న బాధతో కూడిన ఒప్పందములు, తప్పుడు దోవలనుంచి బహిరంగముగా శుద్ధపరచుకొనుటను గురించి చెబుతుంది.

శ్రీ వాసుదేవన్ నాయర్‌గారి రెండవనవల "సర్పబిందు" (1962)లో నాయర్ల ఉమ్మడి కుటుంబముల నాశనము ఒక విశిష్టమైన కథావస్తువుగ తీసు కొన బడినది. ఒక విధముగ అది వెగటు కలిగించే దౌర్జన్యత్వపుగాధ. సాహస ముల వలయములో చిక్కుకొన్న దౌర్జన్యము రచయితచే ఆపాదింపబడి. అనేక పరిస్థితుల మార్పుల ప్రాబల్యము వల్ల ప్రతి నాయకునకు ఈ కథలో చోటు లేక పోయింది. గోప్యమయిన ఎల్లలు గల నవలలో అవకాశములే కన బడవు. నవలాంతములో తన ఆశయములను అందుకోలేక పారిపోవుటకు ప్రయత్నించిన కథానాయకుని ప్రసక్తియే లేదు.

అదే కథాంశముతో అంతకు ముందే (1958)లో వ్రాసిన, ఇప్పుడు మనముందున్న నవల "నాలుకెట్టు" చిహ్న ప్రధానమైనది. ఎందుకంటే అది పురాతన పద్ధతిలోనున్న కుటుంబానికి చెందినది. నిర్మాణాత్మకమైన ఉమ్మడి కుటుంబములు సామాజిక ఉదాహరణకు నిదర్శనములు. ఒక విశాలమైన స్థలము చుట్టును వివిధములైన గదులు కట్టి ఆ ఇంటిని ఎట్లైనను మార్చుకొన వచ్చును. అనేక చిన్న చిన్న కుటుంబముల కలయికతో వృద్ధియగు ఒక పెద్ద ఉమ్మడి కుటుంబమునకు అది అలవాలమైవుంది.

తన తల్లి తండ్రుల ఇష్టమునకు వ్యతిరేకంగా తన ప్రియునితో లేచి పోయిన ఒకస్త్రీకి పుట్టిన కుర్రవాడు తిరిగి ఆ పూర్వీకుల కుటుంబములో ప్రవేశించుటకు పడిన ప్రయాసను తెలిపే కథ యిది. చట్ట సమ్మత హక్కుల వలన అతను కుటుంబంలో చేర్చుకొనబడ్డాడు. కాని కుటుంబ పెద్ద అయిన పెద్దమామ హృదయములో అతనికి స్థానంలేక పోయింది. మొదట్లో ఆ కుర్రవాడు అసత్య ఆరోపణ ఫలితంగా తల్లిని వదలి వెళ్లిపోతాడు. విధవ అయిన ఆ స్త్రీ తన కుమారుని విద్యాభ్యాసమునకై ఒక దయార్ద్రహృదయుడినుంచి సహాయము పొందుతుంది. ఆమె పొందిన సహాయము సందేహాస్పదమైన అసత్య ప్రచారముల పాలపడి తత్ఫలితంగా అతడు అవమానింప బడ్డాడు. ఆ కుర్రవాడు బాగాచదివి, పెరిగిపెద్దవాడై ఒక ఉద్యోగమును సంపాదించుకుంటాడు. కొంత కాలానికి తన కుటుంబములోనికి తిరిగి వస్తాడు. ఈ లోపు ఆ కుటుంబ ఉమ్మడి ఆస్తులు నెమ్మదిగా క్షీణించ సాగుతాయి. ఆ ఉమ్మడి కుటుంబ పునరుద్ధరణ అతని ఆశయం కాకపోయినా తనకు ఇష్టములేని కొన్ని జ్ఞాపకాలతో ఆ యింటిని తనకొఱకై తిరిగి పునరుద్ధరించేందుకు కొంటాడు.

ఆశక్తతతో కూడియున్న ఉమ్మడి కుటుంబమును కొత్తరకమైన మరో చిన్న కుటుంబముగ మార్చుటకై తీసుకొన్న నిర్ణయము చిహ్నప్రాయమైనచో అది సరియైనిది కాదు.

అతని బాల్యము అనేక కలతలతో, బాధలతో నిండినది. ఆ బాల్యపు తాలూకు జ్ఞాపకాలతోకూడిన తన జీవితాన్ని, బుద్ధికుశలతతో, ఒక ఆశయంతో సరిదిద్దుకో చేయు ప్రయత్నమే ఈ కథలోని ఇతివృత్తము.

—శ్రీ కృష్ణ చైతన్య.

# ఒకటి

పెరుగుతున్నాడు, పెరిగి పెద్దవాడు అవుతాడు. మంచి విచక్షణ జ్ఞానము గలవా డవుతాడు. ఆరోజెవ్వరికీ భయపడ నవసరంలేదు. నలుగురిలో తల యెత్తుకొని నిర్భయముగా తిరగడానికి వీలవుతుంది. 'ఎవర్రానువ్వు?'అని యెవరైనా అడిగితే 'నేనే, కోంతుణ్ణి నాయరు కొడుకుని అప్పుణ్ణిని' అనవచ్చును.

సైదాలకుట్టిని చూసి మాట్లాడేందుకు భయం వేస్తుంది. సైదాలి కుట్టిని అడగాలనివుంది–"అతని గొంతుక నాచేతులలో నలుగుతున్నప్పుడు నువ్వు కాదా? నా........."

ఇలా ఆలోచిస్తున్నప్పుడు అతని కళ్లు చెమ్మగిల్లుతాయి. సైదాలికుట్టిని గురించిన ఆలోచనలు ఎప్పుడూ అతని మనసులో మెదలుతూ వుండేవి. కళ్ళు మూసుకొన్నా, నిద్రరాని సమయములలోను, కుండలపువారింటి గుమ్మంలో నున్నప్పుడూ, మధ్యాహ్నపు ఎండలో నున్నపుడూ, ఒంటరిగా నున్న ప్పుడూ అతనికి సైదాలికుట్టిని గురించిన ఆలోచనలు వచ్చేవి.

'ఎవరా సైదాలికుట్టి ?' అప్పుణికి తెలియదు. తెలుసుకునే అవసరము లేదని అతను నిశ్చయించుకున్నాడు. ఇట్లావుంటేనే మంచిది. పెరిగి పెద్ద వాడైన తర్వాత అతనే తెలుసుకోవచ్చును.

ఆ సాయంకాలము అంగడి వీధికని బయలుదేరినప్పుడు అతను సైదా లికుట్టిని గురించే ఆలోచించ లేదు. అతనిని చూసేందుకు కూడా అప్పుణికి మనస్కరించలేదు.

బడి నుంచి ఇంటికి తిరుగు ముఖం పట్టాడు. దారిలో గుడివద్ద నుంచి స్నేహితులతో కలసి వచ్చాడు. దారిలో మామిడి తోటలో కాయలను రాళ్లతో కొట్టి వాళ్లు తిన్నారు. పరంజ్యోతికి, అచ్యుతకురుప్పకు మామిడి కాయలను రాలగొట్టిన సంగతి తెలియకూడదు. వారు చెడునడత గలవారు. వారిద్దరు వీరి తల్లి తండ్రులతో చెబుతారు. తోటమాలితో చెబితే అతను ఒప్పుకొన వచ్చును. అతనికి సంతానము లేనందున పిల్లలయందు వాత్సల్యము చూపే వాడు.

ఇట్లా ప్రొద్దు పోయే దాక కొండలు, గుట్టలు ఎక్కుతూ తడిసిన పచ్చ గడ్డి, చిన్న మొక్కలను తొక్కుకుంటూ వెళ్ళేవారు. పొద్దు కుంగటంవారికి తెలియలేదు.

బడి విడవగానే తిన్నగా ఇంటికి వచ్చిన రోజులలో అమ్మ ఇంటికి వచ్చి వుండేది కాదు. వంటింట్లో ఉట్టిలో నున్న గంజిపాత్ర తీసుకొని ఒక సారి కలిపి త్రాగాడు. ఆతర్వాత తోటలోనున్న ముత్తాచి అవ్వ గుడిసెకు వెళ్ళి ఆమెతో పిచ్చాపాటి మాట్లాడు తున్నప్పుడే అతని తల్లి ఇంటికి వచ్చేది.

ఈ రోజు ఇంటికి వచ్చేటప్పటికి అతని తల్లి రాత్రివంటకై పొయ్యి అంటిస్తోంది.

"ఏమిరా ఇంత ఆలస్యమయింది ?"

"ఏం లేదమ్మా"

"ఎన్నిసార్లు చెప్పడం, చీకటి పడకముందే ఇల్లు చేరాలని ?"

దానికి అతనేమి బదులు చెప్పలేదు. ఏదైన చెప్పితే అమ్మ అంతటితో విడవదని.

"గంజి కాస్తున్నది నీకోసమే ! నువ్వు వెళ్ళి యూసఫ్ అంగడి నుంచి రెండు అణాలకు కిరసనాయిలుతే " అన్నది అమ్మ.

అప్పణి బయటికి చూశాడు. చీకటి పడినదే తెలియ లేదు. ఆకాశంలో నలుపు రంగు అలుముకుంటున్నది. చీకటిలో ఆదారిలో నడుచుటకు భయ మేసింది. దారికిరువైపుల మొగలిచెట్లు దట్టంగా అడవి లాగా పెరిగి యున్నాయి. ఆ దారిలో నున్న శ్మశానములోనే కదా ఏరోమన్ మాంత్రికునిని దహనం చేశారు.

ఆ చీకట్లో వెళ్ళడానికి భయం వేసింది.

"రేపు వెళుతానమ్మా"

"కాస్త వెళ్ళి రాకూడదా ? పరుగెత్తిపోయిరా"

అతను సందేహంతో ఆగిపోయాడు. భయపడుతున్నట్లుగ చెబితే అమ్మ పోవద్దంటుంది. కాని అలా చెప్పటం అతనికి గౌరవ హీనమనిపించింది. భయ పడేందుకు తనేం పసివాడు కాడు. తను చదివేది ఎనిమిదవ తరగతి. క్లాసులో తానే వీరుడు కదా ?

"ఊ! వెళ్ళిరా అప్పణీ! తొందరగ వచ్చావంటే ఉల్లిపాయ వండి అన్నం పెడతాను."

అతని సందేహం తీరిపోయింది.

డబ్బులు ట్రవుజరు పాకెట్టులో పెట్టుకొని బుడ్డీ తీసుకొని పరుగు తీశాడు.

మొగలి చెట్ల దారిలో పరుగెడుతున్నప్పుడు ఏదో కలవరంతో ఒక క్షణం ఆగిపోయాడు. అంత చీకటిగా లేదు. కాని దారికి రెండు వైపులకున్న మొగలి చెట్లు ఆ చీకటిలో నల్లగా కనబడుతున్నాయి. ఇటువంటి చెట్లున్న ప్రాంతము లలోనే కదా విషపూరితమైన పాములుండేవి. పాములకు మొగలి పూవుల వాసనంటే ఇష్టముకదా! మంచి గంధం వాసన, మంచి రంగులు, చెవులకింపైన పాటలు, అందమైన అమ్మాయిలు అంటే పాములకు ఇష్టమైనవి. విషపూరిత పాములకు మాత్రమేం తక్కువ? ఆ దారిలోనున్న ఒక్కొక్కరాయి, ఎత్తు పల్లం అన్నీ అతనికి సుపరిచితమైనవి. మెల్లిగాపోతే కదా భయం. ఒక్కసారి పరుగు లంకించుకున్నాడు. అవతలివైపునున్న గుట్టవద్దకెళ్ళినప్పుడే ఆగాడు.

ఇంక కొంచెం దూరం వెళ్ళితే అంగడి వచ్చేస్తుంది. ఆ ప్రాంతంలోని ఇళ్ళ కప్పులు గడ్డితో కప్పబడ్డాయి. ఒక్కటి మాత్రమే పెంకుటిల్లు. అందులో అంగడి లేదు. గుమ్మము వద్ద ఎవరో నిలబడి వున్నారు. .

ఇంట్లో దీపం వెలుగు బయటకు కనబడుతోంది. ఆవీధిలో పదునాల్గవ దీపం వెలుగుతోంది. యూసఫ్ ఇంటి దగ్గిర మాత్రం పెట్రొమాక్స్ దీపము వెలుగుతోంది. ఆ గ్రామములో కల్లా ఆవీధే పెద్దది. అక్కడే విషుఃపుణ్యా కాలానికి కావలసిన వస్తువులు అమ్మేది.

పట్టాంబిలో నుంచి ఒక దర్జీ కొత్తగా వచ్చాడు. ఇంతకు ముందు గూడలూరులో ఉండేవాడు. కుట్టుమిషనుతో ఒక దుకాణము ప్రారంభించాడు.

అప్పుణికి ఆ వీధిలోకి వెళ్ళడమంటే చాలా సరదా. అక్కడ గుంపులో నిలబడి మిషను చేసే 'కడ కడ' శబ్దము వినేవాడు. కుట్టుపడిన వెంటనే రంగు రంగు వస్త్రాలు ముందుకు జరగటం అతనికెంతో బాగుండేది.

కొన్ని రోజులుగా అనుకుంటున్నాడు రావుత్తర్ దగ్గర చొక్కా గుడ్డ కొనమని అమ్మకి చెప్పాలని. ఇప్పుడతనికి ఉన్నవి మూడు చొక్కాలు. అవి రావుత్తర్ దగ్గర కొన్నవే. రెండు చొక్కాలు మరీ పెద్దవిగాను, ఒకటి చిన్నది. గుడ్డతెచ్చి ఇతనికివ్వాలి. అయితే ఈ కుట్టుపనివాడు వీధిలో వాళ్ళకి కన బడేటట్లు కొలతలు తీసుకుంటాడు. టేపుతో తీసిన కొలతల ప్రకారము కుడితే,

బాగా ఉంటుంది. ఆ కుట్టుపని, బట్టను కత్తరించి చింపే విధానము చూడడం అంటే అప్పుణికి చాలా సరదాగా ఉండేది.

అప్పుణి యూసఫ్ అంగడికి వెళ్ళేటప్పటికి బాగా చీకటి పడిపోయింది. రోజంతా కష్టపడి సంపాదించిన కూలి డబ్బులతో ఆడ కూలీలు వెచ్చాలు కొనేందుకు అంగడికొచ్చే సమయమది.

అతను ఒక ప్రక్కగా ఒదిగి నిలుచున్నాడు. వ్యాపారం జోరుగా సాగుతోంది. "ఆలస్యమవుతున్నదే ఈశ్వరా!"

మొగలిచెట్లడవిలో చీకటి పడినతర్వాతనే కదా పాములు సంచరించేది.

దారిలో నున్న శ్మశానములోనె కదా మంత్రగాడు ఏరోమనుని దహనం చేసినది.

"రెండణాలకు కిర్సనాయిలు ఇవ్వండి."

ఆడపిల్లల గొడవలో ముసలియార్‌కు అప్పుణి గొంతు వినపడలేదు.

ముసలియార్ ఆ గుంపులో ఎవరెవరున్నారో చూసేందుకని ఒక్కసారి తలెత్తాడు. ఆ గుంపులో అంటరానివాళ్ళున్నా అతనికి అంత అభ్యంతరము లేదు. ఎట్లాగైన ఇంటికి పోయి స్నానం చేసేవాడే. ఒళ్ళు విరుచుకున్నప్పుడు అతని దగ్గిర చమట, మురికివాసన వేస్తున్నవి. అప్పుణి వెనుకగా నిలబడ్డాడు. పెట్రొమాక్స్‌లైటు చుట్టూ పురుగులు తిరగడం చూస్తూ నిలబడ్డాడు.

ఆ సమయంలో ఇద్దరు మనుష్యులు అక్కడికి వచ్చారు. ఒకడు తెల్ల షర్టువేసుకొని, నెరసిన చిన్న మీసముగల దారుఢ్యమైన పొట్టివాడు, రెండవ వాడు పడవ రేవు ప్రక్కన టీ అంగడి పెట్టి నష్టపడిపోయిన పద్మనాభన్ నాయరు. అప్పుణికి అతను పరిచయస్తుడే. అతని పిల్లలిద్దరూ తన క్లాసులోనే చదువుతున్నారు.

అప్పుణి కొంచెం ముందుకు జరిగి గోడకు వాల్చిన తలుపు చెక్కలపై ఆనుకొని నిలబడ్డాడు.

"నశ్యముందా ? ముసలియార్‌గారు."

లావుగ పొట్టిగ నున్న తెల్లషర్టాయన అడిగాడు. ఈ కంఠం విని ఆడ పిల్లలు తిరిగి చూశారు. గల్లాపెట్టి వద్ద చిల్లర లెక్కపెడుతున్న యూసఫ్ అతనిని చూడలేదు.

"ఎవరది" ? ధనియాలను టేకాకులో పొట్లము కట్టుతూ, తన ఎర్రటి పళ్లు బయటపెట్టి నవ్వుతూ అడిగాడు.

"ఇది ఎవరు ? ఈనాడైనా వస్తారా ?"

"మేము తయార్! ఇస్రేయిలును కూడ కావలంటే పిలుస్తాం."

యూసఫ్ లేచి తెల్లషర్టు వాణ్ణి చూసి "ఓ బగవంతుడా.........ఇదెవ్వరు?" అని అడిగాడు.

"ఎప్పుడు వచ్చాడు ?"

"అయిదున్నర బండికి." ముసలియార్ పొట్లం కడుతూ చెప్పాడు.

"మీరు బాగున్నారు కదా ?" అతను పబ్బనాయర్‌గారా ?"

అరుగుపై కూర్చుని, బీడి వెలిగించి, పొగ వదులుతూ పద్మనాభం నాయరు చెప్పాడు.

"ఓ! విదేశాలల్లో అన్నానికేం కొరత?"

ఎంగిలి ఉమ్మేయటానికి బయటకు తిరిగి నప్పుడే అతను అప్పుణ్ణిని చూసాడు.

"ఏమిరా ?"

అతనికేమి తోచలేదు. అతనికి ఏడుపువచ్చేటట్లున్నది. తలెత్తకుండానే సమాధాన మిచ్చాడు.

"కిరసనాయిలు కొనడానికి వచ్చాను."

ఆడపిల్లలలో ఒక విధమైన ఆసక్తి ఏర్పడింది.

"ఈ పిల్లవాడు ఎవరు ?" తెల్లషర్టువాడు పద్మనాభం నాయర్ని అడిగాడు.

"మన కోంతుణ్ణినాయరు కొడుకు, ఉత్తర బాటలో—"

అప్పుణ్ణి తలవంచుకొని వున్నాడు.

ఆడపిల్లలలో నిశ్శబ్దత ఏర్పడింది. అప్పుణ్ణి ప్రక్కనున్న ఇద్దరూ తమలో తాము ఏదో మాట్లాడుకొంటున్నారు. ముందువున్నవాడు కొంచెము ప్రక్కకు జరిగాడు. ఎవరిపైన పడకుండా ముందుకెళ్ళాడు అప్పుణ్ణి. ముసలియార్ అతని చేతిలో బుడ్డీలాక్కొని చిన్న కొలత పాత్రతో టిన్నులో నూనెను రెండు సార్లు ముంచి బుడ్డిలోపోసి, కొంచెం కొసరు కూడ పోశాడు.

బుడ్డీ తీసుకొని, మూతపెట్టి తిరిగి వెళ్లటానికి బయలు దేరుతున్నప్పుడు తెల్లషర్టాయన అడిగాడు.

"ఒంటరిగా వెళ్తావా ?"

అతనికి సమాధానం చెప్పడానికి అప్పుణ్ణికి మనసొప్పలేదు.

అప్పుణి ఎవరికీ వినపడని విధంగా ఏదో మెల్లిగా గొణుగు కున్నాడు. ఒక అధికారి ఇంట్లో పని చేసే, కోచ్చి అనే పిల్ల ఒకామె కొంచెం బిగ్గరగా చెప్పింది.

"తమ్ముడూ, వెళ్ళిపోకు. ఉండు. నేను కూడా వస్తాను."

కొబ్బరి ఆకులతో తడికలు అల్లి అమ్మగా వచ్చిన డబ్బులతో చిల్లరంగడిలో కొన్ని వస్తువులను తట్టలో పెట్టుకొని, తట్టను నడుముపై ఒక ప్రక్కగా పట్టుకొని, ఆమె అతని వెనుకగా వచ్చింది. ప్రక్కనున్న అంగడి దీపంలో తాటాకు మట్ట నొకటి అంటించుతూ చెప్పింది.

"మనకు దారిలో పనికొస్తుంది కదా!"

అప్పుణికి భయంపోయింది. వెళ్ళేటప్పుడు పరిమళముతో కూడిన కేతకీ పుష్పముల వాసన అతనికి సోకింది. ఎట్లాగైన కాస్త వెలుగుంది. (తాటిమట్ట యొక్క మంట.)

దోవలో అతనడిగాడు.

" అదెవ్వరు, కొచ్చీ, అక్కడ? "

" ఎవరు తమ్ముడూ? "

" అదే యూసఫ్ అంగడిలో – "

" అతను సైదాలికుట్టి కదా? "

" ఎవరా సైదాలికుట్టి? "

అతనిదేహం గగుర్పొడిచింది. లావుగా పొట్టిగా బలిష్టమైన చేతులు, ఒంటినిండా వెంట్రుకలున్న వాడేనా సైదాలికుట్టి? గుండ్రమైన అతనికళ్ళల్లో ఎరుపురంగు కొట్టవచ్చినట్టు కనబడుతోంది.

ఆ ఊరి గుడి ఆవరణలో కథకళి నృత్యం జరిగినప్పుడు, ఆ ఉదయం లేవగానే తాను సైదాలికుట్టిని చూసినది జ్ఞప్తికి వచ్చింది. దుశ్శాసనుడి రొమ్ముపై కూర్చొని అతని ప్రేగులను మాలగా బైటకు తీయు భీముడు జ్ఞప్తి కొచ్చాడు. అలాగే సైదాలికుట్టి రొమ్ముపైకెక్కి–కాని తనకు బలం చాలదు. ఇంకా పెద్దవాడవ్వాలి.

అప్పుణి మొగలి చెట్ల దగ్గరకొచ్చాడు.

ఎట్లాగైన రాళ్ళ గుట్టలలోనో, చెక్కల వద్దనో కాకపోతే కొండ దిగువ భాగంలోనో, మధ్యదారిలోనో కొట్టితీరాలి. బండరాయి నొక దానిని తలమీద వేసేస్తే ———

"తమ్ముడూ! నువ్వెళ్లుతావా?"

అప్పుడే అతను చూశాడు గుమ్మంలో తానున్నట్లు.

" అప్పణీ "

అమ్మ పిలుపు వినబడింది. గుమ్మంలో నిలబడి తనకోసం కలవరంతో ఎదురు చూస్తూన్నది ఆమె.

అతను త్వరగా గుమ్మందాటి లోపలికి అమ్మవద్దకెళ్ళాడు.

"నువ్వు తిరిగి రావాలని దేవుణ్ణి వేడుకొంటూ నీ రాకకై ఎదురు చూస్తూన్నాను."

పరధ్యాన్నంగా లోపలికి రావటంతో అతనికాలి చిటికెన వేలికి ఎదురు దెబ్బ తగిలి రక్తం కారసాగింది.

"ఏమిటిరా అప్పణీ ఈ దెబ్బ?"

"చీకటిలో రాయి తగిలింది."

పాడిగుడ్డలో బొగ్గుపొడి పెట్టి దెబ్బమీదవేసి కట్టు కట్టి స్నానము చేయటానికి బావివద్దకెళ్ళాడు. తల్లి నీళ్లుతోడి పోసింది. ఎప్పుడూ అమ్మే ఒళ్లు తోమి స్నానం చేయించేది. తర్వాత అతను గుడ్డతో ఒళ్లు తుడుచు కున్నాడు. కాని ఇంకా తల తడిగా వున్నందున అమ్మ బాగా తల తుడిచింది. వెల్లుల్లి పాయలతో వండిన అన్నము అతనికి రుచించ లేదు.

అమ్మ వంటగది తలుపు మూసింది. వంటపాత్రలను కడిగి బోర్లించిన తర్వాత అమ్మవచ్చి పడుకునేందుకు చాప వేసింది. అమ్మకూడ ప్రక్కనే వచ్చి పడుకుంది.

దీపం ఆరిపోయింది. ఆ చీకటిలో అతనికి అకారణంగా భయం వేసింది. ఆ చీకటిలో రేగిన తల, ఎర్రని రెండు కళ్లను అతను చూశాడు.

"అమ్మా, నిద్రపోయావా?"

"లేదురా, ఏం ? "

చెప్పుదామా? —

" ఊహూ "

కంటి రెప్పలను బలవంతంగా మూసుకొని త్వరగా నిద్రపోవాలని ప్రార్థించాడు.

" అమ్మా — "

అతనిని గట్టిగ హత్తుకొని అడిగింది.

" ఏం రా? "

మళ్లీ సందేహించాడు. " చెపుదామా? "

"ఈ సాయంకాలం నేను సైదాలికుట్టిని చూశానమ్మా."

ఎవరా సైదాలికుట్టి అని అమ్మ అడగలేదు.

అతని వీపుమీద తన ముఖాన్ని అదిమి పెట్టి హత్తుకొని చెప్పింది.

" అప్పుణ్ణీ నిద్రపో "

అమ్మ అతనితో ఆ చరిత్ర గురించి మాట్లాడలేదు. మనసులో ఏదైనా వెలితిగా వుండేటప్పుడు ముత్తాచితో చెప్పుకొని చాలాకాలమయింది.

వాళ్లింటి దక్షిణ భాగంలో వెనుకవైపున వున్న పూరింట్లోనే ముత్తాచి ఉండేది. తీరుబడి కలిగినప్పుడు అతను అక్కడే గడిపేవాడు.

అయితే ముత్తాచి ఎప్పుడూ అక్కడ ఉండేది కాదు. కొన్ని సమయాల్లో పసుపురంగు ఉన్ని శాలువ కప్పుకొని రాత్రులలో బయటికి వెళ్లేది. ఆ శాలువ కొలంబోనుంచి తెచ్చినదట. రెండు మూడు రోజులైన తర్వాత ఎక్కడికో పోయేది. కొబ్బరితోటలకు, మామిడి తోటలకు వెళ్లేది. రెండు మూడు భూస్వాముల ఇళ్ళకు వెళ్లేది. తిరిగి వచ్చేటప్పుడు కొబ్బరి కాయలు, బియ్యం మొదలైనవి తెచ్చుకొనేది. అవి ఆమె అడుగక ముందే ఆమెకు ఇవ్వాలి.

గూడలూరులో ఆమెను ఎరగని వారెవ్వరూలేరు. చిన్నతనంలో ఆమెకు ముగ్గురు భర్తలుండేవారు. మొదటి భర్త ఆమెను అభిమానించేవాడు. రెండవ, మూడవ భర్తలతో ఆమె అనుకూలంగా సంసారం గడిపింది.

డెబ్బై సంవత్సరముల వయసైనను యువకులను చూచి హాస్యముగ మాట్లాడి ఆనందించేది. బంధువుల ఇళ్లకు వెళితే ఒకటి రెండు రోజులు అక్కడే ఉండేది. ఆమె ఇంటికి తిరుగు ముఖం పెట్టేటప్పుడు ఇంటి ఇల్లాలు ఆమెకు బియ్యం, పప్పులు ఇవ్వాలి. చిన్న పిల్లలు ఆమెకు డబ్బులు ఇవ్వాలి. అలా ఇచ్చిన వారి మంచి మనస్సు, ఉదారబుద్ధి గురించి పల్లెవాడలన్నీ నడచి గొప్పగ చెప్పేది.

ముత్తాచి ఆ ఊళ్ళో పురుళ్లు పోసేది. రోగుల ఇంటికి వెళ్ళి మందులిచ్చేది. ఆపల్లెలో చాలమంది స్త్రీలు ప్రసవ సమయంలో ముత్తాచి సహాయం పొందేవారే. అందులో కొందరు చనిపోయారు. ముత్తాచిని చూసి "యముడొస్తున్నాడ"ని చెబితే ఆమెకు కోపం వచ్చేది.

"నన్నా దక్షిణ ప్రాంతంలో ఇచ్చి విధవను చేశారు కదా?" అని తనని తానే ప్రశ్నించుకొనేది. మళ్ళీ తనని తానే సమాధాన పరచుకునేది.

"ఇంకా నాకు పైనుంచి పిలుపు రాలేదు".

ఒక చిన్న ప్రయాణం చేసివచ్చిన ముత్తాచి అయిదారు రోజులు ఎక్కడకూపోకుండా ఇంట్లోనే ఉండేది. అప్పుడే అప్పుణికి చాలా సంతోషంగా వుండేది. ఇంట్లో నులక మంచము పైకూర్చుంటే చాలు. తిరుగుప్రయాణంలో తనకు దొరికిన మామిడి పళ్ళు, పనసతొనలు, పప్పు బెల్లములు మొదలైన తిను బండారములు ఏమైనా ఉంటే అవి అన్నీ అప్పుణికి ఇచ్చేది. రెండేళ్ళ పిల్లలకు వినే శక్తి ఉంటే వారితో కూడా చెప్పేందుకు ఆమె దగ్గిర అనేక సంగతులు వుండేవి.

తన తండ్రిని గురించిన విషయాలన్నీ అతను ఆమె దగ్గరే తెలుసుకొన్నాడు.

"కోంతుణ్ణి నాయరు మరణించేటప్పటికి నీకు చాలా చిన్న వయసు అబ్బాయ్."

ముత్తాచి మగవాళ్లనందరినీ 'అబ్బాయి' అని, ఆడవాళ్ళందరినీ 'అమ్మాయి' అని పిలిచేది.

అతనిది సాధారణ మరణముకాదు. ఎవరో విషమిచ్చిచంపేశారు.

''అతనిలాంటి వాడు మళ్లీ పుట్టబోతాడా ఈ లోకంలో ? ఏనుగు పట్టటంలో ఎంతటి సమర్థుడు ? ఎప్పుడు ముత్తాచిని చూడడానికొచ్చినా తనకు చక్కిలము తెచ్చి ఇచ్చేవాడు........" ఇలా చెప్పి అప్పుణి తలను ఆప్యాయముగా నిమురుతూ మళ్ళీ చెప్పేది.

"అటువంటి మంచి వాళ్ళను దేవుడు ఎక్కువ రోజులుంచడు"

తన తండ్రిని గురించిన జ్ఞాపకములు అప్పుణికి కొద్దిగా తెలుసు. అయినా అతనిని చూసే వాళ్లందరూ అతని తండ్రి గురించే మాట్లాడుకునేవారు. ఆప్రాంతములో నున్న వారందరికీ తన తండ్రి చాల నమ్మకస్తుడుగా వుండే వాడు. పెండ్లిండ్లలోను, కర్మకాండలలోను, ఇతర కార్యముల లోను తన తండ్రి చాలా సహాయముగ నుండేవాడు. కాని తన తండ్రి తరఫున బంధువులెవ్వరినీ తాను చూడలేదు.

"అతని ఇష్ట ప్రకారమే జరగనీ, చూద్దాం."

ఈ మాటలు తండ్రికి తన తల్లి చెప్పినవి. తన తండ్రి, అయన తండ్రికి ఒకే కుమారుడు. చనిపోయే సమయంలో తన తండ్రి ఒంటరివాడు.

కొంతుణ్ణినాయరు దాయకట్టు ఆటలో గొప్ప నిపుణుడు.

ఓణం పండుగ, సంవత్సరాది పండుగైన విషు, అరుద్రా పండుగల సమయాల్లో గూడలూరు వాళ్లు, పేరంబలం వాళ్లు అతనిని దాయకట్టు ఆట ఆడేందుకు పిలిచేవాళ్లు. ఆ వేడుకలు ఇప్పటికీ జరుగుతున్నాయి.

పెద్ద పెద్ద ఆటగాళ్లు అందరూ చనిపోయారు. ఇప్పుడుండే వాళ్లందరూ చిన్నవాళ్లే. ఇప్పటి ఈ ఆటలలో పూర్వపు ఉత్సాహము ఉండటం లేదు.

ఉత్సవములలో విగ్రహములు ఊరేగునప్పుడు, జరిగే ఆట పాటలను చూసినప్పుడు తండ్రి తలంపులు వచ్చేవి. ఆయనపట్ల విచారముతో కూడిన అభిమానము పెరిగేది.

ఈ ఆటలో ఎంత పందెము వేయాలో సరిగ్గా అంతే వేయగల నైపుణ్యం ఆ గ్రామంలో ఒక్కనికే ఉంది. అతను తన తండ్రే.

'నా మిత్రులూ, నేనూ కన్నులారా చూసినదే. పేరంబలం వారి గ్రామము నకు వచ్చేందుకు నాకు సంతోషమే. అక్కడ ఎవరెవరు ఆడుతున్నారు, వారికి ఎదురుపడి 'మూడు కాయలు' వేస్తేచాలు. ఓడితే మానభంగమే. అయినా ఫర్వాలేదు. ఆట ఆడటానికీ, ఆడే వారందరు ఓడేవారే. తర్వాత మంత్రగాడి దగ్గరకు పోయి మంత్రములు వేసే వారే. మనల్ని గెలిచే వారెవ్వరు. ముప్పై రెండు సార్లు గెలిస్తే జయించినట్టే. అతని దాయకట్టు చేతిలో ఆడుతున్నాయి................,

తంబిరాన్ చిన్నవాడే! నిజం చెప్పాలంటే అతను కూడ ధైర్యస్థుడుకాడు. అతని చేతిలో దాయకట్టు లేకపోతే గెలవటం కష్టమే. నన్ను ముప్పర్ నిదానముగా అడిగాడు. "ఏమిటో చిన్నవాడా! మన ఊరి గౌరవం పోయే టట్లున్నది? "

అచ్చుమాన్ ఎందుకో గాని జవాబివ్వలేదు. సరైన మనిషి, అతను బిగ్గరగా అడిగాడు పోటీకి "ఎవరైనా వచ్చేవారున్నారా ?"

''చూడండి కొంతుణ్ణాయరున్నాడే."

''భక్తులు, మిత్రులు అన్ని దేవతలను బిగ్గరగా ప్రార్థించేవాళ్లే." వారు చేసే పార్థనలను ఎక్కడున్నా వినవచ్చును.

'ఆ దేవతను నేనెలా కొలిచేది' అలా చెప్పిన కోంతుణ్ణాయరు మనసుకి ఏదోలాగ తోచింది. ఎవర్ని భగవతినా! అలా చెప్పినప్పుడు నాశరీరమంతా అంపాలతో కోస్తున్నట్లుంటుంది. కళ్ళు మూసుకొని ఒక్క ఘడియసేపు నామ స్మరణ చేశాడు. పందెం చెప్పి దాయం వేశాడు. పన్నెండు పడింది.

'కళ్లు ఉబ్బినాయి. తెరచి చూస్తే ఎఱ్ఱగా ఉంటాయి.'

వెంటనే రెండవసారి కోడి కూసింది. సమయం మళ్ళీ పన్నెండు.

తర్వాత దగ్గి చిన్నగా శబ్దము చేశాడు.

ఆట జరుగుతుండగా ఒకడు పందెం చెప్పాడు. ఇంకొకడు మూప్పరు వద్దకు వచ్చాడు. మూప్పరు ఆటను గమనిస్తున్నాడు. "చూశావా! ఆట!"

'అటువంటి వాడు ఇక పుట్టడు.'

— గూడలూరులో ఇంతకు ముందు పేరుగన్న ఆటగాడైన కుట్టిన్ నాయరు అన్నాడు.

ఈ ఆటగాడు ఇరవై ఒక్క సంవత్సరముల వయస్సులోనే కుట్టిపురము లోను, వళ్లంచేరిలో వున్న ఆటగాళ్లను ఓడించిన వాడు.

దక్షిణ ప్రాంతములో అపజయమే ఎరుగనటువంటి గొప్ప ఆటగాడు అతను. అతని ఇంటిముందే ఈ ఆటలు జరిగేవి. ఆడటానికి వచ్చిన వారం దరు ఓడిపోయేవారు. అక్కడ తన తండ్రి 'ఓణం', 'పౌర్ణమి' పండుగలకు వెళ్ళేటప్పుడు అప్పు పణక్కరు కూడ ప్రక్కన ఉండేవాడు. అప్పు పణక్కరు ఇప్పటికీ దానిని గురించి చెప్పని రోజు లేదు. ఆట మొదలు పెట్టిన మూడవ రోజు తన తండ్రి ఆటలో గెలిచాడు. చాకలి చేసిన పనివల్లనే సూతుని గెలి చినది నాల్గవనాటి సంధ్యవేళలోనే. ఇసుక వేస్తే క్రింద రాలనంత జనం వేడుక చూడటానికై వచ్చారు. ఆఖరికి గెలుపొంది ఆటనుండి లేచినప్పుడు చాకలి తన తండ్రికి నమస్కరించి చెప్పాడు.

'ఇక నుండి ఆడుటకు నేను రాను. ఇంతటితో చాలు.'

ఆరోజు నాల్గు పౌన్ల బరువుగల తెల్లకంచు దాయకట్టును ఇచ్చి కోంతుణ్ణి నాయరును చాకలి సన్మానించాడు. వాటిని పందెం చెప్పివేస్తే, ఈ క్రింద పడినప్పుడు వచ్చే శబ్దము వింటే ఈ కాలపు పిల్లలకు గుండెలదిరి పోతాయి. వాటి కోసమే పణక్కర్లను ఓడించాడు. ఈ విధముగా ఎంతగానో చెప్పేవారు. అవన్నీ తన తండ్రిని గురించిన విషయాలు.

పల్లెప్రాంతములోని యువకులందరూ తండ్రి వెనుక తిరిగినవారే. అతను అంటే అందరికీ ఎంతో అభిమానము. ఆయన పెండ్లి అయిన తర్వాతనే స్నేహితులందరూ ఆతని తండ్రిని విడచి పెట్టారు. తండ్రి తల్లితో రావటమే దానికి కారణము.

ఉత్తరబాట భూస్వాముల ఇంట్లో కోంతుణ్ణినాయరు చేరడం వారందరికీ ఈర్ష్య కలిగించి వుండవచ్చు

తన తండ్రి ఆ యింట్లోకి రావటంతో ఆ యింటి గౌరవము తగ్గింది. మూడు, నాలుగు తరాల ముందు తన తండ్రి వంశములో ఒక యువతి ఎవరితోనో లేచిపోయింది. ఆ కారణంగా ఇతనిని హీనముగా చూసేవారు. అతను ఏజాతి వారితోనైనను కలసి మెలసి తిరిగేవాడు. మాప్ల మలయాళీ ముస్లింతో కలసి టీ తాగేవాడు. ఆ కాలంలో టీ త్రాగటమే ఒక పెద్దతప్పు. ముస్లిములు తయారు చేసిన టీ హిందువులు త్రాగటం క్షమించరాని దోషం. ఉత్తరబాట వారింటి అభిప్రాయములో దాయకట్టు ఆడటం కూడ తప్పే. అందువల్ల దాయకట్టు ఆడేందుకు వెళ్ళే సమయంలో కల్లు తాగేవాడు. అటువంటి మనిషికి తమ ఇంటి ఆడపిల్లను ఇచ్చి ఎలాగు పెళ్లి చేస్తారు?

తల్లి తోబుట్టువు ఒక సోదరుడు ఉండేవాడు. అతణ్ణి అప్పుణి 'మాధవ మామ' అని పిలిచేవాడు. మాధవ మామ తన తండ్రి కలసిమెలసి వుండేవారు.

అది పెద్దమామ ఇంట్లో లేని రోజు. ఆ రోజు ఎవరినీ ధాన్యగిడ్డంగిలోకి రానివ్వరు. సాయంకాలం ధాన్య గిడ్డంగి గుమ్మము వద్ద మాధవ మామ, తండ్రి మాట్లాడుకొంటున్నారు. ఎంతసేపు మాట్లాడుతున్నదీ వారికి తెలియలేదు. లోపల నుంచి పెద్దమామ గొంతు విన్న తర్వాతనే వారికి జ్ఞప్తికి వచ్చింది.

" ఎవర్రా అది గిడ్డంగిలో? "

ఇద్దరూ మెల్లిగ బయటికి వచ్చారు. మెల్లిగ చప్పుడు చేయక, మునివ్రేళ్ళపై నడుస్తూ నడవలోకి వచ్చారు.

" ఎవరది మాధవా నీతో "

అప్పుడు తండ్రి సమాధానం చెప్పాడు. "నేనే మొగలితోట కోంతుణ్ణిని."

"పొద్దు పోయి, చీకటి పడిన తర్వాత పై మనుష్యులకు ఇక్కడేమిటి పని? "

తండ్రి వినయంగా సమాధానం చెప్పాడు. "నేను ఉత్తరకట్టుకు వెళ్ళ లేదు. ఇక్కడ ఒక యువకునితో మాట్లాడుతున్నాను."

పెద్దమామ తొందరగా నడుస్తూ చెప్పాడు. "బయట నిలబడి మాట్లా డుకో. పనైతే వెళ్లిపో. అలా కాకుండ ఉత్తర బాట వారి గిడ్డంగిలో గడపటం మగవాళ్ళకి పనికి రాదు."

తండ్రి కోపంతో సమాధానం చెప్పాడు. "నేను దొంగతనంగా రాలేదు. ఈ ఇంటి పిల్లను ఎలా పెళ్లిచేసుకోవాలో కోంతుణ్ణికి తెలుసును."

'అబ్బో' పెద్దమామ తల ఆడించాడు.

తండ్రి గాండ్రించి ఉమ్మేశాడు.

"ఓయ్ కుర్రాడా" అలా పిలిచింది ముత్తాచి.

దక్షిణవైపు గదిలో తలుపు ప్రక్కనున్న కిటికీలో నుంచి ఎవరో తొంగి చూస్తున్నారు. అమ్మ.

అప్పుడు అమ్మ వయసులో చిన్నది. ఉత్తరబాట పెద్దింటి వారి చిన్న మేనకోడలు. ఆమెకు పెండ్లి సంబంధం నిశ్చయించి ముహూర్తం కూడ నిశ్చ యించారు. పన్నెండు గడియల దూరములో నున్న మెట్ట, పల్లపు భూములున్న పెద్ద భూస్వాములే మగ పెళ్లివారు. వారి ఇంటి ముందు భాగంలో పందిళ్లు వేశారు. రాజుల వారితోట నుండి మొగలి తోట వరకు ఉన్న భూములన్నీ వారివే. ఆ భూములన్నీ సస్యశ్యామలముగ వున్నాయి. దేహండం, కోడికున్నం నుండి కుట్టివారు, పట్టన్ వారు ఆహ్వానించటం జరిగింది.

కాని ఆ వివాహము జరుగలేదు.

మగ పెండ్లివారందరు వచ్చిన వెంటనే వారికి తెలిసింది-పెళ్ళి కూతురు లేదు.

ఆశ్చర్యముతో అతనడిగాడు "అదెట్లా ముత్తాచి ?"

"కోంతుణ్ణి పారుకుట్టిని తీసుకొని వెళ్ళిపోయాడు. అదే." అప్పటి రావ ణుడు పుష్పక విమానంలో సీతాదేవిని ఎత్తుకెళ్ళిన సంగతి, కథలుగా విని వున్నాడు. రావణుడు దుష్టుడు. శ్రీరాముని భార్యను బలత్కారముగ తీసు కెళ్ళడము దుష్టతనమే కదా!

అర్జునుడు సుభద్రను ఎత్తుకొని పోయిన కథ కూడ అతనికి జ్ఞాపికి వచ్చింది. అర్జునుడు మహా వీరుడు, ధనుర్విద్యలో అతనిని జయించే వారే

లేరు. మలయాళీ పాఠ్య పుస్తకములో ఈ కథలను చదివి యున్నాడు. అర్జునుడు సన్యాసి వేషం వేసుకొని శ్రీ కృష్ణుని ఇంట్లో ఉండి, సుభద్రను అపహరించుకొని పోయాడు. సమర్థుడు! అతనితో యుద్ధం చేయడానికి యాదవులకు సాధ్యంకాలేదు.

సుభద్రను రథములో తీసుకొని పోయే భాగము చదువుతున్నప్పుడు కూనల్ ఛాత్తు నాయరు గారి ప్రవచనములే గుర్తుకు వచ్చాయి. ఆ పాఠమును ఆసక్తికరంగా చెప్పే సమర్థత ఆయనొక్కరికే వుంది.

"నాకేమి తెలుసును మిత్రుడా! అలాంటి వాడు ఇక జన్మించటం అరుదు."

ఆయన వివరించాడు.

'పొలములో వర్షములవల్ల నీరునిండి పోయింది. అంతవర్షం, నీటిమట్టం పెరుగుతున్నది. అట్టి సమయంలో నీటిలో వరిపంట పైభాగమే కన్పిస్తున్నది. నీటి కదలికతో అవి కూడ అందముగా కదులుతున్నాయి.

లాంతరు దీపాన్ని చూపించి వెనుక వస్తున్న కూనిన్ బాత్తు నాయర్ అడిగాడు "అతను వెనుక వస్తున్నాడా?"

అప్పుడు తిరిగి నిలబడి చూస్తూ చెప్పాడు. "నేనూ ఒక మనిషినే! పుట్టినప్పుడే చావున్నది "

ముత్తమ్మ కథ చెబుతున్నప్పుడు కొన్ని సమయాలలో తచ్చోళి చందు, కోమప్పన్ వారి తలంపులు వచ్చేవి. చిన్నతనములో వినిన కథలు అవి.

"పోనీ, నీకు దేవుడు ఇచ్చి పెట్టలేదు."

కొత్తలవారి యంత్రశాలలో ఒకరోజు ఇద్దరూ విశ్రమించారు. యంత్రశాలకు సంబంధించిన పొలములలో తన తండ్రి కొంత పొలముకొని అందులోనే చిన్న ఇల్లు కట్టాడు.

'రెండు మూడు సంవత్సరములలోనే ఆ నేల బహు సారవంతమైంది.'

తల్లి ఇంటివారందరు, ఆమె క్రింది జాతివానితో సంబంధము పెట్టుకొని యుండుటచే, ఆ పెద్దింటి గౌరవము నాశనం అయిందని బాధపడ్డారు.

పారుకుట్టిని లేవనెత్తుకుపోయిన కోంతుణ్ణి నాయరు గురించి ఆ ప్రాంతములో అందరి నోళ్ళల్లోను రకరకాలుగా ప్రచారం జరిగింది.

అప్పుడు అప్పుణికి మూడేండ్లు. ఆ ప్రక్క నున్న వెదురు తోటను తన

తండ్రి వేలములో కొన్నాడు. సైదాలికుట్టి, తన తండ్రి కలసి భాగస్థులయారు. ముత్తాచి చెప్పింది.

"కర్రలు తయారైతే—పళ్లపుతోట నుంచి ఉత్తర వరకు నరికి పెట్టాలి."

ఎంతటి వాడైనా సులభముగ వెయ్యి రూపాయలు ఇస్తాడు. అంత ముదిరి వున్నాయి ఆ కర్రలు. పళ్ళిపురం నుంచి వచ్చిన వర్తకుడొకడు మొత్తంగా కొని కొంత డబ్బు ముందుగ ఇచ్చి వెళ్ళాడు. ఆరాత్రి సైదాలి కుట్టి తన తండ్రిని విందుకు పిలిచాడు.

అప్పుడు అప్పుణి సందేహంగా అడిగాడు.

"మాప్లవారు ముస్లిములు కదా. వారింట్లో మనం భోంచేయవచ్చా?"

"నీ తండ్రికి చెప్పాలా?"

ఆ రాత్రి వాళ్ళిద్దరూ మాంసము తిని, మధ్యపానం చేశారు. మాంసము కొంచెము వాసనగా వుంది.

మేలైన వేట మాంసమని సైదాలికుట్టి చెప్పాడు. పళ్ళిపురములోని ముత్తుళికున్నిములోనె సైదాలికుట్టి ఉండేది. విందు భోజనముచేసి ఇంటికి తిరుగుముఖం పట్టాడు తండ్రి. రాతి మండపం దగ్గరికి వచ్చేటప్పటికి కడుపులో ఏదో వికారంగావుంది. రెండడుగులు వేసినతర్వాత కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది. ఒళ్ళు తూలింది. కడుపు బిగుసుకొనిపోయింది. ఇంకొక రెండడుగులు వేసేటప్పటికి మూర్ఛపడిపోయాడు.

—అప్పుణి కళ్ళల్లో నీళ్లు నిండాయి. అప్పుడు, సంతలో కాయగూరలు అమ్మి చందు తిరిగి వస్తున్నాడు.

"ఎవరయ్యా అది?"

"నేనే చందా."

"ఏమిటయ్యా ఇక్కడ పడి బాధపడుతున్నావు?"

"సైదాలికుట్టి నన్ను మోసం చేశాడు, చందా!"

—అప్పుణి కన్నులలో నీరు నిండింది.

చందు అతన్ని నడిపించుకొని ఇంటికి వచ్చినపుడు అమ్మ దీపం వెలిగించి, భర్తరాకకై ఎదురు చూస్తున్నది, అప్పుణి నిద్రపోతున్నాడు.

"పారుకుట్టీ' అని పిలుస్తూ క్రింద పడిపోయాడు తండ్రి. మనుష్యుల నెవరెవరినో పిలిచింది ఏం లాభం! అతని అదృష్టం బాగలేదు."

అప్పుణి వెక్కి వెక్కి ఏడ్చాడు.

అప్రాంతంలోనివారందరూ ఈవిషయమై చర్చించుకొనేవారు. పోలీసులు వచ్చి శవ పరీక్షచేస్తారని చెప్పుకునేవారు. అతనికి అర్థంకాలేదు. అలాగ జరగనూలేదు.

"అత్తుణి ముయళాళికి డబ్బు ఇచ్చి కేసులేకుండ చేశాడటనే ఆ ముస్లిము ?"

శత్రువులలో ఒకడు అప్పుణి మనసులో అత్తుణీ ముయళాళి పేరు నాటుకొనేలా మాట్లాడాడు.

ఆ మనిషి చనిపోయినట్లు ఆతర్వాత తెలుసుకున్నాడు. అదీ ఒకందుకు మంచిదిగానే తోచెను.

విషమిచ్చి కదా తండ్రిని చంపేశాడు సైదాలికుట్టి. మేక మాంసములో విషమును కలిపి ఇచ్చేశాడు. మాప్లవారివద్ద విషముండేది. వాళ్లను చూస్తేనే భయంవేసేది. మనుషులను చంపివేయటం వాళ్ళకు తెలుసు.

ముత్తాచి అప్పుడప్పుడు చెప్పేది.

'నువ్వు గొప్పింటి బిడ్డవురా!'

మనసులో ఆ వాక్యాయమును మననం చేసుకొనే వాడు అప్పుణి. ఆ పెద్దింటి పొలములో నుంచి సంవత్సరమునకు పదివేల బస్తాల ధాన్యము పండేది. ఇది చాల కాలము ముందు జరిగిన కథ. ముత్తాచి రెండవ భర్త వల ననే పొలములన్నీ నాశనమాయ్యాయి. పొలమును భాగము చేసేటప్పుడు ఒక భాగమునకు అరవైనాలుగు నౌకర్లు నియమించబడ్డారు.

అరవైనాల్గు నౌకర్లు పనిచేసే ఇల్లది.

అప్పుడు ఆ యిల్లు అవిభక్త కుటుంబపు ఇల్లుగా వుండేది. భాగాలు పంచుకొనటంవల్ల ఆ యిల్లు చిన్నా భిన్నమైపోయింది. ఇప్పుడుకూడా పూజా గృహముతో నాలుగు భాగాల ఇల్లది. ధాన్య గిడ్డంగి ఉంది. వడ్లు దంచే చేతి యంత్రము కూడ ఉంది. ముత్తాచి అక్కడకు నెలకో లేక రెండు నెలల కొక సారో వెళ్ళేది.

ఇప్పుడది చితికిపోయిన భూస్వాముల ఇల్లు. ఎవరైనా ఆ యింటి వాకిళ్ళను చూస్తే ఆశ్చర్యపోతారు.

- అమ్మ తనకు గంజి కాచి ఇచ్చేసి పనికైపోయేది. గుమ్మం కదలి పోతుంటే ముత్తాచికి ఏమైనా కావాలంటే కొంచెం శబ్దం చేసి చెప్పేది.

అంతా దైవలీల, ఉత్తరాది వారమ్మాయి ఇంకొక ఇంటిలో గానుగ ఆడించుటకై పోతున్నది. దేనికైనా తలవ్రాత కారణం. తలరాత బాగుండాలి.

ఉత్తర బాటవారి పెద్దయింటి కాపురం కథ చెబుతుంటే వినడానికి రోజులు చాలవు. ఎప్పుడైన అమ్మ అడిగితే ముత్తాచి చెప్పేది. ఆమిన్ ఉమ్మ, కోచ్చి కూడా చెప్పేవారు. ఆ కథలు వింటున్నప్పుడు అమ్మ ఎవరికీ తెలియకుండా కన్నీరు తుడుచుకొనేది.

'ఏయ్ అమ్మాయి, నిన్నెలా పెంచారనుకొన్నావు. క్రింద పడుకోబెడితే చీమలు ఎక్కడ కరుస్తాయో అన్నట్లు పెంచారు'– ఆ అమ్మాయికి యుక్త వయసొచ్చినప్పుడు భోజనమునకే ఒక బస్తా బియ్యం పట్టింది.

ఇలా పెరిగింది అప్పుణి తల్లి. అయితే ఇప్పుడు......

వేకువ జామునేలేచి, గంజికాచి ఉట్టిలో పెట్టి, అప్పుణి బడికిపోవటానికి వేసుకొనేందుకు షర్టు, ట్రౌజరు అరుగు పై తీసిపెట్టిన తర్వాతనే పనికి పోయేది. అప్పుణి లేచి కాలకృత్యములు తీర్చుకొని కరివేపాకు పచ్చడి నంజుకుని గంజి తాగేవాడు.

పనిచేసే ఇంటికి తనకూడ అప్పుణిని తీసుకొని పోయేందుకు ఆమెకు ఇష్టములేదు. అయినా ఒకరోజు అతను అక్కడికి వెళ్లాడు. అప్పుడు అతని వయస్సు అయిదు లేక ఆరేండ్లుండవచ్చును. అతనికి ఇప్పటికి జ్ఞాపకముంది. పెద్దయిల్లు, వడ్లు ఎండవేయడం, ఉడకబెట్టటమే అమ్మపని. చెవులలోని పెద్ద బంగారు రింగులు కదిలేట్లు కుంజత్తోలు బిగ్గరగ అన్నది.

"అమ్మాయ్, ఆ చెక్కతో వడ్లు నెఱపు."

"లేకపోతే వడ్లు దంచు. ఆ యంత్రం ప్రక్కనున్న ఊకను ఒక ప్రక్క ఎత్తిపెట్టు."

వెనుకనున్న గడపదాటి పోతే, వంటిల్లుకి దారి. అ దారిలోనే అమ్మ వెళ్ళేది.

అమ్మతో తాను వెళ్ళిన రోజున కుంజత్తోలు అడిగింది. "నువ్వు పారు కొడుకువా?"

అ సంబోధన అప్పుణికి నచ్చలేదు. తన తల్లి పేరు "పారు" కాదు. పారుకుట్టి 'కొడుకువా' అని సంబోధించినది కూడ అతనికి నచ్చలేదు.

రోలు ప్రక్కన అతను తలవంచుకొని నిలుచున్నాడు. తల్లికి అక్కడ పని ఎక్కువగా వుంది. ఇంటి బయట అరుగుమీద వక్క మట్టలకట్ట పెట్టుకొని, కాలిలో గజ్జెలు, మెడలో దారంతో గుచ్చిన పూసలదండ, వెంట్రుకలను కలిపి కట్టినట్లున్న ఒక ఉణ్ణి. ఆమె వల్యంబురి కూతురు. వల్యంబురి గడపపై కాలూనినట్లుగ అరుగుపై కూర్చున్నాడు. అక్కడ నుంచి ప్రక్కనున్న వార్ని గూడ చూడగలడు. అతను ఊరికే కోపగించుకొనేవాడు. మొదట అతన్ని చూస్తే నవ్వుతున్నట్లు కనబడ్డాడు.

ఆ మధ్యాహ్నం నంబూద్రింట్లో అన్నం తిన్నాడు. పెద్ద కుంజాత్తోలు, చిన్న కుంజాత్తోలు, ఉణ్ణీ, ఉణ్ణీ ఇల్లాలు అందరు భోంచేసిన తర్వాత గదిలోంచి కుంజత్తోలు పిలచాడు.

"ఏయ్ పిల్లా"

అలా పిలచినది తన తల్లిని!

వాకిట్లో ఒకదానిపై నొకటిగ రెండు ఎంగిలాకులు పెట్టి వున్నాయి. అమ్మ ఆ రెండింటిని తీసుకొచ్చి రోకటి ప్రక్కన రాతిపై పెట్టింది. ఆ రెండు ఆకులలోను ఎంగిలి అన్నం, కూరలు, బాగుగ చీకేసిన మామిడి టెంకలు వున్నాయి.

అతనికి వాంతి వచ్చినట్లయింది.

"నాకొద్దు."

"నీ కాకలిగా లేదా?"

"నాకు వద్దు, నాకు వద్దు"

తన దుఃఖమును చూపకుండా అతను అన్నాడు. అప్పుడు అమ్మ ఎంగిలాకులను క్రిందపెట్టి నుదురు చిట్లించి అతనిని చూసి "నా కర్మ" అన్నది.

అతని మనసులో తీవ్రమైన ఆలోచనలు రేగాయి.

ఆ తర్వాత అమ్మతో అక్కడికి పోలేదు. సాయంకాలం అమ్మ ఇంటికి వచ్చేటప్పుడు చేటలో బియ్యం తెచ్చింది. ఒంటినిండ తవుడు, దుమ్ము పట్టి వుంది. చీకటి పడిన తర్వాత తల్లీ కొడుకులు స్నానం చేయటానికి బావికి వెళ్ళేవారు.

తన యింటికి పడమరగానున్న గుడి ప్రక్కన ఒక చెరువుంది. ఉత్తర పార్శ్వంలో రాళ్ళు, రప్పలు, చెట్లు చేమలున్నాయి. ఆ పొదల్లో గుడ్లగూబలు

గుడ్లు పెడతాయి. దక్షిణవైపున సముద్రపు ఒడ్డున క్రొత్తగా ఒక రేవు కట్టారు. పడవలు ఆగే స్థలంలో నల్లరాతిపైన 'కేశవ నంబూద్రి వారిది' అనిచెక్కి వుంది. గుంటలో స్నానం చేయటానికి పోయినప్పుడు అతని స్కూలు స్నేహితులు కలిసేవారు. చక్కగా ఈతకొట్టి, శుభ్రముగ స్నానం చేసేవారు. అయితే తాను గుంటకు రావడం అమ్మకు యిష్టంలేదు. ఇల్లు వదలితే ఉత్తరపు వారింటికి అక్కడ నుండి తిరిగి ఇంటికి రావటమే అమ్మకు అలవాటు.

రాత్రిళ్లు అమ్మ తనకన్న ముందుగానే నిద్రపోయేది. కాని తాను కొంచను చిన్నగా మూలిగితేసరి అమ్మ వెంటనే మేలుకొని ఆందోళన పడేది. "ఏమిటి అప్పుణీ?"

పసితనంలో తనను ఉయ్యాలలో పడుకోబెట్టి జోల పాటలు పాడేది. శ్యామల వర్ణుడైన శ్రీకృష్ణుడు పశువులను మేపుటగూర్చి, గోపికలతో నుండుట గురించిన పాటలు అవి. శ్రీకృష్ణుడు వరిబియ్యముతో మధురమైన భక్షణముల అరగించుట గూర్చి కూడ ఉండేవాపాటలు.

నిద్రరాని సమయాలలో ఆ చీకటిలో మనసు ఆందోళితమైనప్పుడు, చీకటిలో ఏదో నీడ తిరుగుతున్నట్లు, ఆనీడను కొంతమంది ఆడవాళ్ళు అనుసరిస్తున్నట్లు భ్రమించేవాడు. అదే విగ్రహము........

మళ్ళీ అవే ఆలోచనలు.

బహుశః చనిపోయినవారి ఆత్మలు రాత్రుళ్లు సంచరిస్తాయేమో.

స్వర్గంలో నుండి.........................

*　　　　*　　　　*　　　　*

పరీక్షలు ముగిసిన తర్వాత బడికి శలవులివ్వటంతోనే అప్పుణి కలవరపడ్డాడు. ఇంక నలభైఆరు రోజులు ఎలా గడపాలి! పొద్దు పుచ్చడము అతనికి కష్టముగా తోచింది.

అమ్మ పనికిపోతే ఒంటరిగా ఉండాలి.

అయినా సరే ఇంట్లో వుండటం కష్టముగా వుంది.

నలభైఅయిదు రోజులు గడపాలి. ఒక రేకుడబ్బీలో నలభైఅయిదు రాళ్ల నేరి పెట్టాడు. రోజుకొకటిగ తీసి పారవేసేందుకు.

కుండ్లవారింటి గుమ్మంలో వున్న ఎర్రరాతిగోడ దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు

అప్పుణి. కేశవుడు వచ్చాడంటే తాటాకు బంతిచేసి ఇస్తాడు. హాయిగా ఆడ వచ్చును.

కానీ కేశవుడు బయట కనపడలేదు. అతనికి ఎండవేడి అంటే చాల భయం. బయటకు వెళ్లరాదని అతని తల్లి హెచ్చరించింది. తుంటరి పిల్లలతో చేరరాదని ఆజ్ఞ జారీచేసింది. అందువల్లనే అతను కేశవుని లోపలకు వెళ్లి పిలవలేదు.

క్రింద రాలిన కుంకుమ వర్ణ పువ్వులను ప్రోగుచేసి వాటిని నలువైపుల చిమ్ముతూ కాస్సేపు గడిపి అక్కడే కూర్చొన్నాడు.

నలభైఅయిదు రోజుల తర్వాత బడి తెరుస్తారు. ప్యాసవుతాననే నమ్మక ముంది. సర్టిఫికెట్టు తీసుకొని తృత్తాలం (ఊరుపేరు) బడిలో చేరాలి. పెద్ద బడి అది.

ఆ ఊరు చాలా దూరంలో వుంది. టిఫన్‌కారియర్ ఒకటి అన్నము తీసుకొని వెళ్ళుటకు ఉంది. పాత్రసామానులవాడు వీధిలో పోయేటప్పుడు పిలిచి బేరం చేసి, అమ్మ అయిదున్నర రూపాయలకు దాన్ని కొన్నది.

ఎందుకు కొనడం?అని అడుగలేదు. అయిదున్నర రూపాయలు కావచ్చు? అప్పటికి అమ్మకి ఆ కారియర్ దొరికిందని సంతోషముగా వుంది. రూపా యకు ఇరవై కొబ్బరిమట్టల చొప్పున ఒక రూపాయ సంపాదించింది. ఎనిమిది తొమ్మిది మట్టలు విరిగిపోయాయి. అవి కూడ వుండివుంటే చేర్చి అమ్మియుండ వచ్చునని అమ్మ చెప్పింది.

ఇంటి ముందునుంచి ఎవరిదో కంఠం వినపడింది. సందేహముతో తిరిగి చూస్తే, ముత్తాచి. చేతికర్ర ఊతతో ఒంగి నడుస్తూ వచ్చింది. రేవులో గడ సహాయంతో కదిలే పడవలాగ ఉంది ఆమె నడక. గత మూడు నాలుగు రోజు లుగ ముత్తాచి ఇంట్లో లేదు. బయటకు ఎక్కడికో పోయింది.

పడవ సాగుతున్నట్లు మెల్లిగా నడచివచ్చి పిలుస్తున్నట్లు సంజ్ఞచేసి పక్కకు వచ్చి చేతికర్రను అతని తలవైపు చూపించి నేలపై కొట్టింది. క్రింద వరస పళ్లను చూపుతున్నట్లు గట్టిగా నవ్వింది

"నన్ను పైకుట్టి అని కదా అనుకున్నారు."

అలా అనటం ముత్తాచికి ఒక సరదా.

"మూడు నాలుగు రోజులుగా ముత్తాచికి పండుగనుకుంటాను,"

వీరుడిలాగ, ధైర్యముగ రొమ్ము చూపిస్తూ అడిగాడు అప్పాణి.

"నాకు పండుగేరా అబ్బాయి! కంటితో చూడలేని ఎండ వేళలో ఎక్కడ కురా వెళ్ళివస్తున్నావు?"

ముత్తాచితో అతను నడిచి వెళ్ళాడు. ఇంటి తలుపు తెరిచి, మూటను క్రిందపెట్టి, చేతికర్రను గోడకాన్చి కూర్చోని చెప్పింది.

"ఏయ్ చిన్నాడా....ఇంక ఎండ వేళలో బయట తిరిగే పని మానుకో."

"ముత్తాచి నీ వయసెంత?"

"అదా చాల వయసైందిరా! ముత్తాచి ఈ నాటి మనిషి కాదు కొలంబో, సింగపూరు లాంటి ఊర్లకు నడిచి వెళ్ళింది ఈ ముత్తాచి."

కొలంబో, సింగపూరు ఈ రెండు ఊర్లని చేర్చి చెప్పేదావిడ. ముత్తాచి కొలంబోకు వెళ్ళి వుంది. దీనిని గూర్చి ముత్తాచి అందరితోను గొప్పగా చెప్పుకునేది.

గూడలూరు నుంచి విదేశాలకు వెళ్లిన స్త్రీలు ఇద్దరే. కొండ ప్రక్క క్రొత్తగా మిద్దె ఇల్లు కట్టిన అమ్మాళమ్మ, ఆమె భర్తకు కొలంబోలోనే ఉద్యోగం. అమ్మాళమ్మకు తోడుగా ముత్తాచి వెళ్లింది. అప్పుడు ముత్తాచికి ఇంత వయసు లేదు.

'రెండేళ్ళు కొలంబోలో వున్నాను. ఇక్కడేమిటి సుఖం? అక్కడి వాళ్లు ఎంగిలిచేత్తో కాకిని కూడ తోలరు. తోట్టపరేలులో ఓ తమిళ స్త్రీ ఉండేది. పేరు కణ్ణమ్మ. ఇచ్చి పుచ్చుకొనడాలు తెలిసిన మనిషి."

ఆ కణ్ణమ్మ గురించి అప్పాణి ఎంతో అడిగి తెలుసుకున్నాడు. ఆమెను డబ్బిచ్చి కొన్నారట.

ముత్తాచి నావలోకి ఎక్కినప్పుడు భయపడి వాంతి చేసికొన్నట్లు, కణ్ణమ్మకు మలయాళం నేర్పినది, సింహళ స్త్రీతో వివాదం జరిగినది మొదలయిన సంగతులు చెప్పటం ప్రారంభించితే అప్పాణి ఒళ్ళు మరచి వినేవాడు.

"ముత్తాచీ, ఎక్కడకు వెళ్ళావు? "

అప్పాణి నులక మంచంపై కూర్చుని అడిగాడు.

" ఎక్కడికీ లేదు. ఉత్తరాది వారింటికి పోయొచ్చాను. అక్కడ భువనేశ్వరీ పూజారితో పని. ఇప్పుడు అరటితోట ప్రక్కనున్న గుడిలో పూజ జరుగుతుంది. "

ఒక రోజు భువనేశ్వరి పూజ జరిగింది.

మర్నాడు గుడిలో పాటలు, భజనలు జరిగాయి.

అక్కడుండే పిల్లలకు ఎంతో సంతోషంగా ఉంది. భాస్కరుడు, కృష్ణన్ కుట్టి, తంగం - పేర్లు మాత్రమే అతనికి తెలుసును. అపైన ముత్తాచి ద్వారా తెలుసుకున్నాడు. ఎవర్నీ చూసినది లేదు. పెద్దమామ, చిన్నమామ, ఇద్దరు పెద్దమ్మలు ఉన్నారు. అమ్మమ్మ ఉన్నది. పిల్లలు ఎంత మందో? ఆ పిల్లల వయసు అతనికి తెలియదు.

"భువనేశ్వరి పూజ అంటే ఏమిటి ముత్తాచి అవ్వా?"

ముత్తాచి పాటలాగ చెప్పనారంభించెను.

"అటుకులు, పువ్వులు, పంచదార, కొబ్బరికాయలు, పండ్లు ఫలహార ములు తీర్థములు........"

ఇన్ని రకముల పేర్లు వినేటప్పటికి అప్పుణి నోరూరింది.

"మరి కోడికూర....నేను అప్పుణికోసం ఒకటి తీసుకొచ్చాను."

మూటను విప్పి బయటకు ఏదో తీసింది.

"చాలదూరమా ఆ ఊరు ముత్తాచీ?"

"కొలంబో గురించి అడుగుతున్నావా?"

"కాదు. అక్కడికి....ఉత్తరాది వారింటి ఊరికి...."

ముత్తాచి ఆ దారి ఎట్లాపోయేది వివరించింది. దారి దగ్గరే. ఇంటినుంచి పడమటి వైపున వున్న మధ్య రహదారి గుండా వెళ్ళి రెండు కొండలను దిగి వెళితే ఉత్తరాది వారింటి గుమ్మము. కాని ముత్తాచి ఆ దారిగుండా పోవడం లేదు. కొండలు ఎక్కి దిగటానికి ఆమెకు శక్తిచాలదు. పొలము ప్రక్కగా వెళితే ఇంకొంచెం దూరం నడవాలి. ఇలా వెళ్లినా కూడ ఉత్తరాది వారింటికి వెళ్ళవచ్చును.

"పెద్ద ఇల్లా? ముత్తాచీ?"

"చిన్నచిన్న భాగాలుగల ఇల్లు. ఆ కాలపు చుట్టు ప్రాకారంగల ఇల్లు. నా చిన్నతనంలోని మాట. అప్పటి స్థితి ఏమని చెప్పను? మూడు చేతి యంత్ర ములుండేవి. ఎనిమిది భాగాలున్న పెద్దఇల్లు, మధ్య రెండు పెద్ద పెరడు లున్నాయి. ఆ కాలం వెళ్ళిపోయింది."

"ఇకపై ఒక్కసారైన ఆ గుమ్మం ఎక్కలేమా?"

"ముత్తాచీ, అక్కడికి మళ్ళీ ఎప్పుడు పోతావు?"

"వచ్చే ఆదివారం పోదామనుకొంటున్నాను. తుళ్ళాట జరగ పోతుందట!"

తుళ్ళాట అంటే అతనికి తెలియదు. "ఒట్టం తుళ్లలాటా? ఆ ఆట బడిలో చూసిందే."

"కాదురా, పాము తుళ్ళటము. పాము తుళ్లలాట జరిగి పదిహేడు ఏళ్లయ్యింది. దానికి ముంగిస కావాలి. మూడు త్రాచుపాముల ఆట.

సర్పతుళ్లలాట, పాము పుట్ట ఉన్న యింట్లో ఈ రకమైన ఆట జరగటం రివాజు.

ఈ ఆటకు అందరూ వస్తారు. భాగం పంచుకొనిపోయిన వాళ్ళు, బంధువులు, మిత్రులు అందరూ వస్తారు.

అతని తల్లిని వారెవ్వరూ పిలువలేదు.

అతన్నికూడా ఎవరూ రమ్మని పిలువలేదు.

ఎందుకు పిలుస్తారు? ఎవరు పిలుస్తారు? తమకు ఆ యింట్లో భాగం ఉంటే పిలిచే వారేమో! ఆ యింటికి వెళ్ళకూడదనికదా అమ్మ చెప్పింది,

"తిండిలేక పస్తులు పడి చచ్చిపోయినాసరె ఆ యింటి గుమ్మంలో కాలుపెట్టను" అన్నది అమ్మ.

కానీ ఆ యింటి సర్పతుళ్ళలాట అతన్ని ఆకర్షించింది. ఇంకొకసారి చూసేందుకు అవకాశముండదు. అపూర్వంగా జరిగే ఆట అది. అతనుకూడ వెళితే ఏమవుతుంది.?

"ముత్తాచీ, నేను నీతోకూడ వస్తా."

"ఏమిటీ నువ్వు చెప్పేది?"

ముత్తాచి మోకాలిపై చేతులు ఆనించి నిలుచుంది. ముడుతలు పడిన కళ్ళతో అతనిని ఆశ్చర్యముగా చూసింది. కొంచెంసేపు ఏదో ఆలోచించి ఇలా అంది.

"మీ అమ్మ ఒప్పుకోదురా తండ్రీ !"

"అమ్మతో నేను చెబుతా."

'ఏం చెప్పవద్దు ఊరికేఉండు." అని ప్రేమతో అన్నది.

"నేను అమ్మను అడుగుతా!" ఆ కోపంలో అతను ఇంటి ముఖం పట్టాడు.

"అప్పూ!" ఇక్కడకు రారా!"

అతను తిరిగి చూడక ఇంటికి వెళ్ళిపోయాడు.

"నా యిల్లుకాదా అది? అక్కడకు నేనెప్పుడు పోవడం?"

నడిచేటప్పుడు, అన్నం తినేప్పుడు, స్నానం చేసేప్పుడు, ఎప్పుడూ ఈ ఆలోచనలే అతనికి రాసాగాయి. కాని అమ్మనెల్లా అడిగేది?

కన్ను మూసినా నిద్రరాలేదు. ప్రక్కలో పొర్లుతున్నాడు అమ్మ దగ్గరగా జరిగి, ఒదిగి పడుకున్నాడు.

"అక్కడ తుళ్ళలాటట అమ్మా!"

"ఎక్కడరా?"

"అక్కడే. మనయింట్లో."

అమ్మకు పూర్తిగ నిద్రమత్తు వదలిపోయింది.

అతను మళ్ళీ అడగలేదు. వచ్చే ఏడ్పును అణచుకొని ఊరుకున్నాడు.

మర్నాటి ఉదయం మళ్ళీ ముత్తాచి యింటికివెళ్ళాడు. అమ్మ నడిగి ఆమె సమ్మతము తీసుకొమ్మని మళ్ళీచెప్పింది. "నే చెబుతాను ఆ యింటికి పోవద్దు నువ్వు." కానీ అతని ఏడుపు ముఖంచూసి "సరేలే పోదాం" అని ఒప్పు కొన్నది.

ముత్తాచి అమ్మ దగ్గిరకువెళ్ళి సమ్మతానికై అడుగుతున్నప్పుడు నడవలో నుంచున్నాడు. ఏమీ తెలియని వాడిలాగ తోటలోకివెళ్ళి, అక్కడ ఉండే గుంటలోని మట్టిని కొంచెము తీసి నీళ్ళలోకి వేశాడు. మన్ను నీళ్లలో జారి పోతున్నప్పుడు చిన్న చిన్న బుడగలువచ్చే దృశ్యాన్ని చూస్తు న్నాడు. ఆ సమయంలో ఆమీను ఉమ్మ ఇంటి పెరటిలోని అరటితోటలో నుంచి గుడ్లగూబ కూత వినపడింది.

ముత్తాచీ అమ్మతో చెప్పివుండవచ్చని అతను ఊహించాడు.

అతను తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి ముత్తాచీలేదు, అమ్మ మాత్రమే ఉంది. మెల్లిగా లోపలికి వెళ్ళాడు, అమ్మ వంటింటి గుమ్మం తలుపుపట్టుకొని నిలబడివుంది. ఆమెను చూసినప్పుడు ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండివున్నాయి.

కళ్ళు తుడుచుకుని నెమ్మదిగా పిలిచింది—అమ్మ. "అప్పుణీ" అతను దగ్గరకెళ్ళాడు.

"అప్పుణీ, అదీ ఇదీ అని పెంకితనము చేయకూడదు తెలుసా!"

సందిగ్ధంలో పడ్డాడు.

"నీకు ఆ అదృష్టంలేదు. నీ అమ్మా, నాన్నా అంతగా నోచుకోలేదు."

అతను కళ్ళు తుడుచుకున్నాడు.

"ఏరా! అక్కడి కెందుకెళ్లాలంటావు?"

అప్పుణి ఆలోచనలన్నీ తెగిపోయాయి. అతను గట్టిగా ఏడ్చాడు.

"అప్పుణీ ఏడవకు."

అమ్మ వాకిలి ప్రక్కగాచూస్తూ అతనిని ఆప్యాయంగా దగ్గరకు చేర్చుకుంది.

అతను ఎదురుచూడని విధముగ అమ్మ అంగీకారం విన్నాడు.

"బాబూ, కావాలంటే నువ్వు వెళ్ళు."

వెళ్లనని చెబుదామనుకున్నాడు.

అమ్మ తనలో తనే అనుకుంది. "వాడుమాత్రము చిన్నవాడు కాడా? వాడికి మాత్రం ఆశ ఉండదా?"

అప్పుణి మౌనంగా నిల్చున్నాడు.

"అక్కడఉన్న వాళ్లకున్నంత హక్కు నీకుకూడ ఆ యింట్లో ఉంది. వెళ్లిరా!"

అప్పుణికి ఆ మాటలు చిత్రంగా తోచాయి.

కళ్ళు తుడుచుకొని ముత్తాచి ఇంటికి పరుగెత్తాడు.

* * * *

పారుకుట్టి పని ముగించుకొని ఇంటికి పోవటానికి అనుమతి కోసరం నిలబడినప్పుడు, కుంజాత్తోలు చెప్పాడు.

"పారూ, ఈ కట్టెలను కొట్టి పెట్టు!"

వంటగదిలోవున్న ఒక పెద్ద కట్టెను తెచ్చి గడప వద్ద పడేశాడు. రోలు గట్టు ప్రక్కనున్న గొడ్డలి తెచ్చి ఇచ్చాడు.

గొడ్డలితో ఎండిన కట్టెలు కొడుతుండగా కుంజాత్తోలుకు ఆమె ఇంటిని గురించిన వివరములు అడగాలనిపించింది.

"పారు, నీకు తోడెవ్వరు లేరా?"

దేవుడే తోడని చెప్పాలనిపించింది కాని....

"నేను, నా కొడుకు ఉన్నాం"

"కోంతుణ్ణికి బంధువులెవ్వరూ లేరా?"

"అందరూ చనిపోయి చాల రోజులయ్యింది."

"కోంతుణ్ణికి సవతి తమ్ముడు ఉన్నాడటగా!"

"చిన్నతనంలోనే ఎక్కడికో వెళ్ళిపోయాడు."

"నీ యింటికా?"

గొడ్డలి వ్రేటు తప్పి నేలపై పడింది.

కుంజాత్తోలు అదిచూచి కోపంగా అన్నాడు.

"గొడ్డలిని పాడుచేశావు."

ఎడమ కాలితో పగిలిన కట్టెని అదిమి చేతితో కట్టెను విడదీసింది. ఇంకా నాలుగు కట్టెలున్నాయి. అవికూడ కొట్టినతర్వాతనే ఇంటికి వెళ్లడం.

ప్రక్కనున్న గొడ్డలిని తీసేటప్పుడు గొడ్డలి నాలుక కర్రనుంచి జారి ఆమె పాదంపై పడింది. బాధతో అక్కడే కూలబడింది. దెబ్బ తగిలిన స్థలం నుంచి కారే రక్తం చూశాక ఆమెకు ఇంకేమీ తెలియదు.

వంట గదిలోనుంచి కుంజాత్తోలు కేకవేశాడు.

"కాలు విరిగిందా? ప్రొద్దు పోయినవేళలో....ఏమిటీ ఈ పాపం?"

"ఉహూ....ఉహు....ఏంలేదు."

మెల్లి మెల్లిగ రోలు వద్దకు వెళ్లి ఒక గుట్టపై నిలబడింది. శరీరమంతా వణికింది. కళ్ళు చీకట్లు క్రమ్మాయి.

"ఏమిటీ అక్కడ?"

ఒక పురుషకంఠం వినపడింది. పారుకుట్టి తలఎత్తి చూడలేకపోయింది. కళ్ళుతెరచి చూసేటప్పటికి ఆమెకాలు ఓ వ్యక్తి చేతిలో వుంది. ఆమె కాల్లో రక్తం వేగంగా ప్రవహిస్తున్నది. గాయమునకు కట్టు కట్టిన తర్వాత అతను చెప్పాడు.

"ఫర్వాలేదు. పెద్దదెబ్బ తగలలేదు....."

"తెలిసీ తెలియకుండా పనిచేస్తే........"

ఇంటి గుమ్మందాటి బయటకివచ్చిన కుంజాత్తోలు అన్నాడు. అతను చెప్పడం వింటే, కావాలనే గొడ్డలిని కాలిపై వేసుకున్నట్లు తోస్తుంది. శంకరన్ నాయర్ మామూలు ధోరణిలో సౌమ్యంగా, ఎవరిని ఉద్దేశించక చెప్పాడు.

"అ, అదేమీ తానుగా కావాలని చేసినదికాదు."

విడిగా పడియున్న గొడ్డలినిఎత్తి కర్రకుజోడించి, ఏమీ ఎరుగని వాని లాగా వడ్లు ఎండవేయటానికి పెరటిప్రక్కకు వెళ్లాడు.

పారుకుట్టి లేచినిలబడింది. బిగించి కట్టిన కట్టు కాలు కదిపితే నొప్పి పెడుతున్నది. కానీ వేరే దారిలేదు.

చెల్లా చెదురుగ పడిన కట్టెలను ప్రోగుచేసి కట్ట కట్టి వంట గదిలో పెట్టింది, చిదుకలను ఊడ్చి రోలు ప్రక్కగనెట్టింది.

వాకిట్లోని అరుగుపై ఒదిగి నిల్చుంది. ఏదో భ్రమగావుంది. పాదంపై కాకుండ ఇంకొంచెం పైగా పడివుంటే కాలే పోయుండేది. పనిచేయలేక పడక వేసియుండేది. ఆలోచనలకు మొదడులో తావులేదు. అప్పణి తన కాలిపై తాను నిలబడే వరకైనా ఈ శరీరంలో ప్రాణం ఉంటేచాలు. అదే ఆమె కోరుకున్నది.

'కుంజత్తోలయ్యా—'

అతనికి వినబడినట్లు లేదు.

బయట చీకటి పడే సమయము, ఆ వేళలో ఆకాశములో అస్తమిస్తున్న సూర్యుని ఉపరి భాగము వక్కచెట్ల గుండా చూస్తే ఎర్రని దానిమ్మ పువ్వు రంగులో నున్నది. దూరంగా పడమటి వైపున పొలములకు అవతలనున్న వృక్ష సమూహములో చీకటి దట్టముగా అలుముకొని వుంది. మధ్యాహ్న వేళల్లో కూడా సూర్యకిరణములు, వక్క, కొబ్బరి, పనస చెట్లను దాటి పోతున్నాయేమో అనిపిస్తుంది.

"కుంజత్తోలయ్యా"

"ఉండు.... ఉండు.... వస్తున్నా ఇదిగో!"

ఉత్తరాది వారింటి అమ్మాయి అయిన తనకు ఇంకొకరి ఇంటిముందు కాచుకుని నిలబడవలసిన గతి పట్టింది. ఇదంతా తాను చేసుకొన్న ఖర్మ అని ఆమె అనుకుంది.

ఆ యింటిలో నూనె దీపాలను శుభ్రంచేసి, నూనెపోసి, వెలిగించాలి. పాముల తోటలోను, లోపల నట్టింటిలోను, నడవలోను, అరుగుచివరను దీపాలు పెట్టాలి. ధాన్య గిడ్డంగిలో కూడ ఒక దీపం వెలిగించి పెట్టాలి. దారిలో దీపాలు వెలిగించేపని అయినట్టే.

సాయంకాలం పిల్లలందరూ చేరి రామ భజన చేయటం అలవాటు. నడవలోనున్న గుంజకు ఒరిగి నిలబడేది తల వొంచుకుని.

ఆ కాలం గడిచిపోయింది........

ఇంక ఆరోజులను తలచుకొన కూడదని తనలో తాను నిశ్చయించు కుంది.

" పారూ !"

కుంజత్తోలు పిలచాడు.

గుమ్మంలో పళ్లెంలో రెండు శేర్ల బియ్యం పెట్టి ఉంచాడు.

రోకలి వద్ద నున్న చిన్నతాటాకు బుట్టలో ఆ బియ్యం తీసుకుని, వంట గది ప్రక్కగ వెళ్ళి "నే వెళ్లొస్తానండీ!" అన్నది.

ఆవిడ వెళ్లిపోయింది. వెనుక శంకరన్ నాయరు వస్తున్నట్లు ఆమెకు తెలిసినప్పుడు అమె మనసు కుదుట బడింది. అతనూ ఆ దారిగుండనే వెళ్ళాలి. సాయంకాలం వేళలో ఒంటరిగా కొంచెం దూరము నడచి పోవటం కష్టమేమీ కాదు. ఆమె ముందు నడుస్తున్నది. అతను వెనుక కొద్ది దూరములో నడచి వస్తున్నాడు.

శంకరన్ నాయరును తలయెత్తి చూడలేదు. తన స్వంత గృహంలో నున్నప్పుడు శంకరన్ నాయరును బాగా ఎరిగున్న వ్యక్తే. వాకిట్లో నున్న బావిలో నుంచి నీళ్లు అతనే తోడేవాడు. ఆ బావివద్ద తక్కువ కులస్తులు అన్యజాతులు రావటం నిషేదం. అతనిది నల్లని దారుఢ్యమైన శరీరం. అలాగే అతని కంఠధ్వని కూడ. ఆనాటికి ఈనాటికీ ఒక్కలాగనే ఉన్నాయి. వయసుతో అతని శరీరంలో ఏవిధమైన మార్పు లేదు.

కొంచెం కాలం ఆ పెద్దింటిలో పెద్దపాలేరుగా పనిచేశాడు. ఆతర్వాతనే ఇప్పటి మనక్కల్ వారియింట్లో పనిచేస్తున్నాడు.

"అప్పుణి చదువుతున్నాడా?"

శంకరన్ నాయర్ బిగ్గరగా అడిగాడు.

" ఆ "

ఆవిడ తిరిగి చూద్దామని నిలబడినప్పుడు మళ్ళీ అడిగాడు.

-"ఏ తరగతిలో? "

" ఎనిమిదవ తరగతి. ఏమండీ?........"

"ఏమిటి?"

"నాకొడుకు రేపు తుళ్ళలాటకు వెళ్లాలని ఆతుర పడుతున్నాడు. అదీ....ఆపెద్ద యింటిలోనట. చెబితే వినటంలేదు. ఏంచెయ్యాలండీ."

"ఊ"

"ఏంచేయాలో తెలియటం లేదు. భగవంతుడా! కొడుకు ఏడుస్తున్నాడు. ఏం చేయడం. నాకు సహాయం చేసేవాళ్ళుగాని, చెప్పేవాళ్ళుగాని ఎవరూ లేరు........"

అంత చెప్పాలని ఆమె అనుకోలేదు. కాని అప్పణి జ్ఞాపకం రావటంతో అలా అనేసింది.

"వెళ్ళినందువల్ల తప్పేమి లేదు. అతనికి కూడ ఆ యింటిలో భాగం ఉంది కదా?"

"కాలు రెండు రోజులకు నీటిలో పెట్టకు" అని చెప్పి అతను వెళ్ళి పోయాడు. చీకట్లో, ఆ నల్లని రూపం కనుమరుగైయ్యే వరకు చూసింది.

ఇంటి గడపలో కాలు పెట్టబోతున్నప్పుడు పారుకుట్టమ్మ గుండెలది రాయి. పని మనిషి 'చీరు' అడిగింది.

"పారుకుట్టమ్మేనా ఆ వచ్చేది?"

"అవును. ఎవరు చీరమ్మవా?"

"అమ్మాయ్, ఎవరితో వస్తున్నావు?"

ఆవిడకు ఆ విషయం తెలిసి వుండవచ్చును.

"అదిగో ఆ శంకరన్ నాయర్‌తో."

గుమ్మం లోపలకు వెళ్లినప్పుడు పారుకుట్టి ఆలోచించింది. చీరు అడ గటంలో ఏదో విశేషంఉంది. బహుశ! ఎగతాళి చేయిడానికి అయివుంటుంది.

ఆ ప్రాంతంలో చిన్న నేరం నుంచి పెద్ద అబాండం వరకు అనేక విధ మైన సంగతులు ప్రచారముచేసే వాళ్లున్నారు. అందులో చీరు ఒకతే. ఇంకో ఆమె విళక్కతమ్మాళ్. విళక్కతమ్మాళ్ చీరుకన్న రెండు ఆకులు ఎక్కువ చదివింది.

అప్పణి దీపం దగ్గర నిలబడి అంగడిలోంచి ఉల్లిపాయలు, మిరప కాయలు తెచ్చిన వారపత్రికలోని చిరిగిన కాగితంలో వున్న విశేషాలని ఉత్సా హముగ చదువుతున్నాడు. ఈ విధంగా నాలుగైదు రోజులు గడిపాడు కారణం తుళ్లలాటకు వెళుతున్నానన్న సంతోషం.

అన్నం తిన్నతర్వాత పెనుగాలితో వర్షం కురిసింది. కాని వర్షం పెద్దగా రాలేదు. కాని ఆ గాలికి అరటి తలలు "గిరిగిర "ని అదిరాయి. ఇంటి చూరుకు కట్టిన తడిక గాలికి గోడకు తగులుకొని శబ్దము చేసింది.

చాపపై పడుకొన్న వెంటనే ఆమెకు రోజులాగా నిద్ర రాలేదు. కాలి వ్రేలి దెబ్బ బాధ కలిగించింది.

బయట గాలివాన పెద్దగా లేదు. వాననీరు బొట్టు బొట్టుగా తడికపై పడినప్పుడు వచ్చే శబ్దము తగ్గింది.

అప్పణి నిద్రపోయాడు. రెండు చేతులను రొమ్ముపై పెట్టుకొని ఒక ప్రక్కగా తలవాల్చియున్న అతన్ని దగ్గరగా తీసుకుంది తల్లి.

చేతికందనంత దూరములో వున్న చిన్న దీపమును ఆర్పి వేసింది.

అప్పణికి మూడేళ్ల వయస్సు, ఆయన చనిపోయినప్పటికి.

బెండతోటకు, వంగతోటకు నీరు పెట్టి గట్లను సరిచేసి ఏమేమో మాటలాడి వెళ్ళిన మనిషి..............తిరిగి వచ్చింది——.

మొదటిసారి ఆయింటికి వచ్చినప్పుడు ఆమె ఏడవమాసం గర్భిణి. ఆ రోజుల్లో పడమటి ప్రక్క వట్టి గడ్డితో మాత్రమే ఇల్లు కప్పబడి వుంది. ఫాల్గుణ చైత్రమాసములు తర్వాత జమ్మువేసి కప్పలేద్దామని అనుకున్నారు. కాని హఠాత్తుగా ఉరుములు మెరుపులతో పెద్ద వర్షము వచ్చింది. ఫాల్గుణ మాసములో అటువంటి వర్షము ఎప్పుడూ వచ్చినట్లు లేదు. గాలితో కూడిన వర్షము వల్ల ఇంటి కప్పుపైన ఉన్న గడ్డి నానిపోయి చిందర వందరగ అయిపోయి, నీళ్లు లోపల కారసాగాయి. చాపలు తడిసి ఇల్లంతా తడి అయింది.

ఇంట్లో నీరు కారినచోట ఇద్దరు వెలిగించిన చిన్న దీపం ముందు కూర్చుని వున్నారు. ఆయన తన వంక చూసి పిలిచారు

"పారుకుట్టీ !"

అలా పిలిచేది ఆయనే.

" పారుకుట్టీ, ఏమటి ఆలోచిస్తున్నావు?"

" ఏం లేదండీ. "

"ఇప్పుడు శ్రమ పడకూడదు కదా!"

"నేనేమీ కష్టపడుటలేదే!"

వాస్తవానికి జీవితంలో ఎత్తుపల్లములు అనుభవించుటకు ఆమెకి అవకాశము కలుగలేదు.

ఆ వూరిలో వారందరూ ఆమెనుగురించి చెప్పుకొన్న సంగతులు ఆమె వినివుంది. 'అభాగ్యురాలు.'

గ్రామాల్లో అగ్రజాతివాళ్ళు, తక్కువ జాతివాళ్లని కలిస్తేవాళ్ళు ఇంటిని వదలివెళ్లగానే ఇంట్లో వాళ్ళు తలస్నానం చేస్తారు. తల స్నానం చేసేది జాతి సంబంధం చేసి కొన్నవాళ్లు మరణించినతర్వాతనే. ఒకకూతురు చనిపోయింది. ఒక కోడలు చనిపోయింది. చెల్లెలు వేరొకరితో లేచిపోయింది. అంటే ఆమె కూడా చనిపోయినట్టే.

ఇంకొక జాతివానితో తాను లేచి వచ్చేసినప్పుడు తనకు పదిహేడు సంవత్సరాలు. ఆసంఘటన తలచుకొంటే ఒళ్లు పులకరిస్తుంది.

అరవైనాలుగు మంది పనిచేసిన ఇల్లుని తన తల్లి చెప్పగా వినివుంది. ఇంటిలో ఉత్తర పార్శ్వపుగదిలోనే తాను పుట్టినది, పెరిగినది కూడ. ఆ సంస్థానం లాంటి ఇంట్లోనే పంతులు మొదలైన పిల్లలు చదివారు. పడమటి వైపు మామిడిచెట్టు నీడలో నుంచి చూస్తే కనుచూపుమేర వరకు కనపడేప్రపంచమే ఆమెకు తెలిసినది. ఆపైన ఏమున్నదని ఆమెకు తెలియదు.

వేసవి కాలంలో గుంటలో నీరు తగ్గి బురదగా వుండేది. అప్పుడు స్నానం చేయటానికై దూరంగా ఉన్న మడుగుకు వెళ్లడం అలవాటు. ఒంటరిగా వెళ్లకూడదు. చిన్నత్త పెద్దత్త తోడుగా వచ్చేవారు. లేకపోతే ఉత్తర ఇంటి నుంచి కుంజకుట్టి వచ్చేది. కుంజకుట్టి తనకంటే నాలుగు నెలలు పెద్దది.

శబ్దము చేయకుండ, మెల్లిగా బయటకు వెళ్ళాలి. వీధి గుమ్మంనుంచి మూడు ఫర్లాంగుల దూరం వెళితే ఒక బాట. ఆ బాట మడుగు దగ్గరకు వెళుతుంది. ఆ దారిలో గుంటకు ఎదురుగా రేగడి నేల పొలములున్నాయి. మడుగులోకి దిగడానికి బాట నుంచి ప్రక్క దారి ఒకటి వుంది. ఉత్తరాది వారింటి స్త్రీలు అక్కడే స్నానం చేసేవారు.

స్నానం చేసి ఆ బాటదారినే ఇంటికి వచ్చేవారు. నడవ గుండా ఇంటిలో కొచ్చేవారు. కొన్ని సమయాలలో మామ ఉన్నట్లయితే శబ్దముచేయ కుండ మెల్లిగ లోపలికి వెళ్లేవారు. అడుగులు శబ్దంచెయ్యక మెల్లిగా యింట్లోకి ప్రవేశించాలి. నేల అదరకుండ నడవాలని అమ్మ చెప్పేది.

ఆకాలంలో స్నానం చేయడానికి ఎప్పుడూ ఉదయం వెళ్లే అలవాటు. తిరిగి వచ్చేటప్పుడు, పొలము వద్ద, గుడి మండపములో ఒకతను తలపాగ చుట్టుకొని, చేతిలో ఒక కర్ర పట్టుకొని నిలబడి వుండేవాడు. ఇద్దరూ మెల్లిగా

మాట్లాడుకునే వారు. కొంచెం తలెత్తి చూస్తే తలపాగ క్రింద జుత్తు చెవిలో ఎర్రనిరాళ్లు, కమ్మలు కనబడతాయి. పెద్ద వదినగారి గదిలో నున్న రాజు చిత్రపటమే ఆమె తలంపుకు వచ్చేది. ఏదో చెప్పుకొని నవ్వే అతని నవ్వు తరంగాలుగ వ్యాపించి ఆ మడుగు ఒడ్డును తాకినట్లనిపించేది, ఆమె, కుంజు కుట్టి, గుడిమండపము వద్దకు వచ్చునప్పటికి వారి సంభాషణ ఆగిపోయేది. ఆ కళ్లు తనవైపే చూస్తున్నాయా? వెంటనే వెళ్లిపోవాలనిపించేది. కానీ కాళ్లు కదలాలిగా? మడుగులో దిగిన తర్వాత కుంజుకుట్టికి తెలియకుండ ఒక్కసారి వెనక్కి తిరిగి చూసింది. అప్పుడు అతను క్రిందకు దిగాడు. చిన్న కొబ్బరి చెట్టు అంత జుత్తులో నున్న అతని రెండు కళ్ళు ఆమెనే చూస్తున్నాయి.

స్నానం చేసేటప్పుడు మధ్య మధ్య మనసులో చెలరేగుతున్న ఆలోచన లను అణచుకుని మామూలుగా అడిగింది.

"అదెవ్వరే? ఆ మనిషి? కుంజుకుట్టీ?"

" ఎవరు? "

" ఆ గుడి మండపములో "

'అతను కోంతుణ్ణి. వాయకట్టు ఆట ఆడే కోంతుణ్ణి నాయరు.'

రోజూ స్నానం చేయటానికి వచ్చినప్పుడు కనిపించేవాడు.

ఒక రోజు ఒంటరిగానే స్నానం చేయడానికి రావలసి వచ్చింది. వస్తు న్నప్పుడు అమ్మ చెప్పింది.

"అమ్మాయ్, ఈ రోజు చెరువుకు పోవద్దు. గుంటలోనె స్నానంచెయ్యి."

"బట్టలుతికితే బురదవుతుంది అమ్మా" అని సమాధానం చెప్పివచ్చింది.

పొలముదాటి, గుడి మండపము దగ్గరకు వచ్చినప్పుడు తలవంచుకొని వెళ్ళుతూ, కాళ్లలో ఏదో వేగం హెచ్చింది. క్రీగంట ఒక్కక్షణం అతనిని చూసింది. మండపంలో ఎవరూలేరు. త్వరగా నడిచి ఎర్రమట్టి పొలము వద్దకు వెళ్ళేసరికి మర్రిచెట్టు క్రింద అతన్ని చూసింది. నడకవేగం హెచ్చింది.

"నువ్వు ఒక్కతివేనా?"

"నేను మాత్రమే" చెవులకు వినపడదేమో అనిపించింది. వినపడిందో లేదో? మర్నాడు కూడా అదే విధంగా అతను కనిపించాడు.

"పారుకుట్టీ."

ఆమె అదిరిపడింది. గుండెలు గుబగుబ కొట్టుకున్నాయి, మొగలితోట లోకి వచ్చినప్పుడు నవ్వుతూ అన్నాడు.

"నేనీ ప్రాంతం వాడినే. నా పేరు కోంతుణ్ణి."

తనకు తానే పరిచయంచేసుకొనే విధానం ఆమెకు నవ్వు తెప్పించింది. లోలోన నవ్వుకుంది. ఒక నిమిషం పోయాక.

"తెలుసును" అంది.

"తెలుసునా! తెలిసికూడ మాట్లాడవేం?"

"రోడ్డు మధ్య నిలబడి మాట్లాడమంటారా?"

ఇలాగ ప్రారంభమైంది ఆ పరిచయం. ముసలమ్మ చనిపోయినప్పుడు పనిచేయడానికి పిలిచిన పదహారుమందిలో కోంతుణ్ణి నాయరు ఒకడు. వడ వలోనుంచో, తోటలోనుంచో గదిలోనుంచో చూస్తున్నప్పుడు వడ్లుదంచు చేతియంత్రం దగ్గిర నిలబడి వడ్లు యంత్రములో వేయటం, బియ్యమును భద్రపరచటం చూసేది.

కొడిక్కున్నం తోటలోనుంచి తాటిమట్టలను తెచ్చేవాడు. తెచ్చిన తాటి మట్టలను కాల్చి ఎర్రమట్టి పొలములో వేయాలి. ఆ పొలము ఇంటికి దగ్గరే. అందరి నాయర్ల ఇండ్లలోను తాటిచెట్లుండేవి. కళ్ళముకు ముందు తాటిచెట్లు వుండేవి. ఆ ప్రాంతంలోని పెద్ద ఇళ్ళలో ఉత్తరాదివారి ఇల్లు మూడవ స్థానము ఆక్రమించింది.

ఆ సంవత్సరం ఏదో పోట్లాట జరిగేటట్లున్నదని అందరూ తలపోశారు.

ముత్తలికున్నములో శివరాత్రినాడు జరిగిన సంఘటనలో అక్కడవున్న మసీదు రోడ్డుపై డప్పులు మ్రోగుతూ వెళ్ళినప్పుడు మాప్లవారు అడ్డం పడ్డారు. ఆ సంఘర్షణలో పలువురికి దెబ్బలు తగిలాయి.

"మాప్లవారికి ఒళ్ళు పొగరెక్కిందా?" అని ఆ ప్రాతంలోని వారు ప్రశ్నించారు.

నాయర్ల కుటుంబములో యువతీ యువకులు కలసి భగవతి పూజ చేయటం అలవాటు. పూజ జరిగినప్పుడు ముస్లిముల వల్ల ఏదైన ఆటంకములు ఏర్పడుతాయేమోనని కలవరము చెందారు.

ఆ ప్రాంతంలో ప్రత్యేకించి భగవతి పూజచేసిన యువకులలో కోంతుణ్ణి నాయరు ముఖ్యుడు. అతను ఎన్నోచోట్లకు తిరిగి వచ్చాడు. ఎక్కడాకోలాహలములేదు. కోంతుణ్ణికి అయువుండే వరకు ఏమీ చేయనవసరములేదు.

రాత్రి పూజ జరిగిన తర్వాత బాణసంచా కాల్చారు. తెల్లవారింది. భేరీలు మ్రోగాయి. తర్వాత యువతులందరూ రెండువరుసలుగ నిలబడ్డారు. ఒకొక్క

యువతి వెనుక ఒక్కొక్క యువకుడు నిలబడి వున్నాడు. పూజ చేసేవారంద రికి కొంచెము భయముగానే యున్నది.

వాస్తవానికి పారుకుట్టికి భగవతి పూజ చేయడానికి ఇష్టం లేదు.

అది ఒక ప్రార్థన పద్ధతేకాదని ఆమె అభిప్రాయం. భగవతి కైంకర్య ములో ఉపేక్షించుట మంచిదికాదు. భగవతి పరదేవత. సర్వము తెలిసినది.

రాత్రి తాటాకుమంట వేసి వెలుగు వచ్చేటట్లు చేశారు. అక్కడి నుంచి వెళ్ళిపోతూ వెనుకకి తిరిగి మంటవైపు చూసింది. మంటను చూస్తే మైకము వచ్చునని చెపుతారు. ఆమె చూసినప్పుడు కోంతుణ్ణి నాయరు కళ్ళు ఎర్రగా కనబడ్డాయి. ఆ కళ్ళలో 'నేనున్నాను' అనే భావం కనపడింది. తిరిగి వెళ్ళి పోతున్నప్పుడు ఆమె మనసులో ఏదో తెలియని ఆవేదన కలిగింది. వేగంగా భీతితో శ్వాస పీలుస్తున్నట్లయింది. ఆ ఎర్రతోట దాటి ఎలాగ ఆమె బయటకు వచ్చిందో ఆమెకే తెలియలేదు.

చూసుకునేందుకు మాట్లాడుకునేందుకు సందర్భం అలాగఏర్పడింది. అతను ముస్లిములో భాగస్తుడై తన యింటికి వచ్చాడు. పెద్ద మామకు అది నచ్చలేదు. అది కలహమునకు దారితీసింది.

తాను ఎదురు చూడకనే పెళ్ళి ఏర్పాటులు జరిగిపోయాయి. వరుడు మణియూరుకు చెందినవాడట.

వరునితోకూడ ముగ్గురు ఇంటికొచ్చారు. పెద్ద మామతో మాట్లాడారు. సంబంధం నిశ్చయం అయిపోయింది. ఆ వూళ్ళో వున్న ఇద్దరు ముగ్గురు బంధువులు కూడ వచ్చారు. వాళ్లు వెళ్ళిపోతున్నప్పుడు, చిన్నమ్మ తనకు ఒక మనిషిని చూపించింది. అతనికి తనని చూపించేందుకు కూజాలో నీళ్ళు తీసుకొని నడవలోకి వచ్చినప్పుడు, తను అతన్ని చూసింది.

వరుడు వయసులో నున్నవాడే. తలకి చేతులకి బొల్లిరోగము వుంది. ఒక్కసారి చూశాడతను.

ఆ రాత్రంతా ఏడ్చిందామె. ఆమెకు తన బాధ చెప్పుకునేందుకు ఎవరూ లేరు. అమ్మకు ఈ సంగతి తెలిసింది. కాని———

'కుంజికృష్ణ నిశ్చయించిన తర్వాత నేనేమి చేయడం?'

అతనికి అడవులు, పొలములున్నాయి. అవి అతను స్వయంగా సంపా దించినవి. మొదటి భార్య చనిపోయింది. రెండవ భార్యను వదిలివేశాడు.

అయినా ఆమెకు పుట్టిన బిడ్డలకు ఖర్చుకై డబ్బు యిస్తున్నాడు. అక్కడితో మాటలు ఆగిపోయినై...........

పెండ్లికి ముందురోజు ముసలమ్మ చెల్లెలు వద్దకు వెళ్ళి నమస్కరించినప్పుడు, తనకు తోడుపెళ్ళికూతురుగానున్నది పెళ్ళికూతురుఅని తెలుసుకుంది.

వచ్చేదారిలో సముద్రపు వెదురు కర్రను చేత పట్టుకొని, ఎత్తైన గుట్టపై ఒక కాలుంచి నిలబడివున్నాడు, కోంతుణ్ణినాయరు. ఆమె ఇంటినుంచి బయలుదేరి ఇక్కడికి వచ్చిన తర్వాతనే అర్థం కాని నవ్వు ఒకటి ఆమె పెదవులపై వెలిసింది. అతన్ని చూడటంతోనే ఆమెకు ఏడుపు కట్టలు తెంచుకొని వచ్చింది మనస్సు నెమ్మదిపడే వరకు ఏడ్చింది.

" పారు కుట్టీ "

...............

" ఏమిటీ పారుకుట్టీ "

ఏమీ మాట్లాడలేక పోయింది. ఏదీవ్యక్తం చేయలేక పోయింది. ఏమేమో చెప్పకుంది. రెండవసారి ఆలోచించుకునేందుకు అవకాశంకూడ లేదు.

''పారుకుట్టీ, నీకు నాయందు నమ్మకమున్నదా?"

చెప్పలేక పోయింది ఆమె....ఆమె హృదయం పొంగి పొర్లింది.

'నాకు పెద్ద ఇల్లు, వడ్లగిడ్డంగులు లేవు. కాని నేనొక మగవాణ్ణి. నీకు ధైర్యం ఉంటే వెళ్ళిపోదాం. ఈ రెక్కలలో బలముండే వరకు ఎక్కడైనా బ్రతుకవచ్చును.

అతని శరీర బలముపైకన్న అతని వాక్యములపై ఆమెకు గట్టి నమ్మకము ఏర్పడింది. కళ్ళు మూసుకొని మెల్లిగా 'వస్తా?' అన్నది.

ఆమె నిర్ణయం సరియైనదే. తాను జీవించునంతకాలము ఆ నిర్ణయములో ఇంక మార్పురాదు. అలాగే జరిగింది - పెళ్ళి అయినప్పుడు -

ఆ రోజు వివాహము జరగవలసింది - అతను మారిపోయినట్లుగ అందరు చెప్పకున్నారు. ఆమెతో వివాహమయిన తర్వాత అతడు దాయం ఆడటం, త్రాగుడు మానివేశాడు.... రాత్రింబగళ్లు కష్టపడి పనిపాట్లు చేసేవాడు."

బైట వర్షం తగ్గింది, అయినా చలిగాలి వీస్తున్నది. ఇంకా వర్షం కురుస్తూనే వుంది. కిటికీని కప్పిన తాటాకుల కంతలోనుంచి మెరుపులను చూసిం

దామె. చలిగాలి వీస్తున్నది. కొంచము చిరిగిన పాత దుప్పటి యుంటే దానిని విప్పి అప్పణికి కప్పింది ఆమె - అప్పణిని తన హృదయానికి హత్తుకుని పడుకొంది.

# రెండు

జనంతో ఇల్లు నిండిపోయింది. దక్షిణపు గదిలోనూ, ఉత్తరపు గదిలోనూ, ఎక్కువ ఆడవాళ్ళున్నారు. వెనుక ఏడ్చి గోలచేస్తున్న చిన్నచిన్న పిల్లలు అందరూ ఆ కుటుంబమునకు చేరినవారో, బంధువులో అయి వుండవచ్చును. ముంగిట్లోనూ పందిరిలోను పెద్ద పిల్లలు, వాకిట్లోను పందిరి వద్దను మగవారు ఉన్నారు.

పందిరి ప్రక్కన కొబ్బరి ఆకులతో అల్లిన ఒక గది కట్టబడి వుంది. అందులో మగపిల్లలందరూ వున్నారు. వారికి కావలసి వచ్చినప్పుడు ఫలహారము లు, నీళ్ళు మొదలైనవి తెచ్చియిచ్చే పని మాళుకు భారముగా వున్నది. ఆ యింట్లో ఒక వారసుని కూతురు మాళు.

రాముడు ఎరుక జాతి కులపెద్ద. రాముని కోడలు బాగా పాటలు పాడుతుంది.

జనం వచ్చాక పందిరిలోను, బైట వున్నవారి కోసం చుట్టి వచ్చుటకు మాళుకు వ్యవధిలేదు. కేకలు పెడుతున్న ఒక పిల్లను ఎత్తుకొని ఎవరో అన్నారు "మాళుతూ, 'ఏయ్ పిల్లా, దీన్ని బయటకెత్తుకెళ్ళి ఏడవకుండా చూస్కో!"

చేతిలో పిల్లలు బట్టలు మార్చి ఏడవకుండ ఊరుకో బెట్టటం ఉత్సాహ కరమైన పని. అయితే దానికోసం కాచుకుని వుండుటకు వీల్లేదు. క్రొత్తగా బంధువులు, మిత్రులు కుటుంబములతో వచ్చి చేరగా కేకలుపెట్టి గోలచేసే పిల్లల సంఖ్య ఎక్కువయింది. కాని, వాళ్ళను రావద్దనుట సాధ్యమా?

- ఆవిడ తండ్రి వద్దనుంచి, ఇల్లు వదలి వెళ్ళినప్పుడు తనతో అన్నాడు: "చెప్పే మాటలు వినాలి. చెప్పిన పనులన్నీ చేయాలి."

మాళుకు పెద్దవారెవ్వరూ తెలియదు. అడిగితే తెలిసియుండేది.

తుళ్ళలాట అమ్మకుట్టి వారి యింటి నాయరు వారి యింట్లో కదా జరుగు నది? తుళ్ళలాట అని మాత్రమే విని వుంది. తోటలో రెండు పాము పుట్ట లున్నాయి. ఆ రెండిటిలోను మూడు నాగుపాము లున్నాయి. వాటి పేర్లు మాళుకు తెలుసు. తెల్లత్రాచు, నల్లత్రాచు, గోధుమవన్నెత్రాచు.

నల్లపాము చాల క్రూరమైనది. క్రింది జాతి పాము. అయ్యప్పస్వామి, చాత్తప్పస్వామి యిద్దరూ ఒకలాగే కనబడుతారని మాళు తలచేది. అందు కోసమే శివరాత్రికి పాలు, పళ్లు యిచ్చినప్పుడు మొదట నల్లపాముకే పెడ తారు. పడమటి తోటలో మొదటియిస్తే దూరములోనున్న నల్ల పాము వెళ్ళి దానిని ఎంగిలి చేస్తుందికదా?

మాళు ఈ పాములని చూడలేదు. పాముల పుట్టలో చిత్రకూటమునకు క్రిందనే దీని భవనములు. ఒక్కొక్క భవనములోను పుత్రులు, కుమార్తెలు, అల్లుళ్ళు ఇలా చిన్న వయసులోనున్న పలు పాములుండేవి. వాటిలో ఒక దాన్ని యింటి వాకిట్లోనున్న గుండురాయి వద్ద కొన్నిరోజులకు ముందు చూ సింది. సాయంకాలము తంగేదత్తి గడపవద్ద దీపం వెలిగించడానికి నడవలోకి వెళ్ళినప్పుడు కేకలు పెట్టింది.

"అమ్మా, పాము, పాము?"

చెల్లాయి దీపం పెట్టలేక యింటిలోకి పరుగెత్తింది.

తన కూతుర్ని " సంధ్యా కాలములో ఏమిటీ గోల " అని అడుగుతూ పెద్దమ్మ అక్కడికి వచ్చింది. తంగేదత్తికి తన తల్లిని పెద్దమ్మ యనియే పిలవ టం అలవాటు.

తంగేదత్తి వాకిట్లోకి మళ్ళీ వచ్చింది.

" అక్కడ పామున్నదమ్మా "

పెద్దమ్మ దక్షిణపు గది గుమ్మము దగ్గర నిలచి బిగ్గరగా అరిచింది.

"కుట్టా. మీనాక్షీ, భాస్కరా — పాము, పాము, వాకిట్లో పాము."

పెద్దమ్మ కన్న చిన్నవాడే మాళు తండ్రి. పేరు పెట్టే పిలిచేది.

తండ్రి వచ్చాడు. భాస్కరన్న, కృష్ణకుట్టి కూడా వచ్చారు. ఇంట్లో నుంచి అవ్వ కూడా మెల్లిగా లేచి వచ్చింది.

"ఎక్కడ, ఎక్కడ."

వారు చూసినప్పుడు అక్కడ పాము లేదు. వాకిలి, గోడప్రక్క పచ్చ కొబ్బరియాకుల పందిరి మధ్య, ఎక్కడా పాము కనబడలేదు.

అవ్వకు మనసు కుదుటపడింది. మెల్లిగా నిలుచుని అందరితో చెప్పింది. "విన్నారా పిల్లలారా దానిని ఏం చేయకండి. అది వేరే విషపాము కాదు. ఇంటి పామే. మన పామంటారు..........."

పెద్దమామ కొంచెం సేపయాక అక్కడికి వచ్చాడు. అందరూ యింట్లోకి వెళ్ళారు. మాళు తండ్రి తూర్పు వాకిట్లో తిరిగి నిలబడ్డాడు. నాన్నమ్మ పాముని చూసిన వివరాన్ని చెప్పేందుకు కాచుకునుంది.

ఆ విషయాన్ని గ్రహించి పెద్దమామ ఇలా అన్నాడు.

'పాముకి పెరుగు పెట్టాముగదా! మరి యిక్కడికెందుకు వచ్చినదది?'

కాస్సేపు వాకిట్లో అటూ యిటూ నడుస్తూ గట్టిగా అడిగాడు.

'ఎలాగో మంచిదికాదు. చెడ్డదికాదు. అన్నీ అంటుబడి దుమ్ము ధూళియైపోతాయి వెధవలు."

అల్లాగ చెప్పి, మాళు తండ్రిని పిలిచాడు.

'ఏమిటికుట్టా, రేవుప్రక్కకు వెళ్ళినప్పుడు అక్కడ నంబూదిరితో చెప్పి ఓ పుణ్యావచనం చేయాలని చెప్పి రమ్మను.'

పాముని మళ్ళీ అక్కడక్కడ వెతికారు. తోటలోవున్న కారటురాళు వద్ద మళ్ళీ తోట వాకిట్లోనున్న కాలువలో.

అప్పుకుట్టన్ పణిక్కర్‌వచ్చి చెప్పాడు.

'పాములు దాహంతో అల్లాడుతున్నవి. పాలు, పెరుగు పెట్టితేచాలదు. తుళ్ళలాట పెట్టాలి.'

ఇల్లాగే పుళ్ళువ రాముడు వచ్చి తుళ్ళలాటకు ఏర్పాటుచేశాడు.

నట్టింట్లోవున్న పిల్లల సందడిలో కూర్చుని పందిరిలో నడుస్తున్నవన్నీ మాళుకు చూడడానికి వీలు కలిగింది. కాని మధ్య మధ్య తంగేడత్త పిలిచేది. మీనాక్షమ్మ పిలిచేది. వచ్చినవారందరూ వుండి, వుండి పిలిచేవారు.

నాన్నమ్మ తుళ్ళలాటకి వచ్చింది. ఇప్పుడు తుళ్ళలాటకు అమ్మణి, తంగేడత్త వున్నారు. పెద్దమామకు చిన్నకూతురు అమ్మణి. అమ్మాయి, ఆమె పుత్రులు ఈ రోజే వచ్చారు.

- నట్టింటి వాకిట్లో ఛాతీపైతుండు కట్టుకొని తోట దారిలో పెద్దమామ నడుస్తున్నాడు. రొమ్ముపైనున్న నెరసిన జుత్తుని దుద్దుకొంటూ వున్నాడు.

పందిరిలోను, వాకిలిలోనున్న నడవలోను, నిలుచున్న మనుష్యులవద్ద పెద్ద మామ ఆ కాలపు కథలను చెబుతున్నాడు.

''అచ్చుత మామ యీ గిడ్డంగి వద్ద వుంటే చాలు. దేశంలో కాకి కుయ్యదు....'

వృద్ధులు కొంతమంధి శ్రద్ధతో వింటున్నారు.

'మూప్పరూ, నీకు జ్ఞాపకమున్నదా? పులి- పులిలాంటి మనుష్యులుండే వారు కదా?'

పూజారి ప్రత్యుత్తరం ఇచ్చాడు. క్రొత్త వస్త్రంధరించి ముఖానికి గంధపు బొట్టు పెట్టుకొని రెండు చెవుల్లోను తులసి దళములు పెట్టుకుని ఎవరినీ తాకకుండా నిలిచాడు ఉత్తరాది యింటి నారాయణ నాయరు. అతనే పూజారి.

ఆ ప్రాంతంలో వయోధికులకు యింట్లోనుంచి పెద్దమామ మాటలాడితే వినటం అలవాటు. ఆ మాటలు సామాన్యంగా పాతకాలపు విషయాలు. అవిభక్త కుటుంబం, మూడుచేతి యంత్రములు, అరవైనాల్గుమంది పనివాళ్ళు, పులిలాంటి అచ్చుతనాయరు ఉన్నప్పటికాలం. విస్తారమైన పంట పొలాలను విభజించిన కథలు.

'ఇప్పుడు పల్లె ప్రాంతాల్లో డబ్బు ఎక్కువైనాయి. వీరికంటె ధనవంతులు నాయరు కుటుంబములోనున్నారు. కాని, ఈ ఇంటికంటే గౌరవమైన కాపురస్తులెవరున్నారు?'

ఒక వృద్ధుడు తలఅడించి చెప్పాడు.

'అవునండీ, అదంతా, నాటికి వానకురిసి కరిగినట్లైనది.'

'నా కళ్ళంలో వడ్లు వైభవాన్ని ఆ తక్కువ జాతివారు చూశారా?'

ఈనాటికి వాళ్ళంతా, భవనాలు కట్టుకొని మహారాజులయారు. ఛీ!"

వృద్ధుడు మళ్ళీ తల ఆడించాడు.

'సాధారణ కర్షకులము కాము మేము. ఈ యింట్లో వాసంచేయు దేవత ఒకటి వున్నది.'

'అదే లక్ష్మీవాసం! అన్నమిచ్చు వరలక్ష్మి.'

మాళు ప్రక్కనున్న చిన్నగదిలోనుంచి బయటికొచ్చి మెల్లిగా వంటింట్లోకి వెళ్ళింది.

తంగేడత్తి, అమ్మణి స్నానముచేసి శుభ్రంగావున్నారు. తంగేడత్తికి

తానొక ముఖ్యమైన వ్యక్తిననే అహంభావం. ఇప్పుడా కథవద్దు. అమ్మణి స్నానం చేసుకొని గంధంతో చిన్న బొట్టును ఆ మధ్య చాందు తిలకం పెట్టుకుంది. చూడడానికి బాగుంది.అమ్మణిని ఈర్ష్యతో ఆమె చూస్తూ నిలబడింది. మంచి అరటి పూవువంటి రంగు. మెడలో నీలం రంగుతో నరాలు తేటగా ఎడం ప్రక్కని కేశములు కనబడుతున్నాయి. ముందుకుపడిన ఆ కేశాదులు నేలపైపడి పొర్లుతున్న నల్ల నాగమువలె చెదిరి పడుతున్నాయి.

పెద్దమామ సంతానంలో కల్యాణేదత్తి మాత్రమేలేదు. ఆవిడ బాలింతరాలు. ఆమె పెద్దకొడుకు బాలన్ అమ్మాయితో వచ్చాడు.

పెద్దమ్మ యింటికి పోవడానికి నాలుగు గడియలే పడతాయి. ఏటి మడువుదాటి, మళ్ళీతోపు దాటితేచాలు. అమ్మాయి తన స్వంత గృహంలో నివసించటంలేదు. కొబ్బరితోటలో క్రొత్త పెంకుటిల్లుంది. గత సంవత్సరం అమ్మణియమ్మ ఋతు శాంతిముహూర్తానికి పెద్దమ్మ వెళ్ళినప్పుడు మాళు కూడ వెళ్ళింది.

ఆమె మెడలో కదులుతున్న నల్లపూసలదండ చూడడానికి చాలా అందంగా ఉంది.

మాళు మెడలో, దారంలో కూర్చిన ఒక పెద్ద తాయెత్తుండేది. అది పూర్వం తల్లి మెడలోవుండేది. ఆమె చనిపోయిన తర్వాత ఆ తాయెత్తు కూతురికి వచ్చింది. అంతిమక్రియ చేసేందుకు తన తల్లి శవం తీసుకు వెళ్ళినప్పుడు ఎవరో ఆ తాయెత్తును తీశారు, ఆ తర్వాత అది ఆమె మెడలోకి వచ్చింది.

అమ్మణి కాస్సేపు నిలబడి తర్వాత దానిని చూసింది.

"మాళు, ఎప్పుడొచ్చావు?"

దానికి మళ్ళీ బదులు చెప్పినది తంగేదత్తి.

"ఈమె గడచిన ఒక ఏడాదిగా ఇక్కడే ఉంటున్నదిగా."

ఆమెవచ్చి ఒక సంవత్సరమైంది. ఇంట్లో తన తల్లి మరణించిన తర్వాత ఆమెకు సహాయమెవ్వరూ లేకపోయారు. చిన్నమ్మను, ఆమె కొడుకులు అక్కడేవున్నారు. ఇల్లు వాళ్ళదే. తన తల్లికి ధనంఏమీలేదు. తండ్రి ఏదీ ఇవ్వడంలేదు. నాన్నమ్మనే ఆమె అక్కడ ఉండేందుకు ఏర్పాటు చేసింది.

మాళు మళ్ళీ అక్కడ వెళ్ళనవసరంలేదు. ఇక్కడ మీనాక్షికి కొంత సహాయముగా వుండేది.

కూటములో వడ్డించుటకు ఆకులు వేయడం మొదలుపెట్టారు. మొదట పిల్లలకూ స్త్రీలకూ మాత్రమే. కూటములో పిల్లలకు ఉత్తర దక్షిణ పార్శ్వములో కంచములు పెట్టి, స్త్రీలకు ఆకులు వేశారు.

పెద్దమామ బిగ్గరగా అన్నాడు.

"ఏమిటి కుట్టా, ఇంట్లో పిల్లలందరికీ అన్నంపెట్టి తీరాలి. పాలు, పూజలు వెంటనే ప్రారంభించాలి."

పిల్లలతోకూడ భోజనంచేయుట ఆవిడకెందుకో యిష్టం లేదు. ఆడవాళ్ళతో వుండుటమే ఆవిడకు ఇష్టం. త్వరగా భోంచేసి తీరుబడి కలిగితే మంచి స్థలంచూసి కూర్చోవచ్చును. గడప సమీపముగా ఒక ఆకు ఊరికే వుంది. ఆ ఆకువద్దకి వెళ్ళి కూర్చుంది. రెండు వరుసలుగా ఇరువదిమందికి పైగా పిల్లలున్నారు.

పందిరికి ముందు ప్రక్క స్తంభము ప్రక్కన కూర్చుంటేచాలు. అక్కడికి దగ్గరవుంటే ఆటస్థలము చక్కగా చూడవచ్చును.

తొందరగా అన్నం తిని లేచింది. రెండవసారి వడ్డించుటకు ముందే ఆమె అన్నంతిని లేచింది. చేతులు కడుక్కొని తూర్పు తోట వాకిలి ప్రక్కకు వెళ్ళింది. అక్కడ వంట గదిలోనుంచి ఎంగిలాకులు, కాయకూరలు వేసే గోడవద్ద కుర్రవాడొకడు నిలడిడి వున్నాడు. ఎర్రని నిక్కరు, మాసిన పసుపు రంగు షర్టు, ధరించిన చిన్న కుర్రాడతను.

మాళు కాస్త సందేహించి నిలబడింది. తర్వాత దగ్గరికెళ్ళి ఇలా ప్రశ్నించింది.

"చిన్నవాడా, అన్నం తిన్నావా?"

అతను ముఖమెత్తి ఆశ్చర్యముతో చూశాడు.

"చిన్నవాడా, అన్నం తిన్నావా?"

"ఊం"

"పిల్లలతో కూర్చుని తిన్నావా?"

"ఊం. తిన్నాను."

కేవలం మర్యాదకే అతనట్లా అన్నాడు. మాళు అది విని వేదన పడింది.

"అన్నం వద్దా?"

"పాముపోరు చూడడానికే యిక్కడికి వచ్చావా?"

అతని ఆత్మ గౌరవమును, రోషమునుచూసి ఆమెకు వెళ్లిపోదామని తోచింది. మళ్లీ తలవంచి తిరిగి అతను నేలని చూస్తున్నప్పుడు ఆమె మెల్లిగా అడిగింది.

"చిన్నవాడా, నీయిల్లు ఎక్కడ?"

అప్పుడు అతను ఆ మాట వినిపించుకోనట్లు వాకిట్లో ఎండిన పచ్చికలతో నున్న చుట్టు గోడవద్ద నిలుచున్నాడు.

"నీ పేరు?"

"అప్పణి"

"నీదేవూరు అబ్బాయీ?"

అతని ముఖం ఎర్రగా మారింది. వేదనతో ఆమె ముఖాన్ని చూసి అన్నాడు.

"ఇదే. నీకేమి కష్టము?"

ఇట్లా అడగటం అవిడకు కష్టం కలిగించ లేదు. ఏదో ఒక తమాషాగా వుంది, "ఈ యింటి కుర్రాడని చెప్పాడు. మాళు సంతోషించాలని చెప్పాడేమో.

"అక్కడి పిల్లలను చూస్తే నాకెవరూ తెలియదూ?"

మళ్లీ ఏదో చెప్పాలని అనుకొన్నప్పుడు మాళు చూసింది. అతని కళ్లల్లో నీళ్ళు నిండి వున్నాయి.

"నేను కోంతుణ్ణి కొడుకుని. నేనూ, మాఅమ్మ ఈ యింటి వాళ్లమే"

అప్పుడు ఆమె ప్రశ్నించడం ఆపింది. తంగేదత్తి ఎప్పుడో చెప్పిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఆమె చూడలేక పోయిన ఆ ఇంటి అమ్మాయిని ఇతని తండ్రి పెండ్లి చేసుకొని వెళ్లిన సంఘటనలను జ్ఞాపకం చేసుకుంది. అతనేనా అప్పణి తండ్రి?"

పనివాళ్ళు ఎంగిలాకులను చాటలో ఎత్తుకొని వెళ్ళి అరటి చెట్టు నాటడానికని త్రవ్విన గోతిలో వేశారు. అక్కడ క్రింది జాతివారి పిల్లలు ఎంగిలాకులెత్తి, అందులో వున్న అన్నాన్ని తినడానికి ఒకరి మీద వొకరు పడుతున్నారు.

మాళు అక్కడ నిలుచుంది.

"ఏమి నిలుచున్నావు?"

అతనేమి చెప్పలేదు.

"మరి లోపలికెళ్ళు."

"పందిరిలో పెద్దవ్వ, ముత్తాచి ఉన్నారు."

"ముత్తాచిని చూశానే. ఆమె కదా యిక్కడికి పిలుచుకొని వచ్చింది! ముత్తాచి ఏమి చెప్పలేదు."

ఆమె ముత్తాచిని చూసినట్లు చెప్పింది.

అప్పుడతని ముఖములో చిరునవ్వు వెలిసింది.

"మనకు ఈ స్నేహము దొరికినందుకు మంచి స్థలం చూసి కూర్చుందాము!

ఇది సరిగానే తోచిందతనికి.

"ముఖద్వారములో వుండే స్తంభము ప్రక్కన కూర్చుంటే బాగుంటుంది!

ఆవిడ ముందు నడిచింది. అతను వెనుకే వెళ్ళాడు.

* * * *

వీధిలో వుండే మైదానములో ఢమరక శబ్దము మ్రోగింది. మాళు ఉత్సాహముతో అతనితో చెప్పింది. "ఇప్పుడు ప్రారంభమవబోతుంది."

పందిరి నాలుగు ప్రక్కల్లోను లేత కొబ్బరి మట్టలు, మామిడి ఆకులతో అలంకరింపబడి వుంది ఆటరంగము ఎర్రమట్టితోను, పసుపు పిండితోను, సున్నము, పసుపుతో కలిపిన ఎర్రని పిండితోను ముగ్గులు వేయబడి అలంకరింప బడ్డది. దేహమంతా కట్లు కట్లుగా పడగ యెత్తుతున్న రెండు ఉగ్రమైన సర్పములున్నాయి.

పందిరి మధ్య అరటి చెట్లతో నాలుగు ప్రక్కల చిన్న పందిరి వేయబడి వుంది అందులో ఎర్రని పట్టు వస్త్రము పరచివుంది. అదే కుంభము పెట్టడానికని నిర్ణయించిన స్థలము.

పుల్లడు రామన్న వేర్వేరు ద్వారములుగల వెదురు కర్రని బొగ్గు బూడిద నిండిన మిట్టలో చుట్టి ఆట స్థలము తయారుచేసిన విషయం మాళు వివరిస్తోంది.

"దీపస్తంభములో దీపం వెలిగించు."

పుల్లడు రామన్న పెద్ద వాకిట్లో నిలిచి గట్టిగా కేక వేశాడు.

అరటి చెట్ల సమీప స్థలములో నాలుగు మూలలలో గ్యాసులైట్లు కాంతి విస్తరించివుంది. పందిరిలో ఏడు తీగలు గల దీపస్థంభములు మూడు దేదీప్యమానంగా వెలుగు తున్నాయి.

"పూజకు కావలసిన గంధాదులను తీసికొచ్చి పెట్టండి."

రామన్న మళ్లీ బిగ్గరగా కేకవేశాడు.

అటుకులు, పువ్వులు, ఎర్రగన్నేరు పుష్పహారములు, తులసి మొదలైనవి తీసుకురావటం జరిగింది.

"ఓ రంగవీరుడా!"

"ఓయి!"

నూతన వస్త్రములు ధరించిన యువకుడొకడు పందిరిలోకి వచ్చాడు. మాళు అప్పణిని చూసి:

"అతనే కళవీరుడు. అతనికి మ్రొక్కుకో" అంది.

"కాలూ ముఖమూ కడిగి,ధుఃర్దేవతలను మనుస్సులో ద్యానించి కుడికాలు ముందుగా పెట్టి పందిరిని ప్రదక్షణముచేసి పూజారంభమునకు సిద్ధమౌతాడు.

పుల్లువ రామన్న పాటపాడేటట్లు మాటలాడాడు. రంగములో వున్న పూజారి అతన్ని అనుసరించి నట్లు పూజారంభం చేశాడు.

"పందిరిలో పచ్చిబియ్యం, కొబ్బరి కాయలు పెట్టండి."

పుల్లుడు చెప్పినట్లు పూజారి పూజలు చేస్తున్నాడు. పూజించి నమస్కరించాడు. చేతిలోవున్న కమండలాన్నిమూసి నట్లు వంచి రంగమంతా చుట్టి నడిచి, నీళ్లని క్రిందకి చల్లాడు.

రంగములోవున్న పూజారి పందిరిలో ఒక మూలకు వెళ్లి నిలిచేందుకూ, వేటులో ప్రేలి ధ్వనించుట ఒకే సమయంలో జరిగాయి. మంచి వర్షాకాలములో అర్ధరాత్రి, నిశ్శబ్దముగానున్నప్పుడు మ్రోగుతున్న పిడుగుల ధ్వనిలాగా వినపడింది వేటుల ధ్వని.

పందిరిలో ఇంకో ప్రక్క పుల్లువ స్త్రీ, పురుషులు కూర్చున్నారు.

మూడు పెద్ద మేళములు, మూడు ఢమరములు, రెండు వీణలు, మ్రోగుతున్నాయి, వేట్లు శబ్దం వచ్చినప్పుడు వీణ, ఢమరపు ధ్వని వినిపించ లేదు.

రామన్న భార్య అని మాళు చూపిన స్త్రీ ఒకతె పాటపాడుట మొదలు పెట్టింది.

"శ్రీ మహా దేవుని.........శ్రీ పుల్లుల కొడుమెత్తి............"

ఆ పాటలో అప్పణికి ఏ రసమూ కనిపించలేదు. అక్కడ వున్న

మనుష్యులను చూస్తూ కూర్చొన్నాడతను. అతను కూర్చున్న అరుగు క్రింద కొందరు కూర్చుని వున్నారు. వాకిట్లో గోడకు బయట నలుగురైదుగురు యువకులు నిలుచున్నారు. వారి వెనుక చాప వేసుకుని అనేకమంది స్త్రీలు కూర్చొన్నారు. లోపల నడవలో కూడా ఆడవాళ్లున్నారు.

వాకిట్లో నుంచి తెల్లని విస్తారమైన గోడ వద్ద ఒక పొడుగుపాటి వ్యక్తి నడచి వచ్చాడు. ఈమధ్య ఎక్కడ నుంచయినా శబ్దము వినపడితే మెల్లిగా తిరిగి చూసేవాడు. ఏదో ఒక విధమైన కలవరము అతని ఎర్రని ముఖములో పొడచూపింది.

అప్పాణి మెల్లిగా మాళుని అడిగాడు.

"అదిగో ఆ నడిచివస్తున్న దెవరు"

ఆమె నోరు నొక్కుతున్నట్లు మెల్లిగా చెప్పింది.

"పెద్దమామ."

"పెద్దమామ" అప్పాణి మనస్సులోనే మననం చేసుకున్నాడు. ఆ ఎర్రని ముఖాన్ని మరో పర్యాయం చూడడానికి అతనికి ధైర్యము చాల లేదు. ఇతడేనా పెద్దమామ. ఇతడేనా............

ఉత్తరపు పందిరి దగ్గిర పెట్టిన దీపస్తంభములో నుంచి దీపపు తీగని అరటి మట్టతో పైకి తోశాడు ఒక వ్యక్తి. నల్లగా వంగిన మనిషిని చూసింది మాళు.

"ఆయనే నా తండ్రి." అన్నది.

అతని వల్ల తనకేమి కావాలి?

"అప్పాణి ఆవిడ తండ్రిని చిన్నమామ అని పిలుస్తుంది. కదా?"

పెద్దమామ.

చిన్నమామ.

ఇంకా ఎందరో ఉన్నారు. ఆపిల్లల గోష్టి తీసుకుందాము. భాస్కర్, కృష్ణకుట్టి ఉన్నారు. ఆడవాళ్ల గోష్టిలో పెద్దమ్మ ఉండవచ్చు కదా? మరి—

ఆవిడకది తెలుసును. ఆవిడని అడిగితేచాలు, తెలుసుకొనవచ్చును. అమ్మమ్మ, అమ్మాయి, ఆమె పుత్రులు— అమ్మకొక అక్కకూడా వున్నదట. ఆమె పేరేమి? ఆమెని ఏమని పిలుస్తారు?

ఏదీ తెలిసికో వలసిన అవసరము లేదు. ఇక్కడికి వచ్చేటప్పుడు అట్లాగేమీ అనుకోలేదు. వచ్చిన తోడిపిల్లలతో కలిసి ఆటలాడవచ్చును,

ఇంట్లోను, తోటలోను, పందిరిలోను, వాకిట్లోను, రంగములోను తిరిగి ఆడ వచ్చును. ఇక్కడికి వచ్చినప్పుడు మనసులో అలాటి ఆశలు కలిగాయి.

వీధివైపుగా అతను యింటికి రాలేదు. కొండదిగి యిక్కడికి వచ్చినప్పుడు ఎడమవైపు తోట దారిగానే లోపలికి వచ్చి నిలిచాడు. ముత్తాచి తనలో వెనుక ప్రక్క వస్తున్నది. "అదిగో అదేనా ఉత్తరాది వారిల్లు."

వాకిట్లోకి వచ్చినపుడు ముత్తాచి అన్నది. "పిల్లలతో పోయుండరా అబ్బాయి."

పెద్ద యిల్లు. విశాలమైన వాకిలి. పెద్ద పెద్ద చెట్లు, చుట్టూతా పెరిగి వున్నాయి. ఎత్తైన గడ్డి మేటు. వరుసగా ఏడెనిమిది కొట్టములలో పశువు లున్నాయి.

తిరిగి చూసినప్పుడు ముత్తాచి పెద్దయింటి వెనుక ప్రక్క గదిలోకి వెళ్లటం కనబడింది. అతను ఒంటరి వాడయ్యాడు.

ఎంతో మంది బైట గదులలోను గుమికూడారు. అతన్ని శ్రద్ధగా చూసి నట్లు ఎవరూ కనబడలేదు. తూర్పుగానున్న ఒక స్థలములో అతను నిలబడ్డాడు. ఆప్రక్కన ఎవరూ కనబడలేదు. లోపలి నుంచి ఆడవాళ్లు, పిల్లలువేసే కేకలు వినబడుతున్నాయి. తోటలో ఒకరిద్దరు పిల్లలను చూశాడు. తెలిసినవారెవరైనా ఉన్నారేమో అని చూశాడు. ఎవరూ లేరు. అతను ఒకప్రక్కగా నిలుచున్నాడు.

ఎవరైన వచ్చి చూసి ఏదైనా అడిగితే?

ఎవరైనా వస్తారేమో, ఏదైనా అంటారేమో తెలియలేదు. అయినా ఏదో ఒక భయం.

ఎవరూ ఏమీ అనలేదు. ఎవరూ అతన్ని చూసినట్లుకూడ కనబడలేదు. అప్పుడే అతనికి తోచింది, తానిక్కడకు వచ్చివుండరాదని, వచ్చినదనవసర మని....

"నేనిక్కడి వాణ్ణే," అని బిగ్గరగా చెప్పాలనిపించింది. ఎవర్నీ చూడక, ఎవరితో మాట్లాడక పోవటం అవమానకరముగా తోచింది.

—నేను ఉత్తరాది ఇంటివాడ్నే

నాపేరు వి. అప్పణ్ణి, అవును.

బడిలో తన క్లాసులో హాజరు అలాగే పలికేవాడు. "వి" అంటే వుత్తరాది వారిల్లు అని అర్థం.

ఇట్లా ఆలోచిస్తూ వుండగానే "పిల్లలందరూ ఒక స్థలంలో వుండండి," అనేమాట వినిపించింది. పిల్లలకు అన్నం పెట్టడం ప్రారంభించారు.

"అప్పూ, వాసూ, ప్రభూ, అందరూ కలిసి కూర్చోండి."

"ఎక్కడరా, చిన్నవాడు శంకరుడు?"

"నాన్నా, చిన్న కుట్టుని నాతో కూర్చోమను."

ఇట్లా నలుగురూ నాలుగు విధాలుగా మాటలాడటం వినిపించింది. కాని అతన్ని ఎవరూ పిలవలేదు.

అతనికి ఈ విందు భోజనము వద్దు అనిపించింది.

తాను ఇక్కడికి విందుకోసం రాలేదు. లోపల పాయస పరమాన్నాలు అందరి ఆకుల్లో కనబడుతున్నాయి. అతనికి ఆ విందు పచ్చగడ్డితో సమానము.

తన తండ్రి కోంతుణ్ణి నాయర్ ప్రశిద్ధిచెందిన ఆటగాడు.

అటువంటి కోంతుణ్ణి నాయరు కొడుకుని నేను........

తండ్రి వుండి వుంటే............

తండ్రిని గురించి ఆలోచించినప్పుడు సైదాలికుట్టి గురించి ఆలోచించాడు. పొట్టిగా, బట్టతలతో దొంగ చూపుగల గుండ్రమైన కళ్లు జ్ఞాపకం వచ్చాయి.

"భగవతీ, దీనికి జవాబు చెప్పనా!"

అప్పుడే మాళు అక్కడికి వచ్చింది.

ఆమె దగ్గిర పుల్లువ స్త్రీలు చేరుకొని పాడుతున్న పాటలను వినసాగాడు. తాళము, మేళము మ్రోగసాగాయి. వీణాగానము వినిపించింది.

"నల్లపాముతో పాటలుగా పాడుతున్నాడు" అన్నది మాళు. "రామన్నని చూశావా?"

రామన్నభార్య కలసి పాడనారంభించింది. అవిడ పాడటం మొదలు పెట్టినపుడు రామన్న లేచి పూజారికి ఏదో చెప్పాడు. పూజారి రంగము మధ్యకి వచ్చి గట్టిగా అరిచాడు.

"రంగానికి వచ్చేవారు రావచ్చును."

అందరి కళ్లు లోపలివైపు తిరిగాయి.

బియ్యము, ఫలహారాలు పలువిధ పుష్పములతో నిండిన బుట్టలు తీసుకొని యిద్దరు యువతులు పందిరిలోకి వచ్చారు.

"తూర్పువాకిలి ప్రక్క నిలిచి మ్రొక్కండి."

రామన్న చెప్పినట్లు వాళ్లు నిలిచి మ్రొక్కారు.

పూజారి యిచ్చు నీళ్ళతో కళ్లూ కాళ్లూ కడుక్కోండి.

"కళాన్ని మూడుసార్లు ప్రదక్షిణంచేసి సర్పముల తలదగ్గర చామరాన్ని దింపండి."

ప్రదక్షిణం వేసి వాళ్లు సర్పమునకు వెనుక ప్రక్కన నిలబడ్డారు.

"బియ్యం, పుష్పములు పెట్టి పాముకు నమస్కరించండి."

"పువ్వులమాల, చేతుల్లో పట్టుకుని నిలవండి."

బుట్టలోనుంచి పూలదండని చేతిలో తీసుకొని అక్కడ కట్టి మూసి పెట్టిన పాముల బుట్టని చూపి నిలుచున్నారు.

ఏదో అద్భుతాన్ని చూసినట్లు అప్పణి ఆ యిద్దరు బాలికలను చూశాడు. ఎడమ ప్రక్కన నల్లగా సన్నగా ఒక పిల్ల వుంది. స్తంభము అడ్డముగా వున్నందున ఆవిడని సరిగా చూడలేకపోయాడు. ఇంకో పిల్ల తెల్లని ఛాయతో సన్నగా కన బడింది. వీపు మీద ఏ ఆచ్ఛాదనం లేదు "అయ్యో ఇదేమిటి ఈపిల్లకు సిగ్గు లేదా?" అని మొదట అనిపించింది. ఆ రంగము చుట్టి వున్న దీపస్తంభముల వెలుగులో నాళములు వెలుగునట్లే కనబడ్డాయి. సగము మూసిన కన్నులు పరీక్షగా చూసినచో నిద్రపోలేదని గ్రహింపవచ్చు. అలా నిలబడి వున్న ఆవిణ్ణి చూస్తున్నప్పుడు వారి అలంకరణములు వింతగా తోచాయి.

"ఆమె ఎవరు?"

అతను మాళుని అడిగాడు.

"అమ్మణియమ్మ. పెద్దమామగారి ఆఖరి కూతురు. ఆమెకి ఒక చెల్లె లుంది."

"ఇంకో ఆమె ఎవరైతేనేం?" పాటల శబ్దము, మేళపు మ్రోత కొంచం కొంచెంగా ఎక్కువవు తున్నాయి.

సర్పముల బుట్టలో పాములు పడగెత్తి ఆడటం ప్రారంభించాయి.

రంగములో కట్టిన పాముల కన్నులు తెరచివున్నాయి. దీపాల వెలుగులో దీపజ్వాలగా మెరుస్తున్న ఆడపిల్లలను అతను మార్చి మార్చి చూడసాగాడు. ఆమె మెడలో వజ్రముల ఆభరణములు ప్రకాశిస్తున్నాయి. ఆమె శరీరం మీద ఆ ఆభరణాలు దీపనాళములాగా.... అందంగా........ వున్నాయి.... క్రమంగా

అతని ఎదుట వున్న పందిరి, జనసమూహము చెదరిపోసాగాయి. తానొక భయంకరమైన అడవిలో వున్నట్లు భ్రమ కలిగింది. ఆకాశమునంటునట్లు ఒక వృక్షము. అందు రాజ కుమారుడు నిలుచున్నాడు. తలకు మెరుస్తున్న తల పాగ, ఒంటిమీద ప్రజ్వలించు పట్టు వస్త్రము, అందులో అక్కడక్కడ చేర్చి కుట్టబడిన నవరత్నాలు, ముత్యాలు ప్రకాశిస్తున్నాయి. క్రింద ఒక గుర్రము గడ్డి మేయుచున్నది. తన రాజ్యాన్ని చూచుటకై వచ్చినట్లున్నాడు రాజకుమారుడు. దారిలో అడవిలోకి వచ్చి, దారితప్పిపోయాడు. తనతో వచ్చిన మంత్రి కుమారుడు కనిపించటము లేదు.

ఈరాత్రి వుండి తీరాలి........

అప్పుడే అడవిలో ఒక సర్పం ప్రాకుతూ రావటం అతను చూశాడు. సర్పము యొక్క ఎత్తైన పడగలాగా ఒక బాలిక స్వారీచేస్తూ వస్తున్నది. ఆమె శరీరం మీద రత్నాలదండ ప్రకాశిస్తున్నది. ఆమె శ్రేష్ఠమైన వస్త్రములు ధరించి యున్నది. వెనుక ప్రక్క పొడుగ్గా పెరిగిన కేశ సముదాయంతో........కన్నులు సగం కప్పబడి వున్నాయి.

మేళాల మ్రోతలు ఆగిపోయాయి. కరతాళ ధ్వనులతో మళ్లీ అప్పుడి కల కరిగి మామూలు ప్రపంచంలో పడ్డాడు.

రంగములో నున్న బాలికలు మెల్లిగా నాట్యం చేయ ప్రారంభించారు. ఢమరకధ్వని, మద్దెల మ్రోత, మళ్లీ ప్రారంభమయ్యాయి. అన్నీ ఒకక్షణములో కలసి మ్రోగనారంభించాయి. పాటల రాగము, తాళము మారాయి.

"ఆడాడు........ఆడు నాగమూ........

........కళములో దిగియాడు..........."

ఢోలు, భేరీలు చేయు మ్రోత ఎక్కువ కావటంతో ఆటయొక్క వేగము కూడా పెరిగింది. కళ్లములో కృష్ణసర్పములాగా కేశములు ఆడ సాగాయి.... గాలిలో చుట్టి తిరుగుతున్న అరటియాకుల్లాగా ఆ మలినమైన తెల్లని శరీరములు వూగిపోసాగాయి.

"ఈ నాడు పువ్వుల గొత్తు నిలుచుట లేదు."

మాళు అన్నది.

ఆమాట అతను విన్నట్లు లేదు.

"ఆడేసి....రావోయీ.... నాయమ్మా.... తోటలోనుండి....నువ్వు........"

"ఆడాడు........"

"ఆడాడు........"

"ఆడాడు........"

ఢమరనాదము చెవులు చిల్లులు పడేట్లు మ్రోగుతుంది. శరీరము వూగిపోసాగింది, అతనికి.

కట్టి వేయబడిన సర్పముల రూపం చెదిరి పోతున్నది....వంగి వంగి ఆడుతున్న బాలికని చూస్తుండగా ఆమె మారిపోయినట్లు తోచింది అతనికి. శరీరం సర్ప శరీరముగాను, ముఖం ఒక స్త్రీ రూపంలోను కనబడింది. మానవ ముఖములోనున్న సర్పము పడగ ఎత్తి ఆడుతోంది.

మాళు ఏదో మళ్లీ చెప్పింది.దానిని అప్పణి వినలేదు. సగం మూతలు పడిన అతని కన్నులముందు పందిరి, రంగం, అన్నీ చెదిరిపోసాగాయి.

మనుష్య స్త్రీ ముఖముతో వున్న సర్పం పడగ యెత్తి ఆడుతోంది.

లేదు. సర్పాన్ని బంధించి స్వారీ చేస్తున్న యువకుమారి కదా ఇప్పుడు కనబడుతున్నది.

ఇవన్నీ అతను కన్నులు తెరచి చూడకుండానే ఊహించుకోసాగాడు. అతను యిప్పుడు అప్పణి కాడు, రాజకుమారుడు.తన రాజ్యాన్ని చూడడానికి వచ్చి, దారి తప్పిపోయిన రాజకుమారుడు.

........చల్లని గాలి తన శరీరాన్ని తాకినప్పుడే అతను కళ్లు తెరిచాడు. అడవి పాములు, సర్ప కన్యలు ఏవీ కనబడ లేదు. మహా వృక్షముపైన కదా అతను వున్నది. ఆ యింటి వెలుపల వున్న అరుగుపైనే వున్నాడతను. బయట తడిసిన ధోవతిలాగా ఆకాశం మూసుకొని వుంది దూరంగా అరటితోటల్లో మంచు మూసుకొని పోయివుంది. దగ్గర వున్న పందిరి వాకిట్లో ఎవరెవరో తలకాళ్లు నిద్రపోతున్నారు.

వాకిట్లో వుండే తలుపుని ఎవరో తెరచి వెలుగు చూపించి మళ్లీ వెళ్లి పోయారు.

లోపల నుంచి ఎవరో జపము చేయటం వినిపించింది.

"నారాయణ. నారాయణ."

తానెక్కడ వున్నదీ తెలుసు కునేందుకు కొన్ని క్షణాలైంది.

బాగా చలిగాలి. నిద్రతో కళ్లు బరువెక్కాయి.

ఇంట్లోనుంచి ఎవరో మంచి కంఠంతో చెబుతున్నారు.

"మనుష్యుడుగా ఇట్లా భూమిలో జన్మించటం జరిగింది........"

మళ్లీ కళ్లు మూసుకున్నాడు.

మళ్లీ కళ్లు తెరచినది ఒక పెద్దచెయ్యి తన శరీరాన్ని నిమురు తున్నప్పుడే. పైకి చూసినప్పుడు అతని దగ్గిర కూర్చున్నది ఒక స్త్రీ. తల అంతా నెరసి వుంది. శరీర మంతా ముడుతలు పడినట్లు అనిపించింది. ఎర్రని చీర కట్టుకొని వుంది. ఆ వృద్ధ స్త్రీ వంక చూసినప్పుడు తనవైపుచూసి మెల్లిగా నవ్వినట్లు అనిపించింది. అప్పుడు అతని భయం తొలగిపోయింది.

ఏదో చెప్పాలని అనుకుంటుండగా ఆమె "భయపడకురా. నేనే అమ్మమ్మను........" అన్నది.

"అమ్మమ్మవా! అతని తల్లికి తల్లి!"

"నాతో యింట్లోకి రారా నాయనా!"

అప్పుణి లేచి ఆమె వెనుక నడిచాడు. అరుగుపై నిద్రిస్తున్న కొందర్ని దాటి పోవలసియుంది. గడప లోపలకెళ్లాడు. చిత్రాలంకరణములు చేయబడిన వంటింటి గడప దాటి, లోపలికి వెళ్లాడు. అక్కడే మధ్యకూటమున్నది. నట్టింటి వద్ద ఒక దీపము వెలుగుతోంది.

లోపల ఎందరో స్త్రీలు పడుకొని నిద్రపోతున్నారు. ఆ నిద్రిస్తున్న స్త్రీలందర్ని అతను ఒక్కసారి చూశాడు. రాత్రి చూసిన ఆ కన్య ఉన్నదా? నట్టింటి కూటములో నుండే స్తంభములు చూసేందుకు అందముగానున్నాయి.

ఉత్తర పార్శ్వంవైపు ఒక భాగంలో కిటికీలు మూసియున్నాయి. అక్కడ బాగా చీకటిగా వుంది. క్రింద ఎవరో నిద్రిస్తున్నట్లు వుంది.

మధ్యదారిలో నడిచినప్పుడు లోపల గదిలో మాళు ఏదో పని చేస్తూండటం చూశాడు.

ఒక కిటికీ దగ్గిర అమ్మమ్మ పీట వేసి దానిపై అతన్ని కూర్చోమని చెప్పింది.

"నాతండ్రీ, అమ్మమ్మను నేనే, నీకు తెలుసా తోట కొట్టాయిలో ఎవరూ నీవద్ద మాట్లాడ లేదు కదూ! ఇప్పుడే మాళు చెప్పింది."

అమ్మమ్మ అతని తలని మెల్లిగా నిమురుతూ అన్నది.

"నేను చేసిన భాగ్యం?"

కొంచం ఆలోచించి అమ్మమ్మ మళ్లీ అందుకుంది.

"మాయోగం, వేరేం చెప్పగలను?"

అతడేమీ మాట్లాడలేదు. కాని తన హృదయాన్ని ఏదో బాధిస్తున్నట్లు మాత్రం తెలిసిందతనికి.

"బడికి వెళుతున్నావా?"

"ఊఁ"

"ఎన్నో తరగతి?"

"ఎనిమిది." ఎంతో అభిమానంతో అతను అన్నాడు.

"బడి తెరవగానే నేను స్కూలుకి వెళ్ళిపోతా."

"నువ్వు బాగా ఉండాలి.... ..."

అమ్మమ్మ స్వరం తగ్గినట్లు తోచింది. బాగుండాలి. నువ్వైనా పైకి రావాలి.

గుమ్మం వద్దకు ఒకామె వచ్చి చూసి వెళ్ళింది. మళ్ళీ కొంతమంది స్త్రీలు గడప వద్దకు వచ్చి చూశారు. అందరి కళ్ళు అతన్నే చూశాయి. వాళ్ళందరూ తమలో తాము ఏదో మెల్లిగా చెప్పుకున్నారు. క్రొత్త క్రొత్త ముఖాలు గడపలో ప్రత్యక్షమైనాయి.

రవిక వేసుకొని, తల నెరిసిన ఒక స్త్రీ అమ్మమ్మ వద్దకు వచ్చి ఏదో చెప్పింది. తర్వాత మెల్లిగా, ఐతే, భయంతో అన్నది.

"అమ్మా, ఏదో విపరీతమైన అపద రానున్నది."

"ఏమిటే అపద?"

"పెద్దమ్మకు తెలిస్తే నువ్విక్కడుండనవసరం లేదు."

అమ్మమ్మకు అమాంతంగా కోపం వచ్చింది.

"ఏమిటే, నన్ను చంపేస్తారా?"

"నీకూ ఈపిల్లాడికి మంచి జరగాలి. అదే నేను కోరేది.

"ఏమేయ్! ఇతని తల్లిని కూడా కడుపులో మోసి కనినదాన్నే."

"అది సరే, అమ్మ పెద్దమామతో చెబితే నేను విన నక్కర్లేదు."

అమ్మమ్మ ఏమీ అనలేదు. గుడ్డతో తన కళ్ళు తుడుచుకుని మూసుకొంది. వాదానికి వచ్చిన స్త్రీ మౌనంగా వెళ్ళింది.

ఇప్పుడు గడపలో స్త్రీలు ఎవ్వరూ లేరు. కానీ కొంతమంది చిన్న పిల్లలున్నారు. వాళ్ళందరూ అతన్ని ఆశ్చర్యముగా చూస్తున్నారు.

ముందు రోజు పగలు కొట్టాయిలో చూసిన ముత్తాచిని అప్పుడే అతను చూశాడు. ముత్తాచి వంటగది ప్రక్కనుంచి వచ్చి

"అప్పూ నువ్వు వెళ్లవద్దూ? నిన్ను యింటికి తీసుకెళ్లాలి కదా........ అన్నది.

అమ్మమ్మ దానికి ప్రత్యుత్తరమిచ్చింది.

"అమ్మాయీ, ఇతనిప్పుడు రాలేడు."

ఆడవాళ్లందరూ ఒకరి వంక నొకరు చూసుకోసాగారు. మళ్లీ ఏదో గుసగుసలు. రవిక వేసుకొనివున్న స్త్రీ గొంతు సవరించుకుని మౌనంగా ఆ గదిలో నుంచి ఆ దారిగా వెళ్లింది. దారిలో గోళ్లు కొరుక్కుంటున్న ఒక చిన్నవాడి వీపుపై ఒక దెబ్బనిచ్చి వెళ్లింది.

"మాళూ, ఇలా రావే."

మాళు వచ్చినప్పుడు అమ్మమ్మ "మాళూ అప్పుణి, తండ్రి కదా ఇంత మందికి అన్నం పెడుతున్నాడు?" అన్నది.

అప్పుణి కూడా ముత్తాచి సంశయంతో నిలబడింది.

"అమ్మాయీ మీరు వెళ్లండి. ఇతన్ని నేను తర్వాత పంపిస్తాను."

ముత్తాచి వెళ్లిపోయింది.

అప్పుణి మాళుతో కూడా వాకిట్లో పళ్లు తోముకున్నాడు. అతను మళ్లీ అమ్మమ్మ వున్న గదిలోకి వచ్చాడు. అమ్మమ్మ మోకాలుపై ముఖాన్ని ఆనించి ఏదో ఆలోచిస్తూంది. తల వంచుకొని అప్పుణి కూడ అలాగే మౌనంగా నిలబడ్డాడు.

అమ్మమ్మకు గంజితీసుకొని వచ్చినప్పుడు, అతన్నికూడ గంజిత్రాగమని అన్నారు. వంటగదిలో నుంచి ఏవో గుసగుసలు వినబడ్డాయి.

గంజి, కాల్చిన అప్పడాల పదార్థములను భుజించుటకు మనస్సు ఒప్పుకొనలేదు.

నాలుగు ముద్దలు కష్టంమీద తీసున్నాడు

అప్పుడు తొందరగా ఆడవాళ్లందరూ వంటగదిలోకి పరుగెత్తటం, పిల్లలందరూ వాకిట్లో నిలిచి తన వొంక చూస్తూ నిలుచోవటం కనిపించింది

పిడుగు మ్రోతలాగా ఒక కేక

"చంపేస్తాను."

అమ్మమ్మ పనసాకుని గిన్నెలో పెట్టి మెల్లిగా జపించింది.

"నారాయణ, నారాయణ."

గడపవద్ద. భూమి నుంచి పై గడప వరకు నిండినట్లు ఒకాయన వచ్చి నిలుచున్నాడు.

"పెద్దమామ,"

"చంపేస్తాను. ఇతనేనా ఆ నీచుడు. ఎవరీ కుర్రాడు?"

అమ్మమ్మ ఏమి అనలేదు.

"మిమ్మల్నే అడిగేది ఎవరీ కుర్రాడు?"

"ఇతడు....పారుకుట్టి....కొడుకు."

"ఎవరది పారుకుట్టి? ఎవరు?"

అమ్మమ్మ కోపంతో చేపుతుందని అనుకున్నాడాయన. అయితే అమ్మమ్మ శాంతంగా జవాబిచ్చింది.

"నేను నవమాసములు మోసి కనినది."

"ఛీ! నాఇల్లు, దారినిపోయే నీచులు చేరే స్థలం కాదు. ఎవతే అది ఈ నీచునికి గంజి పెట్టింది?"

అమ్మమ్మ లేచి నిలబడింది. అతనుకూడా రోషంతో లేచాడు.

అప్పుడే చంపి వేయాలనిపించింది....చావపోతున్నాడు....అతని మెడ మీద అతని చేతివ్రేళ్లు పడ్డాయి. తలుపు ప్రక్కనున్న గడపను చూపించి అతను అరిచాడు.

"పరుగెత్తి ఫో!....ఇక ఇటువైపు చూస్తే నీ కాళ్లు విరగ్గొడతాను పారిపో...."

చేయి కడుక్కునేందుకు వీల్లేక అతను బయటికి త్రోయబడ్డాడు.

అతను నడవటం లేదు. పరుగెత్తుతున్నాడు....

వాకిట్లో దారిలో రాళ్లమీద పడి లేచినప్పుడు అమ్మమ్మ చెప్పినమాటలు వినబడ్డాయి.

"అనుభవించాలి....దీనికంతా అనుభవించి తీరాలి."

వెనుక ప్రక్కనుంచి ఎవ్వరో తరుముతున్నట్లుగ భీతితో అప్పుడి నడిచి వెళ్లాడు.

ఇంటికి పరుగెత్తికెళ్లి కొండ పైకి ఎక్కేంత వరకు అతను ఏడుస్తూనే వున్నాడు.

ఏడుపు ఆగక వెక్కిళ్లుగా మారింది. చొక్కా కొనతో కళ్లు తుడుచు

కుంటూ చెక్కెర గడ్డలు నాటిన బాట వదలి కొండ వైపుకెళ్లే దారిలోకి వెళ్లాడు. ప్రాతః కాలపు ఎండకాస్తున్నది.

ముందుగా........చిన్న చిన్న చెట్లు పెరుగుతున్న అడవి వద్ద ఒక రాతి మీద కూర్చున్నాడు.

ఎంతో అవమానం జరిగింది. భరించలేనిది జరిగినట్లు. తను ఓటమిని చెందినట్లు తోచింది అతనికి.

ఆగిన కన్నీరు మళ్లీ పొర్లసాగింది. అమ్మ అంధుకే చెప్పింది, అక్కడికి వెళ్లరాదని. వినకుండా వచ్చేశాను. ఈ విషయము అమ్మకు తెలిస్తే!

కాళ్లని విరిచి వేయాలి!.... పురుగులు పట్టిన మేకలాగా విరిచివేయాలి!

ఆడవాళ్లందరూ చూశారు. పిల్లలందరూ చూస్తూ నిలబడ్డారు. మెడబట్టి బయటికి తోశారు అవమానం....డబ్బు లేని వాడైనా తన తండ్రి పౌరషంతోనే జీవించాడు. ఎదట నిలబడి అడగడానికి ఒకడికైనా ధైర్యం లేదు....వీరుడైన ఆ కోంతుణ్ణి నాయరు కొడుకు తను అయితే, అక్కడ బెదిరించినప్పుడు, పిరికి వాడులాగా పరుగెత్తి వచ్చేశాడు.

అయితే పరుగెత్తి రాకుండా వుండేందుకు వీల్లేదు. గడప నిండినట్లు నిలచిన ఆ క్రూర రూపం అతని మనసులో నిలిచింది.

నిర్మానుష్యమైన ఏదైనా ఒక పాతాళానికి పోయి దాక్కోవాలనిపించింది అతనికి. లేదంటే ఏదైనా బండెక్కి ఎక్కడికైనా వెళ్లిపోవాలనిపించింది.

పురుగులు పట్టిన మేకలాగా.

చచ్చిపోయినా ఏమీ అవమానకరంగాదు. ఎవరూ ఏం చేయలేరు. అవమానం చేయరు. అకాశంలో వున్న దేవలోకానికి వెళ్లిపోవచ్చు....స్వర్గంలో ఆ పాత ఇల్లు, పెద్దమామ ఎప్పరూ ఉండరు.

అప్పుడు అతని వెనుక నుంచి ఏదో గొంతు వినపడింది. దిగులుగా తిరిగి చూశాడు. భగవంతుడా! శరీరం వణికింది. ఎవరది వెనుక నిలుచున్నది. నల్లని గుండ్రపు కన్నులతో, చిన్న తలగల ఓ మనిషి.

సైదాలి కుట్టి కదా!

మాంసంలో విషంపెట్టి తండ్రిని చంపిన వాడుకదా?

అతనికి విషమిచ్చి మళ్లీ పంపించారా?

చంపుతామనుకుంటున్నాడా?

ఘనమైన నల్లనిఅతని చేతిని భయముతో, కలవరపడి చూశాడు.

"ఎందుకురా ఏడుస్తున్నావు?"

బెదిరింపుకాదు. మెల్లిగానే అడిగాడు.

"ఎందుకురా యిక్కడున్నావు?"

దానికతను జవాబివ్వ లేదు.

"ఏడవకు అబ్బాయి!"

అది చంపడానికి వచ్చిన మనిషి యొక్క కంఠం కాదు. అప్పణి నీళ్లు నిండిన కళ్లు ఎత్తి అతన్ని చూశాడు. ఆ కళ్లు భయంకరంగా లేవు. నల్లని ఆ కళ్లల్లో అమ్మమ్మ ముఖములో చూసినట్టి ఒక విధమైన ప్రేమ నిండి వుంది.

"ఇంటికి వెళ్ల లేదా?"

అతను అదే అర్థముతో తల ఆడించాడు.

"వెళ్లు, నేనూ వస్తా?"

అతను ముందుగా, అప్పణి వెనుక నడిచారు. కొండ దిగినప్పుడు అతని ఏడుపు ఆగింది.

"ఈ తెల్లవారి వేళలో కొండపైగా ఏమిటి చేస్తున్నావు?"

"ఏమీ లేదు."

"ఎక్కడ నుంచి వస్తున్నావు?"

"అక్కడ........ఉత్తరాది వారింటనుంచి."

"ఎందుకు ఏడుస్తున్నావు?"

జవాబు లేదు.

"భోంచేశావా?"

"ఊం—ఊ"

"మరి ఎందుకు ఏడుస్తున్నావు?"

"అక్కడ ........అక్కడ ........ పెద్దమామ.............

మిగతాది చెప్పడానికి అతనివల్ల కాలేదు.

సైదాలి కుట్టి మళ్లీ ఏమీ అడగలేదు. కొంచెం దూరం ఇద్దరూ మౌనంగా నడిచారు. తర్వాత సైదాలికుట్టి చెప్పాడు.

"అక్కడికి పోయేందుకు నీకు హక్కు వుంది."

సైదాలికుట్టి అతని భుజముపై చెయ్యి వేసి నడుస్తున్నాడు. రాళ్లు పేర్చిన

పెద్ద పల్లము దగ్గరకి వచ్చినప్పుడు అతని మనసులో ఏవో అవ్యక్తమైన తలుపులు కలిగాయి.

"మెల్లిగా రా. అట్లా తిరిగి రా"

అతను మెల్లిగా ప్రక్కనున్న పల్లపు కాలువ వద్దకు వెళ్లాడు. అది దాటితే మూడు, నాలుగు అంగడులున్నాయి.

"నాయరు కుట్టీ, టీ తాగుతావా?"

"నాకొద్దు."

తనయింటి దగ్గరకొచ్చాక సైదాలికుట్టి ఆగాడు.

"నాయరుకుట్టీ, వెళ్లొస్తాను."

అతను తొందరగా గడపదాటి లోపలికెళ్లాడు.

తల తడుముకుంటూ భగవంతుని గురించి ఏదో గొణుక్కుంటూ సైదాలి కుట్టి వెళ్లిపోయాడు.

* * *

"రెండు రోజులు ఇంటి పనులకు పోనక్కరలేదు...." కుంజత్తోలు వారింట్లో వున్నవారు పెళ్లికని వెళ్లిపోయారు. ఇంటి యజమానురాలు కూడా వెళ్లిపోయింది. ఆమెకి తోడుగా "ఇక్కావమ్మ" అనే ఆమె కూడా వెళ్లింది.

పారుకుట్టి ఆ ఉదయం కాస్త ఆలస్యంగా లేచింది. శంకరన్ నాయర్ని కలుసుకొని మాట్లాడాలని నిశ్చయించుకున్న విషయం లేవగానే జ్ఞాపకం వచ్చింది. అతన్ని ఎక్కడ కలుసుకోవడం? తామున్న వీధిలోంచి కనుక వెళ్లితే మాట్లాడవచ్చు. లేకుంటే అప్పుణ్ణిని పంపించి అడిగి రమ్మనవచ్చును అయితే అతని యిల్లు ఎక్కడున్నది. అప్పుణ్ణికి తెలియదు. తనకూ తెలియదు ఎవరినైనా అడిగి తెలుసుకొని పోవాలి. ఆ యింటి పనికి వెళ్లినప్పుడు సాయంకాలములో స్నానం చేయడానికి ఆ దారినే వెళ్లేది. ఈ రోజు ఇంట్లోనే వుండ వలసి వుంది. అతను వ్యర్థముగా అక్కడా ఇక్కడా తిరుగుతూ యితరుల యిండ్లకు పోయే అలవాటు గల వాడు కాడని విని వున్నది. అటువంటి పక్షంలో అతను ఇంట్లోనే వుండి వుంటాడు.

ముందు రోజు కొంచెం అతనితో మాట్లాడుదామనిపించింది. అయితే అప్పుడు, రేపు మాట్లాడుదామని వాయిదా వేసింది. రేపు పనికి పోవలసిన అవసరం లేదని అప్పుడు అనుకోలేదు. అంతేకాక శంకరన్ నాయర్ని కలుసు

కున్నప్పుడు తలయెత్తి చూసేందుకు ధైర్యం చాలలేదు. ఉత్తరాది వారి ఇంట్లో తాను చిన్న తనములో మాత్రమే అతన్ని చూసి వుంది.

ఆ మొదటి సంఘటన జ్ఞప్తికి వచ్చినప్పుడు ఎంతో బాధ కలుగుతుంది. రోటిలో వడ్లు వేసి దంచ్చేటప్పుడు, అరుగుపై ఆ ఇంటి వారమ్మాయి తాను ఎంగిలాకులలో తినేటప్పుడు, కుంజత్తోలు' పిలిచేటప్పుడు, ఇతర నౌకర్లను అదిలించి మాటలాడేటప్పుడు, ఇవన్నీ ఎంతో అవమానముగా తోచేవి....శరీరం మీద ధరించిన వస్త్రములు కిందపడినప్పుడు ఎంత అవమానం కలుగతుందో అంత అవమానమూ అనుభవించేది.

ఒక రోజు అన్నంతిన్న తర్వాత రోలు వైపున కూర్చుండినప్పుడు కుంజత్తోలు పిలిచాడు.

"పారూ.........."

ఆమె బయటికి వచ్చినప్పుడు అతను చెప్పాడు "కూటానికి వెళ్లు, ఆ వడ్లను పోగు చెయ్యి."

ఆ కూటములో పాలేరు రెండు బండ్ల వడ్లను పోసి పెట్టి వుంచాడు. పంట పండిన వడ్లనింటికి తీసుకొచ్చాడు.
పెద్దగాదె ఒకటి తయారుగా వుంది. ఆ యింట్లో రెండు వడ్లగిడ్డంగులున్నాయి.

పెద్దగాదెలు రెండు వున్నాయి. కుంచము ఒకటి పెద్దదిగా నున్నది. ఒక తూముకు పదహారు చిన్న పడులు. అమ్మే వస్తువులకు పదిహేను పడులు పట్టు చిన్న కుంచముండేది. అందులో సరిగ్గా పధ్నాల్గు పడులే పడుతాను.

"ఏయ్ పిల్లా, వడ్లను కొలిచిపెట్టు."

శరీరాన్ని ఒక తుండు గుడ్డతో మాత్రమే కప్పుకున్న పెద్ద నంబూదిరి గడపలో నుంచుని అన్నాడు. వేరే పని వాళ్లక్కడే వున్నా ఆ ప్రాంతమంతా వినపడేట్లు బిగ్గరగా అతను చెప్పాడు.

పెద్ద చాటనెత్తుకొని వడ్లని చేర్చి కుంచములో వేయుటకెత్తేటప్పుడు ఆమె వణికిపోయింది. కుంచము పట్టుకొని వంగినట్లు నిలిచిన ఆ మనిషిని అప్పుడే ఆమె చూసింది. తన యింటికి అప్పుడప్పుడు వచ్చిన శంకరన్ నాయర్! శరీరమంతా ఏదో గగుర్పొడిచింది. ఏ భావమును ప్రదర్శింపక వడ్లను కుంచములో పోసింది.

ఆ యింటికి పనిగత్తెగా పోయిచేరి మూడు రోజులైంది. ఈ విషయం

తర్వాతనే అతను తెలుసుకున్నాడు. ఆ రోజు శంకరన్‌నాయర్ని చూసింది, పారుకుట్టి. అప్పుడామె కళ్ళు చెమ్మగిల్లాయి.

అతను గంభీరంగా అన్నాడు.

"అంతా దైవలీలలు, పారుకుట్టమ్మగారు."

మునుపు తన కుటుంబాన్ని వదిలి వచ్చాక కూడా శంకరన్‌నాయర్‌ని కలుసుకుని వుంది. అయితే ఆ రోజుల్లో గౌరవంగా తలఎత్తిచూసేది. అప్పుణి తండ్రి జీవించివున్న రోజులు అవి.శంకరన్ నాయర్ అప్పుడప్పుడు ఇంటికివచ్చి పోతుండేవాడు.చేపలు పట్టు జీవనములో శంకరన్‌నాయర్ అతనికి భాగస్తుడు. శంకరన్‌నాయర్ వలవేసి చేపలు పట్టటంలో సమర్థుడు.సముద్రములో ఎక్క డెక్కడ ఎక్కువగా చేపలు దొరుకుతాయో అక్కడ చేపలు పట్టేవాడు.ఆరోజుల్లో అప్పుణి తండ్రి వద్దకు తన తలపైటోపీ, భుజముపై పెద్దచేప వలను వేసు కొని పిలవడానికి వచ్చేవాడు... ....చేపలంటే అప్పుణి తండ్రికి చాలాప్రియం. అతని వద్ద చిన్న వలే వుండేది. చిన్నరకం చేపలు పట్టేందుకు ఈ వల చాలు. పెద్దరకం మత్స్యములను పట్టుటకు శంకరన్ నాయర్ దగ్గరుండే పెద్ద వల అవసరం.

ఆ ఇంటి కూతురుగాను, భాగ్యవంతురాలిగాను తనని చూసిన వాడతను. అతను తన నిప్పుడు చూస్తున్నదాన్ని తలచుకుని గుండెలు పగిలినట్లయింది.

మన యోగము....!

అప్పుణి సర్టిఫికేటు తీసుకురావడానికి బడికి వెళ్ళాడు.

బావిగట్టులో అప్పుణి చేపలకు వేసిన గట్టుని, పారుకుట్టి నీరు పోసి శుభ్రం చేసింది. చేపల గుచ్చే దండెముగా ఎండలో ఎండటానికి ఒక కర్రని విరిచి నిలపి దారం కట్టింది. అరటి చెట్ల వద్ద తన ముడివిప్పి....శుభ్రపరుస్తూ ఊరికే కొంచంసేపు నిలబడింది. అప్పుణి చేతిలో నుంచి పడి విరిగిన అద్దపు తునకలు ఆ అరటిచెట్ల క్రింద పడివున్నాయి. అప్పుణికి జాగ్రత్తగా నడవటం తెలీదు. ఆ గాజుముక్కల మీదుగా పరుగెత్తి గాయం చేసుకుంటాడు.

ఒక విరిగిన అద్దపు ముక్కని చేతిలో తీసి తన ముఖంపై వేలాడుతున్న ముంగురులను వ్రేళ్ళతో మెల్లిగా సరిదిద్దుకుంది. ఆమె ముఖం నల్లబడి పోయింది. అప్పుడు - తాముత్తాచి తనని పొగడటం అలవాటు. దీపస్తంభాన్ని వెలిగించి పెట్టినట్లుండేదట తన ముఖం. అప్పుడావిడకు పదిహేను పదహా

ఏళ్ళ ప్రాయము. ఆ తర్వాత కాలగతిలో పద్నాలుగు, పదిహేనేండ్లై పోయాయి.

నూనెతో తలంటుకుని ఎప్పుడోగాని స్నానం చేయటంలేదు. తల వెంట్రుకలు గాలిలో ఎగురుతున్నాయి. నిత్యము తలకి నూనైనా రాసుకోనందు వల్ల జుత్తు బిరుసెక్కింది. చిన్నతనంలో అక్కలుండేవారు. దువ్వి, శృంగారించేవారు. ఈవిడకు తలవెంట్రుకలు చాలా పొడవైనవి అని చెప్పుకునేవారు. ఇప్పటికీ తల వెంట్రుకలు మోకాలునంటి వున్నాయి.

అద్దంలో తన కనుపాపలను ముఖం ఎత్తి చూసుకుంటున్నప్పుడు దూరం నుంచి వస్తున్న ఒక వ్యక్తిని చూసింది. శంకరన్ నాయరుకదూ? అతనే, శంకరన్ నాయరే. మంచిదైంది. అతను యిక్కడికి వస్తున్నట్లే తోస్తున్నది

కంచె ప్రక్కగా వెళుతున్నప్పుడు అతన్ని పిలిచింది.

"శంకరన్ నాయరుగారూ?"

అతను చెట్లమధ్య ఆమెను చూశాడు.

"పారుకుట్టమ్మా, పిలిచావా?"

"శ్రమ లేదనుకుంటే మీతో మాట్లాడాలి. ఒక సంగతి చెప్పాలనుకుంటున్నాను."

అతను రెండడుగులు వేసి గడపవద్దకు వచ్చి నిలబడ్డాడు. అరుగుమీద ఒక పాత చాపవేసి, కూర్చోమనిచెప్పి, గడప లోపల నిలబడింది పారుకుట్టి. మట్టినేలలూ, వాకిట్లోయున్న ఖాళీ స్థలాన్ని చూస్తూ అతను తలవంచుకుని మౌనంగా కూర్చున్నాడు.

"కోంతుణ్ణి నాయర్ చనిపోయిన తర్వాత నేని యింటికేరాలేదు."

అతను తలఎత్తకుండానే అన్నాడు.

పారుకుట్టి ముఖాన దుఃఖచాయలు నిలిచాయి. దగ్గుత్తికతో అన్నది.

"ఆ తరువాత ఎవరూ ఇక్కడికి రాలేదు."

కొద్ది నిమిషాలు గడిచాయి.

అతను చూరుని చూస్తూ అన్నాడు..

"కంచె లేని తోట. చూసినవారందరికీ లోకువైపోయాను. ఒక అరటి మొక్కకూడ లేనిదాన్ని...."

ఆ ఖాళీ స్థలంలో అరటిచెట్లు పెట్టినది అప్పుణ్ణి తండ్రియే. అతను

పోయినతర్వాత ఏదీ తోటలో పెట్టడంలేదు. అక్కడుండే చెట్లన్నీ నశించి పో యాయి. పశువులుమేసి చెట్లన్నీ నిర్మూలమైపోయాయి.

కంచె కట్టాలి. రెండు గెలలు అరటికాయలు కాస్తే, ఉప్పు మిరప తీయవచ్చు కదా?

పారుకుట్టి అందుకు జవాబియ్యలేదు.

"అప్పుణ్ణి ఎక్కడ?"

"బడికి వెళ్ళాడు"

"బడి తెరిచారా?"

"ఈ రోజే తెరిచారు. అతను ఎనిమిదవ తరగతి ప్యాసయ్యాడు. ఈ రోజు సర్టిఫికేట్ తెచ్చుకునేందుకు వెళ్ళాడు. మీకు ఒక విషయం చెప్పాలనే మిమ్మల్ని రమ్మన్నాను."

"ఏమిటీ?"

"నా కొడుకు తృత్తలలో వున్న బడిలో చేరాలని ఆశపడుతున్నాడు."

"ఊ. అతను చదివి ఏదైనా ఉద్యోగం చేశాడంటే నీ కొరత తీరుతుంది"

పారుకుట్టి గడపని గోరుతో గీరుతూ, కలవరంతో చెప్పింది.

"నాకేం చేయడానికి తోచలేదు. అతనికి ఆశ వుంది."

"ఊ. చదవనీయమ్మా. ఎలాగైనా దేవుడు సహాయపడతాడు, పారు కుట్టమ్మా."

"జీతం కట్టాలి. నెలకు నాలుగు రూపాయలు డెబ్బైయైదు పైసలు. ప్రయాణానికి వేరే ఖర్చుపెట్టాలి. ఎలాగో ఎనిమిది రూపాయలు తయారు చేశాను."

పారుకుట్టమ్మ తనను పిలిచింది డబ్బు అప్పు అడగడానికని అతను గ్రహించాడు. తన చేతిలో ఏం లేదు. ఎక్కడకు పోయి అడిగేది? ఎవరిస్తారు ఈశ్వరా? అత్తుణ్ణి యివ్వవలసినది అంది వుంటే బాగుండేది.

"రేపు అతన్ని బడిలో చేర్చడానికి కూడ పోవాలి. అతనితోకూడా పోవ డానికి ఎవరూ లేరు...."

పారుకుట్టి మళ్ళీ కళ్ళు తుడుచుకుంది.

"నేను వెళ్ళొస్తా పారుకుట్టమ్మా...."

"అందుకోవం బాధపడవద్దు" అతను తుండుతో ముఖాన్ని తుడుచుకుంటూ "చేతిలో డబ్బులేదు. మీకు సహాయం చేద్దామంటే వేరే గత్యంతరం లేదు "

తలవంచుకుని, నూనె ముఖమురుగని తలవెంట్రుకలు ఆడుతూ కన్నీరు పారుతున్న కళ్ళు తుడుచుకునేందుకు ముఖాన్ని కప్పుకుని నిలిచింది ఆమె. ఆ స్త్రీ ముఖాన్ని చూస్తుంటే శంకరన్ నాయరు మనసులో జరిగిపోయిన ఒక తాలూకు చిత్రము జ్ఞప్తికి వచ్చింది. అదే శ్మశానంలో చంద్రమతి నిలుచున్న దృశ్యం.

ఇద్దరూ కాస్సేపు మాట్లాడలేదు. ఆమెకూడా అనాటి సంఘటన ఏదో తలచుకోసాగింది. అతను ఏవేవో తలపులతో కూర్చున్నాడు. ఏదో ఆలోచించి నట్లు ఆమె అన్నది.

"అప్పుణ్ణి వెళ్ళాడు" అన్నది.

"తెలుసును"

"అతను వెళ్ళి వుండకూడదు"

"అతను వెళ్ళటంలో ఏమి తప్పుంది? చిన్నవాడు కావటంవల్ల తరిమితే పారిపోయి వచ్చాడు. అక్కడున్న మిగతావారికి మల్లె అతనికి అధికారముంది. అతనికీ ఒక భగవంతుడున్నాడు. అంతా చేస్తాడు." అంటూ అతను అరుగు మీద నుంచి లేచాడు. ఓరగా నిలిచి బయట వున్న గుంజని పట్టుకొని మళ్ళీ ఏదో ఆలోచించినట్లు ఆగాడు.

"నేను తెల్లవారి వస్తాను. అప్పుణ్ణి ఇంటికిరానీ!"

"సరేనండి."

అతను బయటికి వెళ్లాడు.

తర్వాత తల నిమురుకుంటూ.... మెల్లిగా "మీకు ఎప్పుడైనా ఏదైనా కావాలంటే చెప్పండి, పారుకుట్టమ్మా, అన్నాడు."

తువ్వాలు విదిలించి, భుజాన వేసుకొని అతను చక చక నడిచి వెళ్లి పోయాడు.

పడవ దగ్గర అత్తుణ్ణి రెండు రూపాయలు అప్పు తీకుకున్నాడు. ఇంకా ఇవ్వలేదు. అగిడి అడిగి మానేశాడు. ఇప్పుడైనా అతన్ని అడిగి తీరాలి, కొన్ని రోజులుగా ఆ సిగ్గులేని వాడు సాకులు చెబుతున్నాడు. ఈ రోజు ఎలాగైనా ఇచ్చేస్తానని చెప్పాడు. అతన్ని గట్టిగా అడిగి తీరాలని శంకరన్ నాయర్ నిశ్చయించుకున్నాడు.

పారుకుట్టమ్మ యింటికి వచ్చిన తర్వాత అత్తుణ్ణి యివ్వవలిసిన

రెండురూపాయల అప్పుసంగతి మరిచి పోయాడు. ఒంటరిగా నడుస్తున్నప్పుడు, పురుషసహాయం లేని ఆ స్త్రీ గురించే తలపోయ సాగాడు.

మంచి రోజులు చూసింది ఆమె.... మనుష్యుల జీవితం ఇటువంటి దాయని అతనికొక వేదాంతం మనసులో కలిగింది.

మొగిలి చెట్ల బాటలో నడుస్తున్నాడు....ఆవిడ కేదైనా జరిగితే ఆ కుర్రాడి గతేమిటి? నాలుగు రోజులు జబ్బుతో పడితే పొయ్యిలో నిప్పురగలదు. ఆ కాలములో పదివేలు బస్తాల వడ్లు పండు ఒక పెద్ద ఇంటి కూతురు. అప్పు డప్పుడూ అతనికి అనిపించేది.

రాత్రిళ్లు, అమె తన కొడుకు ఒంటరిగా వుంటారు. ఏకాంత మైన ఆ యింట్లో ఈ వయసులో ఒక స్త్రీ, ఒంటరిగా కాలం గడపాలి.

కాని దానిలో పెద్దరికమున్నది. బిక్షకైనా తనయింటి కావిడ పోవడం లేదు. ఆవిడని ఎరిగిన వారికిది తెలుసును.

ఇంటిపని కోసం వెళ్లటం, ఆమె చేసే పనులన్నీ శంకరన్ నాయరుకు తెలుసును. ఆమె పనిచేసే ఇంటిగత్తె మహాపాపి! నలభై వయస్సు వుంటుంది అయినా ఆడదాని కుండే సిగ్గులేనిది. "శంకరన్ నాయరూ" అని పిలిచేటప్పుడు ఆమెకు రెండు దెబ్బలియ్యాలనిపించేది అతనికి. ఇప్పటికీ తనకు పదహారు వయసులా ప్రవర్తించేది. నిత్యం యింటి ముంగిట్లో కూర్చుంటుంది. ఆడంబరం ఎక్కువ.

ఆ చిన్న యజమాని! అతడొక బ్రాహ్మణుడేనా! నీతి నియమం లేదు. న్యాయముగ వేకువనే ఇంటి గడపలో వచ్చి కూర్చుంటాడు. అతని కళ్లు ఎప్పుడూ అక్కడ వడ్లు వారుస్తున్న పనిగత్తెలపైన వుంటాయి.

పారుకుట్టమ్మ ఆ యింటిపనికి పోతున్నదని ఎవరో తనకి మొదట చెప్పి నది? అయిదారేండ్లకు ముందు జరిగన సంఘటన అది. అప్పుడావిడ అంటే గిట్టేదికాదు. కుటుంబ గౌరవాన్ని పాడుచేసింది. ఇక ఆ నంబూదిరికి అవమాన మేయని కోపంగా వుండేది. అయితే యింటి పనిగత్తెగా పెద్దనంబూదిరి ఆమెను నియమించిన తర్వాత అది చూశాక తన అభిప్రాయం మార్చుకున్నాడు. ఉదయం నుంచి ఆ యింట్లో వారిచ్చే పనులన్నీ చేస్తుంది. తర్వాత ఇంటికి వెళుతుంది. పారుకుట్టమ్మకు తెలియకనే అతను ఆమెను చూస్తూ వుండేవాడు. మంచి అణకువతో మర్యాద గల స్త్రీ ఆమె. ఎవరైనా దారిలో వుంటే ఆ దోవలో ఆమె వచ్చేది గాదు. మగవారితో తిన్నగా చూసి మాట్లాడి అతను ఎరగడు. అటువంటి స్త్రీ అమె తలరాత బాగలేదు.... అమె ఖర్మం ఇలా కాలింది,

ఆమెకు ఎవరూ లేరు.

తల్లి, అక్కలు, అన్నలున్నారు. ఉత్తరాది వారింటికి రెండు మైళ్ళ దూరమున్నది ఆమె యిల్లు. అయితే ఆ రెండు మైళ్ల దూరము ఇప్పుడామెలో ఎంత వ్యత్యాసం తీసుకువచ్చాయి.

"అప్పటికి అవమానం చేసి పంపారు....వాడి తప్పేమి? అతనేమి చేశాడు? అతనూ ఆ ఇంటివాడు కదా! అంతమాత్రం చాలదు. మంచి మనిషి అయి వుండాలి.

శంకరన్ నాయర్ కోపంతో గాండ్రించి ఉమ్మేశాడు.

దారిలో ఉణ్ణీరు కలిశాడు. అతన్ని చూసినప్పుడు, ఏదో జ్ఞాపకను వచ్చింది. అడిగాడు "మీవద్ద కంచె కట్టేందుకు వెదురు వుందా ?"

"నా దగ్గర లేదండి. దొంగలెత్తుకు పోయారు. బహుశః కొద్దిగా మిగిలి వుండవచ్చు. కావాలంటే తీసుకోండి" అన్నాడు.

"నాకు నాలుగైదు మోపులు కావాలి, రేపు నాయింట్లో పనిచేసే అప్పుని పంపిస్తాను."

"నా యింటికి కంచె వుంది. ఇంకొకరికి కావాలి. రేపు నా పని వాణ్ణి సాయంకాలం పంపిస్తాను."

అప్పటికా ప్రశ్న తీరింది. ముళ్ల మొక్కల కోసం ఉణ్ణీరుకు డబ్బేదీ యివ్వనక్కరలేదు. ఇద్దరు కుర్రాళ్లను పెట్టుకొని కత్తితో ఒక్క రోజులో కంచె కట్టడం ముగించవచ్చును. రెండు రూపాయలు కూలి యివ్వవలసి వుంది. కాని చూద్దాం. రెండు రూపాయల గురించి ఆలోచించగానే అత్తుణ్ణి యివ్వవలసిన డబ్బు జ్ఞాపకం వచ్చింది.

యూసఫ్ అంగడికి వెళ్లాడు. అక్కడ చేపలమ్మువాడి దగ్గర ఎవరో యిద్దరు బేరం చేస్తున్నారు.

"పడవకాడు అత్తుణ్ణీని మీరు చూశారా?"

"రాత్రి ఎక్కడైనా వెళ్లిపోయాడేమో."

మునలియారు తన అభిప్రాయం చెప్పాడు.

"మా ఎదురింట్లో వుండవచ్చునతను. దొంగ. నాతోటలోనుంచి కొబ్బరి కాయలు కోసివచ్చి యింట్లోకూడ చేర్చలేదు. నాకు కూడా అతను డబ్బివ్వాలి.

ఎదిరింట్లోను, అక్కడుండే అంగిడిలోను అతను కనబడలేదు. 'పోనీ దొంగ" అని లోలోపల తిట్టుకొని వంగతోటలోకి వెళ్లాడు శంకరన్ నాయరు.

తోటలో కొంచెం భాగము వేలం వేశాడు. దోసకాయల తీగలు, ముల్లంగి చెట్లు పెరిగి వున్నాయి. రెండు సార్లు కాయలు కోయటం జరిగింది. క్రొత్తవాన కురిసిన తర్వాత నీరు పారించడమవసరములేదు. చందు దగ్గర నుంచి పారతెచ్చి క్రొత్త కాలువలను తవ్వాడు. అక్కడ నుంచి పాదులవరకు కాలువ త్రవ్వాడు.

నీరు పారింది. గుంటలో దిగి స్నానం చేశాడు. అప్పుడు శంకరన్ నాయరు వాప్పు అంగడి ఎదురుగా ఏదో శబ్దము వినపడింది. చేపలు వచ్చాయి. దగ్గర కెళ్లిచూస్తే "నెత్తాల చేపలు." అయినా చేపలు కొంచెం కొనాలి. పది పైసలకు తీసుకున్నాడు.

తిరిగి పోదామనుకున్నప్పుడు అంగడి ప్రక్కనుండి "అచ్చమ్మాను పిలిచాడు. వెళ్లకపోతే ఆ ముసలాయన కోపిస్తాడు. వెళితే కాలం వృధాచేయవలసి వుంది.

ఆ ప్రాంతంలో అందరికీ తెలిసినవాడు అచ్చమ్మాన్. అతనికి యిల్లు కూడా వున్నది. అయితే రోడ్డుమీద అంగడి మూలలో వున్న గదిలోనే అతను నివసించేది. రామాయణం చదవటం ఊరు వ్యవహారాలు, ఎవరైనా దొరికిన యెడల పెండ్లి పేరంటాలు, వేదాంత విషయాలు మాట్లాడటం అతని నిత్య వ్యాపకం.

శంకరన్ నాయరు యింటికి తిరిగి వచ్చేసరికి సాయంకాలమైనది.

కొండ మధ్య సూర్యకాంతి అస్తమిస్తున్నప్పుడు కొబ్బరి తోటల్లో చీకటి అలుముకుంటుంది. ఎర్రని మట్టిగోడగల తన యింట్లో దీపాన్ని వెలిగించిన తర్వాత అతను వంటపని ప్రారంభించాడు. అన్నం వండటం కాయకూరలు చేయటం అతనికి తెలుసు. కొన్నేళ్లగా అతను ఒంటరిగానే వుంటున్నాడు. అయితే ఇప్పుడతనికి అన్నం వార్చుటకు మాత్రమే భయం. ఒక్కో రోజు అన్నం వండేటప్పుడు గంజి వార్చటం అతనికి అలవాటే. గంజి పొంగినప్పుడు ఒక చిన్న కొబ్బరిమూత పెట్టి వార్చేవాడు.

పధ్నాలుగు, పదిహేను ఏళ్ళయ్యాయి అతను ఒంటరి జీవితాన్ని ప్రారంభించి. చిన్నతనములో బావ పెద్దక్క వుండేవారు. ఇద్దరూ ఎప్పుడో ఈ లోకం విడిచిపోయారు.

పొయ్యిలో లేచిన మంటను చూస్తూ అతను కూర్చున్నాడు. అన్నం ఉడికి నీళ్ళు పొంగాయి.

తన కాలమంతా యింట్లో పనులు చూసుకుంటూ గడిపేవాడు. ఇంత కష్టపడతావెందుకు?ఎవరికోసం? అని అడిగేవారు అందరూ. మరి యెందుకు పనికి పోవాలని అడిగేవారందరూ. అదిసరే కూరగాయల చెట్లు నాటి నేంద్ర అరటిచెట్లు పెట్టి డబ్బు సంపాదించి ఏం చేయాలని? వివాహం యెందుకు చేసుకోలేదు?

నలభై రెండేళ్లు పైబడ్డాయి. ఇప్పుడిహ పెళ్ళాం పిల్లలు లేకుండానే జరిగి పోగలదు. రెండవ పెండ్లి పిల్లను పెళ్లిచేసుకోవాలని అనేవాడతను.

కాని, సోలి పడిపోతే ఆధారపడడానికి ఎవరైనా తోడుండాలిగదా? పని పాట్లు చేసేందుకు వీల్లేని వయసులో తన స్థితిఏమిటి? ఇంట్లో గుడిసెలోవున్న అవ్వ జ్ఞాపకం వచ్చింది. ఆమె ఎన్ని ఇళ్లు ఎక్కి దిగవలసివచ్చింది....దాన్ని తలచుకుంటేనే భయమేస్తుంది. అదికూడా నడచుటకు శక్తి వున్నప్పుడే గదా? అట్టి శక్తి కృంగినప్పుడు - బూడిదలో పడివుండే కుక్కమాదిరి. తలచుకుంటే శరీరం గగుర్పొడిచింది.

వివాహాన్ని గురించి ఆలోచించిన రోజులున్నాయి. ఒక స్త్రీని తన మనస్సులో నిలుపుకున్నాడు. ఆ రోజులు పోయాయి. అప్పుడు మామయ్యా అక్కా వున్నారు. మామ వివాహ ప్రసక్తి తెచ్చాడు. తను అంగీకరించాడు కూడా.

అయితే, భగవంతుని లీల. వివాహం జరగలేదు.

"ఎందుకోసం భగవంతుని నిందించాలి....తన తలరాత బాగాలేదు. దురదృష్టవంతుడు తను. తాను చూసిన పెళ్లికూతురు అందంగా ఆరోగ్యంగా వుంది. సాయంకాలం చూశాడామెని. మర్నాటి ఉదయం ఆమె మరణించిందనే వార్త తెలిసింది. నాలుగు సార్లు వాంతి చేసుకుని కన్నుమూసింది.

ఆ తర్వాత అనేకమంది స్నేహితులు, బంధువులు మరణించారు. కుటుంబములో తానేకాకి అయిపోయాడు. జీవితం ఎలాగో అలాగ గడిచిపోసాగింది. క్రమంగా దుఃఖంకూడా పూర్తిగా అతను మరిచిపోసాగాడు.

పొయిలో ఎర్రని అగ్ని నాలుకలు చాపి మసిపాత్రని అంటుతున్న దృశ్యాన్ని చూస్తున్నాడతను. నీళ్ళు క్రిందపొంగి కారుతున్నప్పుడే అతనికి తెలిసివచ్చింది. నీరు పొంగింది. నురగలు తగ్గాయి.

అన్నం తిని బైట అరుగుమీద చాపవేసి పడుకొన్నప్పుడే మర్నాడు తాను చేయవలసిన పని తలపుకొచ్చింది. బడి వరకు పోయి రావాలి. అప్పు

ణిని బడిలో చేర్చాలి. తనకు వివాహమైవుంటే అప్పుణిలాంటి కొడుకు ఒకడు వుండేవాడు. అనవసర శ్రమకులోనై కూరకాయల తోటలో పనిచేసి సంపాదించటం కంటే, రెండక్షరములు చదివి బాగుపడాలి ఆ పిల్లాడు.

గడచిపోయిన దానిని గురించి తలచి ఏమి ప్రయోజనం?

అప్పుణి బాగుండాలి. ఆ చిన్నవాని ముఖంలో ఒక లక్ష్మీకళ వుంది.

"అమ్మా, భగవతీ, కరుణించుతల్లీ!"

అతను అవ్యక్తమైన దృశ్యములను తలచుకొని మళ్ళీ చింతిస్తూ నిద్ర రాక పడుకున్నాడు.

*   *   *   *

హైస్కూలులో చేరినరోజు అప్పుణికి ఒకమహోన్నతమైన ఉత్సాహం కలిగింది.

శంకరన్ నాయరు అనుకున్న సమయానికంటె ముందుగా వచ్చాడు. అంతకు క్రితమే తను సిద్ధముగా వున్నాడు. బడి ఫీజుకైన డబ్బుని శంకరన్ నాయరు చేతిలోపెట్టింది తల్లి. అతను యిల్లు విడిచి పోయేటప్పుడు అమ్మ, సందు మలుపు వరకు నీళ్ళు నిండిన కళ్లతో చూస్తూనిలబడింది. హైస్కూలు అయిదు మైళ్ళ దూరములో వుంది. కానీ అతను వెళుతుంటే అమ్మకి చాలా బాధగా వుండేది.

ఉత్తరాది వారింటి గుమ్మం ద్వారానే తను స్కూలుకి పోవలసి వుంది. దారిలో పెద్దయింటి గడపమెట్లు దగ్గరకొచ్చినప్పుడు లోపలకి తొంగి చూడాలనిపించింది. కానీ అతనట్లా చూడలేదు.

బడి చాలపెద్దది. అతను మునుపు చదివిన బడిలో ఆఫీసుకు మాత్రమే పెంకులు వేశారు. ఈ బడిలో పెద్ద పెద్ద పెంకుల కట్టడములు నాలుగున్నాయి. గేటుపై అర్ధ చంద్రాకారములో నున్న బోర్డుపై పెద్ద అక్షరములలో ఆ బడి పేరు వ్రాసివుంది.లోపలికి పోవుదారిలో పెద్ద పూలతోట వున్నది.మనమక్కావు గ్రామంలోను పువ్వులతోట వుండేది. అయితే, పుష్పిస్తున్న చెట్లొకటైనా లేదు. పిల్లలు బెండచెట్లు, వంగచెట్లు మాత్రమే పెంచారు. కాయలు కాస్తే బడి పంతులవారు కాయితాల్లో పొట్లము కట్టుకొని వాటిని యింటికి తీసుకొనిపోయే వారు. తోటపని చేయడానికని ఒక పీరియడుకూడ వుంది.

ఇంకా గంట కొట్టలేదు.

రోడ్డుమీదా, గేటువద్ద వరండాలో ఎందరో తమ పిల్లలను బడిలో చేర్చుటకోసం వచ్చి నిలుచుని వున్నారు. అప్పుణి లాగా కొందరు వచ్చారు. వారితో గార్డియన్లు వచ్చారు.

అతను పూర్వం చదివిన బడిలోని పిల్లలుకూడ అక్కడికి వచ్చారు.

ఆఫీసుగది ప్రక్క మిగతా పిల్లలతో వీళ్ళిద్దరూ కాచుకుని వున్నారు. తన పేరుని కిటికి ప్రక్కనున్న క్లార్కుకి వ్రాసి యిచ్చాడు. వాళ్లని ఒక్కొక్కరుగా లోపలికి పిలిచారు.

హెడ్మాస్టరు గదిలోకి వెళ్లినప్పుడు అప్పుణి ఆశ్చర్యపడిపోయాడు. నీలపుగుడ్డతో కప్పిన పెద్దబల్ల. ఇనుప బీరువాలు. గోడకి పెద్ద పెద్ద పటాలు. బల్లపైన కాలింగుబెల్లు. కాయితాలను గాలిలో ఎగిరిపోకుండా పెట్టటానికి ఒరువైన పేపరువెయిటు. కుర్చీలో ముడతలుపడిన శరీరముతో ఒక అజానుబాహుమనిషి కూర్చునివున్నాడు. అతనే హెడ్మాస్టరు.

"సర్టిఫికేటుని చూశాడు.

"పేరు, వయస్సు, మార్కుల వివరాలు అందులోవున్నాయి.

హెడ్మాస్టరు అడిగాడు.

"తండ్రి పేరు?

"టి. కోంతుణ్ణి నాయర్." తప్పురాకూడదని పూర్తి పేరు చెప్పాడు.

"తండ్రి ఇప్పుడు లేడు."

"సంరక్షకుని పేరు."

హెడ్మాస్టరు శంకరన్ నాయరు ముఖాన్ని నిదానించి చూశాడు.

శంకరన్ నాయర్ ఆలోచించాడు. ఎవరు అప్పుణికి సంరక్షకులు?

ఆడదైతే చాలునా? పురుషులేవుండాలని అంటే? భావిలో ఏ గొడవ రాకూడదనే జాగ్రత్తతో.

"టెంకాయతోట శంకరన్ నాయర్" అన్నాడు.

విలాసము చెప్పాడు.

అప్పుడు అప్పుణి అతన్ని చూశాడు.

ఆ చూపుని అతను నిర్లక్ష్యం చేశాడు.

కిటికీదగ్గిరకెళ్లి హైస్కూలు ఫీజు చెల్లించాడు. రశీదు తెచ్చుకున్నాడు. రేపటినుంచి పాఠాలు ప్రారంభమవుతాయి. ఇప్పుడిహ ఇంటికి వెళ్లవచ్చును.

వాళ్లు నెమ్మదిగా తిరిగివచ్చారు. కానీ అప్పుణి మనస్సులో ఒక సందేహం కలిగింది. శంకరన్ నాయర్ ఎలా తనకి సంరక్షకుడవగలడు?

క్రొత్త స్నేహితులుచేరిన బడి సంతృప్తికరంగానే తోచింది.

నిత్యం ఉదయము సాయంత్రము ఉత్తరాది వారింటి దారిగుండానే అతను పోవలసివుంది. పెద్ద గడపవద్దకు వచ్చినప్పుడు ఒక్కసారి లోపలకు చూశాడు. ఆ ప్రక్కనే వక్కచెట్లతోట, దాని మధ్యలోనున్న ఇల్లు పూర్తిగా కనబడదు. గడపవద్ద ఎవరూ కనబడలేదు. సాయంకాలం తిరిగి వచ్చేటప్పుడు వాకిట్లో చెప్పులువేసుకొని నడుస్తున్నాడు పెద్దమామ. అతని తల చూస్తే ఆకాశానికి అంటినట్లువుంది. చిన్నవాడైనా అప్పుణి మనస్సులో ఏదో ఉద్వేగం కలిగింది. అతడితన్ని గమనించలేదు. ఎందరో పిల్లలాదారిలో పోతున్నారు.

పంటలు పండి కోతలు ముగిసిన కాలమది. ఉత్తరబాట ఇంటి ప్రక్కనే పోవుదారి ఒకటుంది. ఆ దారిలో ప్రక్కనున్న చెరువు దగ్గిర పువ్వుల తోటవైపు వెళితే త్వరగా రోడ్డుచేరవచ్చును. కాని అతను ఆ దారంట పోవ ఇష్టపడలేదు.

ఉత్తరాదివారింటినుండి యిద్దరు పిల్లలు బడికి వస్తున్నారు. తన తరగతిలోనే రెండవ విభాగములో భాస్కరుడు, ఏడవ తరగతిలో కృష్ణకుట్టి చదువుతున్నారు.

డ్రిల్‌క్లాసు, ఏ, బి. రెండూ కలిపి నడుపుతారు. డ్రిల్‌క్లాసులోనే అతను భాస్కర్ని మొదట్లోచూసింది. చిన్నశంకరన్ చెప్పినప్పుడే తనకు జ్ఞప్తికి వచ్చింది. భాస్కరునితో మాట్లాడాలా? కాని డ్రిల్‌క్లాసులోనైన సరే నీళ్లు త్రాగేందుకు పైపువద్దకు వెళ్లినప్పుడైనాసరే బాస్కరన్‌తో మాటలు కలపలేదు. భాస్కరునికి తనెవరో తెలుసును. భాస్కరుడే కుట్టిశంకరన్‌తో ఆ మాట అన్నాడు. భాస్కరన్ పదవ తరగతిలో రెండవ సంవత్సరం చదువుతున్నాడు. భాస్కరుడు, కృష్ణ కుట్టి బడికి ఎద్దుబండిలో వచ్చేవారు. రంగు పూసిన కొమ్ముల కొనలో నీలపు కుచ్చులు మెడలో తోలుపట్టిలో గుచ్చిన చిన్ని గంటలహారము తెల్లయెద్దులబండి అది. ఆ లోపల కూర్చోవడానికి చాపవేశారు. దూరంనుండి బండి వచ్చేశబ్దం వినబడేది. బండి ఎవర్దో ఒక మాప్లవారిది. నెలకి బండి బాడుగయిచ్చేవారు.

వాళ్ళు రావటం పోవటం చూసి ఈర్ష్యచెందేవాడు అప్పుణి.

కొన్ని రోజుల తర్వాత, ఆ తరగతిలో అనేక మంది పిల్లలకి వారి ద్దరంటే ఈర్ష్య కలగనారంభించింది. స్కూలుకు బండిలో వచ్చేవారు వాళ్ళి ద్దరు మాత్రమే.

ధృఢకాయుడు భాస్కరుడు. తానొక పెద్ద మనిషియను భావము అతని నడతలోను మాటల్లోను ప్రస్ఫుటించేది.

నాలుగు గంట్లకు బడి విడవగానే గేటువద్ద ఆయెద్దుల బండి సిద్ధంగా వుండేది. పచ్చని తలపాగ కట్టుకొన్న నల్లని మనిషి ఒకతను ఆ బండితోలే వాడు. భాస్కరన్ మెట్లుదిగి క్రిందకు వెళ్ళి, పుస్తకములను బండిలో పెట్టి కూర్చున్నాడు. కృష్ణ కుట్టి ఎక్కిన తర్వాత అతను ప్రక్కన కాలు పెట్టి కూర్చు న్నాడు. రోడ్డుమీద అసూయతో నిండిన పిల్లల కళ్ళు తనవైపే చూస్తూండటం అతనెరుగును.

అప్పుణి స్నేహితుడు మహమ్మదు. క్రొత్తమిట్టలో చిన్నాయింట్లో వుంటు న్నాడు. అతను అడ్డదారిగావచ్చి యజశాలగుడి వద్దనున్న దారి కాచుకుండే వాడు. మహమ్మదుకి నిత్యం ఆ వొంటెద్దుబండి గురించిన పొగడ్తలే. చదువు పూర్తయాక డబ్బు సంపాదించి తనూ ఒక మంచి ఒంటెద్దు బండి కొంటానని అనేవాడు.

బండిలో వచ్చే భాస్కరుడు, మనఅప్పుణి ఇద్దరూ ఒక యింటివారే అని మహమ్మదుతో ఎవరో చెప్పారు.

ఈ విషయం క్లాసులో కొంతమందికి తెలిసింది. ఈ విషయం భాస్కరు డికి తెలిసినప్పుడు గొడవలు ప్రారంభమయ్యాయి

భాస్కరునికి కొందరు స్నేహితులున్నారు. కరుణాకరన్, రంగనాథన్, వారి పేర్లు. వారు అప్పుడప్పుడు అతనితో సేస్తం చేయటానికి కారణం ఎప్పు డైనా భాస్కరుని దయవల్ల బండి ఎక్కపోవచ్చుననే ఆశతోనే.

కరుణాకరన్ భాస్కరునితో ఏదో చెప్పాడు. అది విని భాస్కరుడు ఫక్కున నవ్వాడు. అంతే, "హూం! మాయింట్లో! పోయిన సంవత్సరం మా యింట్లో జరిగిన తుళ్ళలాట చూడడానికి వచ్చినప్పుడు ఏం జరిగిందో అడిగి చూడతనిని?"

"ఏమయింది? కొందరికది తెలియాలి". "ఏం జరిగింది?" ఇలాఅడిగి నప్పుడు అప్పుణి ఏడవసాగాడు.

భాస్కరుడే కొందరికి చెప్పాడు. అతన్ని మాయింటి గడపకూడ ఎక్క నివ్వము, పెద్దమామ అతన్ని తరిమి వేశాడు. అతను కాలుపెట్టిన స్థలంలో పచ్చిక కూడ మొలవదు.

అప్పుణ్ణి నిశ్శబ్దంగా అంతావిన్నాడు భాస్కరన్, కాదు భాస్కరన్న అని పిలవాలి. అతన్ని అన్నయ్యా అని పిలిచే అవకాశం ఈ జన్మలో లేదు.

అతను పెదమ్మ కొడుకు. అతని తండ్రి నంబూదిరి. అతని అమ్మకు స్వంతంగా యిల్లూ భూములున్నాయి. అక్కడ పనివాళ్ళుకూడ వున్నారు.....

మిగతా పిల్లలకి దూరంగా వుండటం మొదలు పెట్టాడు అప్పుణ్ణి. తను పనిగత్తె కొడుకు. ఏమీ లేనిది అతని తల్లి. పెద్దయిల్లు లేదు. డబ్బులేదు. రెండు జతల బట్టలు మాత్రమే అతనికున్నవి. దానినే మార్చి మార్చి వేసు కుంటున్నాడు. కావలసినన్ని పుస్తకాలు లేవు. లెక్కలు వేసుకోవటానికి పెద్ద బైండునోట్సుకూడ లేదు.

మధ్యాహ్నం మారార్ హెూటల్లో భాస్కరుడు అన్నం తినేవాడు.

అప్పుణ్ణి ఉదయమే గంజిత్రాగి బడికి వచ్చేవాడు. బడి ప్రక్కనున్న మారన్ హెూటల్ బక్ష్యాల వాసన ఘుమఘుమలాడేది. ఒంటి గంటకు బడి విడిచిన తర్వాత నీళ్లు త్రాగేందుకు హెూటల్లో తోట ప్రక్కకు వెళ్లినప్పుడు వంటగదిలో వరుసగా వేసిన ఆకులు చూసేవాడు.

అమ్మకు జీతం వచ్చిన రోజు అన్నపాత్ర ఒకటి తెచ్చేందుకు బయలు దేరింది. కానీ, ఆపాత్ర కంటే ముఖ్యంగా ఒక మంచి షర్టు, ధోవతి కావాలని పించిందతనికి. ఉన్న రెండు షర్టుల్లో ఒకటి చినిగి పీలికలై పోయింది.

ఒకరోజు సాయంకాలం బడిలో "ఓట్టుతుళ్లల్" జరపడానికి నిశ్చ యించారు. అందరూ చెరో పదిపైసలు ఇవ్వాలని మొదటిరోజే చెప్పారు. అయితే అతని దగ్గిర డబ్బులేదు. అమ్మ ఎందరినో అడిగి చూసింది. డబ్బు దొరకలేదు. అమీనమ్మ వద్ద డబ్బుంది. అడిగితే దొరుకుతుందనిపించింది.

ముందు రోజు సాయంకాల పీరియడులో పంతులు డబ్బు అడిగాడు. నలుగురు పిల్లలు డబ్బివ్వలేదు. అందులో అప్పుణ్ణి ఒకడు.

"మధ్యాహ్నం తీసుకురావాలి" ఆ తరగతి పంతులు ముక్కు అదిరించి వేగంగా నాలుగైదుసార్లు కళ్లు అర్పి చెప్పినప్పుడు అతను తన పుస్తకాలు తీసుకుని బయటకెళ్లిపోయాడు.

---

మళయాళీలలో ఒక జాతి.

ఎవరో అడిగారు.

"ఎందుకురా పుస్తకాలు? వెళ్లిపోతున్నావా?"

"అవును."

"ఎక్కడికి?"

"ఒళ్లు బాగుండలేదు. తలనొప్పిగావుంది. అతను మహమ్మదుకి కూడ చెప్పకుండా తిన్నగా బయటికి వెళ్లిపోయాడు.

మధ్యాహ్నం నంబీసన్ మాష్టారు డబ్బు అడిగినప్పుడు బేల చూపు చూడాలి. తరగతిలోని పిల్లలందురూ హేళణచేస్తారు. దానిని సహించలేడు తను.

తీక్షణమైన మధ్యాహ్నపు ఎండ. వట్టిమైదానంలో నడుస్తున్నప్పుడు మట్టివేడి నిప్పులాగా కాలిపోతూంది. పంటనేలల ప్రక్కగా దిగి నడిస్తే ఎండ వేడి అంతగా తెలియటం లేదు. కాస్త నీడగా ఉంటుంది. అతను ఆ దారిలో నడువసాగాడు.

ఉత్తరాది వారింటి కంచె ప్రక్కన పోతున్నప్పుడు ఆ తోటలో ఎవరో వున్నట్లు అనిపించింది. ఇంతలో గొంతు వినపడింది.

"అప్పుణి అన్నయ్యా"

అతను అగాడు మాళు పిలిచింది. అమె వక్కతోటలో నున్న తమల పాకుతీగ దగ్గిర అకులు గిల్లుతోంది.

"బడి తొందరగా విడిచి పెట్టారా?"

ఆమె అతని దగ్గరకు వస్తున్నదని అనుమానం కలిగిండి. అతను తలను మాత్రం ఆడించాడు.

"బావి గట్టుదగ్గర కెళ్ళినప్పుడు నువ్వు పోవటం చూసి భాస్కరన్న పెద్దమ్మతో చెప్పాడు. అది వినియే నేను తెలుసుకొన్నాను".

దీనికి అతను సమాధానం చెప్పలేదు.

"అవ్వ నీగురించి రోజూ చెబుతుండేది. నువ్వు ఈదారిలో వెళ్ళినప్పుడు నిన్ను చూడాలని అనేది."

--ఒక్కరోజైనా చూడలేదా? అక్కడ ఆట జరిగిన తర్వాత అందరూనన్ను చూస్తూ నిలుచున్నారు కదా? ఏయ్ పిల్లా! నాకు ఇంకేం చెప్పొద్దు.

"పెద అత్తను నాయనను కూడా...."

ఆమె చటుక్కున మౌనం వహించింది.

"ఎవరితోనే మాళు మాట్లాడేవు?"

వక్కచెట్ల మధ్య ఒకామె వచ్చింది. తనదారిన తాను వెళ్ళిపోదామని అప్పుణి అనుకున్నాడు. కాని, ఆమె ఎవరో చూసిపోదామని ఆగాడు.

అమ్మణి నిలుచున్నది.

సర్పము దగ్గర నాట్యం చేస్తూ నిలుచున్న రాజకుమారి........అతను ఆశ్చర్యముతో చూశాడు, పుష్పాలంకరణతో పాములాగా, ఆటలాడిన ఆ స్త్రీ సౌందర్య రూపం ఒక స్వప్నములాగ అతని మనసులో మెదిలింది. ఇప్పుడు నీలం పట్టు జాకెట్టు వేసుకొని వున్నదామె. జరీ అంచుగల తెల్లని పట్టు బట్ట కట్టుకుంది. ముఖానికి నల్లనిబొట్టు, కాటుకపూసుకున్న అర్ధనిమీలితనేత్రాలు.

"ఇదెవ్వరు, అప్పుణీయా?"

ఓ పేరు జ్ఞాపకం వచ్చింది.

అతని సూటి చూపులు గమనించిన అమ్మణి అడిగింది. "ఏమిటలా చూస్తున్నావు? నే నెవరో తెలియదూ?"

అప్పుడే అతను ఈ లోకంలోకి వచ్చాడు. తెలుసు, తెలుసు నన్ను పట్టి మేకలాగా పారతరిమిన పెద్దమామ కూతురు! వానికంటే మూడేండ్లు పెద్ద దైనందున అమ్మణి అక్క అయింది.

గట్టు పైగా ఒక కాలు పెట్టి, నవ్వుతూ "అప్పుణికి తెలియక పోయినా నాకు తెలుసు" అన్నది, ఆమె చేతిలో నుంచి జారిన వక్క ఒకటి క్రింద పడింది. ఆమె వంగి దానిని చేతిలోకి తీసుకుంది. అప్పుడు కుచ్చులు కట్టిన కేశ పాశము పక్కగా పడింది.

"లేత తములపాకుంటే మాళు, ఒకటి నాకివ్వు. ముగ్గురం మాట్లాడు కుందాం."

"నేను వెళతాను"

అప్పుణి ఎవరివైపు చూడక నడవసాగాడు

"ఇదిగో చూడు అప్పుణీ"

అతను తిరిగి చూడకుండా నడిచాడు. ఆ వేళకు అమ్మ ఇంట్లో ఉండదని తలిచాడు. అయితే, అమ్మ మాత్రమేకాదు, ఇంటి అరుగు పైన శంకరన్

నాయరుకూడ ఉన్నాడు. అతను మెల్లిగా ఇంటి గడపలో కాలుపెట్టి లోపల కెళ్ళాడు. అప్పుడు అమ్మ వాకిట్లో నుంచి లోపలికి వచ్చింది.

"ఏమటి అప్పుణీ, తొందరగా వచ్చావు?"

అతనికేదో చిరాకుగా వుంది. ఎవరికి చెప్పలేనటువంటిదది. "అవున" ని మాత్రమే తల్లికి సమాధానమిచ్చాడు.

"ఎందుకూ ?"

"ఏమీలేదమ్మా?"

పుస్తకాల సంచిని ఒక మూల పారవేశాడు. కొంచం గట్టిగానే "గంజి వున్నదా?" అనడిగాడు.

అతని ప్రవర్తన అమ్మకేదో ఒక విధముగా అనిపించింది. అతను ఇంతకు ముందెప్పుడూ ఇలా మాట్లాడింది లేదు. పారుకుట్టి గంజిని గిన్నిలో పోసి పీటఎత్తి వేయబోతుండగా అతను వెళ్ళి కూర్చున్నాడు.

"ధోవతి మాసిపోతుంది కొంచం లే, ఈ పీట వేస్తాను."

ఒక్క గుక్క గంజి లోపలకి వెళ్ళిన తర్వాత అకారణకోపం తగ్గింది.

"పీట ఏమీ వద్దు."

అతను శాంతంగా చెప్పాడు.

అమ్మ అలా బైటికి వెళ్ళింది.

శంకరన్ నాయరు గొంతు వినిపించింది

"ఏమిటి! అప్పుణికి శలవా?"

"తెలీదు. నేనూ అదే ఆలోచిస్తున్నాను. బహుశః ఆకలి వేసి వుంటుంది.

"మిగతాపని నేను చూసుకుంటాను. ఎక్కువ డబ్బు కట్టనవసరంలేదు."

జీతం గురించి మాటలు జరుగుతున్నాయి. జీతం కట్టడానికి అమ్మ శంకరన్ నాయరును డబ్బు అడిగి ఉండవచ్చును.

"మంచిదండి. మీ ఉపకారానికి కృతజ్ఞురాల్ని శంకరన్ నాయరుగారు."

"నా వల్లనైనంత సహాయం ఎల్లప్పుడు చేస్తాను పారుకుట్టమ్మగారు."

శంకరన్ నాయర్ వెళ్లిన తర్వాత పారుకుట్టి లోపలికి వచ్చింది. అప్పుణి చేతులు కడుక్కొన్నాడు.

"ఏమిరా, అప్పుణీ, త్వరగా వచ్చేశావు?"

"ఏమిలేదమ్మా అటని త్వరగా వెళ్ళవచ్చునన్నారు."

అతను నడవలోకి వచ్చాడు. అమ్మని పనికి పోలేదేమని అడగాలని పించింది. కానీ అలా అడగలేదు. అలాగా ఒకయిల్లున్నదని, అక్కడ అమ్మ పనిగత్తెగావుందని మరచిపోవాలి. అక్కడ వుండే రోలు, రోకలి, వాకిట్లో అతని తల్లి పనిచేయటం అన్నీ మరచిపోవాలి. బ్రతికేందుకు దారి లేని పనిగత్తె కొడుకు తను. దానిని సహించలేకపోయాడు. అప్పుణి కోంతుణ్ణి నాయరు కొడుకు. మణ్ణాన్ మంత్రవాదితో మండపములో ఆ ప్రాంతం వారందరి ముందు గెలిచిన కోంతుణ్ణి నాయరు. ముత్తళకొండలో గొడవలు జరిగినప్పుడు వారందరి మధ్య ఆరుమందిని చెదర కొట్టిన కోంతుణ్ణి నాయర్.....

ముత్తాచి తోటలోవున్న ఇల్లూ వాకిలీ చేరచివుంది. ముత్తాచిని చూసి చాల రోజులయిందనిపించింది. గడప లోపల కూర్చుని చేటలో బియ్యాన్ని పెట్టుకొని రాళ్ళు ఏరుతోంది ముత్తాచి.

"ఎవరది?"

"నేనే ముత్తాచీ "

"కొంచం ఈ రాళ్లను ఏరియివ్వబ్బాయి. కళ్ళూ పళ్ళూ లేనిదాన్ని."

అతను పిడికడు బియ్యంతీసి నేలపైపోసి చిన్న రాళ్ళన్నీ ఏరి వాకిట్లో పారవేశాడు.

ముత్తాచి పంచాయతులు వినడానికి ఆసక్తిగా లేదతనికి. ఉదయం తొందరగా బడికి పోవాలి. సాయంకాలము చీకటి పడుతుంది తిరిగి వచ్చే సరికి. శనివారం, ఆదివారం ఖాళీగావున్నప్పుడు కొన్ని సమయాలలో ముత్తాచి ఇంట్లో గడిపేవాడు.

"అక్కడ ఎవరురా వచ్చిపోయింది, అప్పుణీ?

"అది శంకరన్ నాయరు."

"ఏమిటి విశేషం "

"నాకు తెలీదు. నేనిప్పుడే వచ్చాను."

"టెంకాయతోట శంకరన్ నాయరు మంచివాడే."

ముత్తాచి అతన్ని గురించి అభిప్రాయం వెలిబుచ్చింది. కాని దానితో ఆగలేదు.

"ఉంటేకూడా.....

"ఏమిటి ముత్తాచ్చవ్వ?"

"ఏమి లేదబ్బాయి"
రాళ్ళేరడం అయింది బయటకు వెళ్ళినప్పుడు ముత్తాచి అన్నది.
"నలుగురూ ఏమీ అనటానికి అవకాశం ఇవ్వకూడదు.
''జనం చెప్పుకుంటున్నారు?"
ఒంగి ఒక రాయినెత్తి తోట ప్రక్కన పారవేశాడు కోపంతో అప్పుణి.

# మూడు

ఉత్తరాది వారింటి పనంతా మినాక్షిదే. మీనాక్షమ్మకు సహాయం చేయటం మాళుపని. నాన్నమ్మ రెండో కూతురు మీనాక్షత్త.

పెద్దమ్మలాంటిది కాదావిడ. మాళుకు ఎక్కువ పని ఏదీ యిచ్చేదికాదు. అన్నీ తానే చేసుకునేది. మాళుకు ఆమె అంటే చాల అభిమానం. ఆమెకు బిడ్డలు లేరు. అసలు పిల్లలు కలగలేదామెకు. మీనాక్షి భర్త అచ్యుతన్ నాయర్. మాళు అతన్ని చిన్నాన్న అని పిలేచేది. కానీ, నిజానికి ఆమె అలాగ పిలవటం రివాజు కాదు.

మినాక్షమ్మంటూ ఒకామె ఆ యింట్లో ఉన్నట్లు ఎవరూ గర్తించలేదు. తెల్లహారక ముందే స్నానంచేసి, వంటగదిలోకి వెళ్ళితే, రాత్రి అందరూ భోజనము ముగించిన తర్వాత మిగిలిన అన్నం తిని, పొయ్యి, వంటిల్లు కడిగి ఆమె పడుకునేది. పెద్దమామ సాయంకాలం వరకు బయటతిరిగి వచ్చేవాడు. బయట పొలాలు, ఇతర తోటలకు వెళ్ళి చూసివచ్చిన తర్వాతనే పడుకునేవాడు. పెద్దమామ యింటికొచ్చారంటే ఆరోజు సాయంకాలం మినాక్షమ్మకు పనిఎక్కువయిపోయేది. అన్నం, కూరలు, ఊరగాయలు ఊరపిండి మొదలైనవి తయారు చేసి, అతనికి వంటగదిలో పీటవేసి పెట్టేది. ఎంత ఆలస్యమైనా పెద్దమామ భోంచేసిన తర్వాతనే పిల్లలందరూ భోంచేయటం. పెద్దమామ కొంతప్పుడు

నూనె రాసుకునేవాడు. ఒళ్ళంతా కారేట్లు నూనె రాసుకుని, యింట్లో అటూ యిటూ తిరగటం అతనికి అలవాటు బావిగట్టు దగ్గిర రెండు తప్పేలాల నిండా నీళ్లు పెట్టి తీరాలి. పెద్ద బిందెలో వేన్నీళ్లు తోటబావి దగ్గిరకు తీసుకుని పోయి పెట్టాలి. స్నానం చేసివచ్చిన వెంటనే పూజగదిలో దీపస్తంభాన్ని వెలిగించి, చాపపరచి పెట్టి, విభూతి బుట్టని అక్కడపెట్టి వుంచాలి. ఈ పనులన్నీ అమ్మణ్ణి చేసేది. అతను స్నానం అయిన తర్వాత ఒళ్లు తుడుచుకొని వేరు వస్త్రాలు వేసుకురావటానికి, ఉగ్రాణి గదికి వెళ్ళాలంటే మళ్ళీ రావడానికి చాలసేపవుతుంది. విభూతి ధరించి భోజనగదికి వెళ్ళినప్పుడే, వంటగదిలోనికి చేపలు వేయించో లేక, కోడిగుడ్లు పొల్లించో పళ్ళాలలో తిసుకొని వెళ్లి భోజనం గదిలో పెట్టేవాడు. ఇలాటి భోజనం చేపల వేపుడు, గుడ్ల పొల్లింపు ఆయింటి వారందరికి పెట్టేవారు కాదు. పెద్దమామకు మాత్రమే యివన్నీ పెట్టేవారు. భోజనంచేసి తిరిగి వచ్చేటప్పుడు పిల్లలందరూ ఉత్తర పార్శ్వపుగదిలో ఓమూల నక్కి వుండేవారు. పెద్దమామ ఆ దారిగా పోయేటప్పుడు గంధం వాసన ఘుమఘుమలాడేది.

ధాన్య గిడ్డంగినిండా ధాన్యం ఉండేది. పెద్దమామ అన్నం తిని వెళ్ళిన తర్వాత, మాళు తండ్రి, చిన్నాన్న, మగపిల్లలు భోంచేసేవారు. తర్వాతనే ఆడవాళ్ళందరూ భోంచేయడం. అందరికీ అన్నం పెట్టేది మీనాక్షమ్మే. వాస్తవానికి మీనాక్షమ్మ అన్నం తినేవేళకు అందరూ నిద్రపోయేవారు. అది చూసి మాళు పరితపించిపోయేది.

"నువ్వు వెళ్ళిపడుకో అర్ధరాత్రయింది. నీకిది అలవాటైపోయింది."

మాళు గొంతుమెల్లిగా వినబడింది. ఆ యింట్లో అందరిలోకి పెద్ద గొంతు పెద్దమ్మదే. ఆమె మీనాక్షితో అప్పుడప్పుడు కలహించేది. అయినా మీనాక్షమ్మ మౌనంగా వుండేది. పెద్దమ్మ ఏదైనా అడిగితే తాను జవాబు ఇచ్చేది.

''అంతా నాయోగం."

అమ్మమ్మకి మీనాక్షమ్మ గురించి చెప్పేటప్పుడు మనసు కృంగిపోయేది.

"దాని తలవ్రాత బాగాలేదు."

కాని వంటగదిలో ఏదైనా కొంచెం ఆలశ్యమైతే అమ్మమ్మ కోపంతో మండి పడేది.

''ఏమే, ఒసేయ్! అరవైనాళ్ళు మనుష్యులకు అన్నం పెట్టిన అడనాన్నే నేను." అప్పుడప్పుడు ఇది చెబితేనే అమ్మమ్మకు సంతోషం కలిగేది.

చిన్నాన్న వయసులో చిన్నవాడు. ఎవరితోను మాటలాడేవాడు కాదు. భోజనానికి వచ్చేవాడు. అన్నం తిన్న తర్వాత వెళ్ళిపోయేవాడు. రాత్రి నాన్నమ్మ పడకగది ప్రక్కనున్న గదిలోకి వెళ్ళి నిద్రపోయేవాడు. చిన్నాన్న, తన తండ్రి ఒకే మాదిరిగా అనిపించేవారు మాళుకు. ఇద్దరూ నడుస్తున్నప్పుడు, భోజనం చేసేందుకు వస్తున్నప్పుడు చూసి మాళుకి ఒక్కసారి గుండె తరుక్కుపోయేది.

పెదమ్మకు, ఆమె పిల్లలకు ఆయింట్లో అన్ని సౌకర్యాలున్నాయి. చిన్న అత్తకు తండ్రి పరంబత్తునంబూదిరిగారే చనిపోయేముందు ఆవిడ పేరన ఆస్తు లన్నీ వ్రాసి పెట్టి వెళ్ళాడతను. పెద్దమ్మకు ఏక్కడో చాలదూరంగా ఒక యిల్లు, పొలము వున్నాయి. ఈ మధ్య పెద్దమ్మని చూడటానికి వచ్చేది కుంజన్ నాయరుగారే. అతనే ఆయింటి వ్యవహారాలన్నీ చూస్తున్నాడు. ధాన్యాలమ్మి డబ్బు తెచ్చేవాడతను. నాన్నమ్మ అంటూ వుండేది. "వానివల్ల ప్రయోజన మేమి? కోసిన చేతికి సున్నం పెట్టడు."

అమ్మ, పెదమ్మ అప్పుడప్పుడు తమలోతాము పోట్లాట సాగించేవారు.

"నువ్వు నీ బిడ్డలు దరిద్రానికే యిక్కడకు వచ్చి చేరారు." అనేది పెదమ్మ.

ఒకరోజు మధ్యాహ్నం చాల రగడ జరిగింది. గోడపై ఎండవేసిన గుడ్డని కొమ్ము విరిగిన ఆవు ఒకటి నములుతోంది. ఆ పశువు అటువంటిది. గుడ్డలు, వస్త్రాలుంటే తినేది.

దానిని చూసిన పెద్దమ్మ గబగబవెళ్ళి ఆ వస్త్రాన్ని ఆవునోట్లోనుంచి తీసి, ఆ పశువుని ఇష్టమువచ్చినట్లు తిట్టసాగింది. ఆ పశువుకు తెలుస్తుందా? అది వెళ్ళిపోయింది. కాని, యింట్లో గొడవలు చేలరేగాయి.

ఇంట్లో ఒక పిల్లైనా ఉందా? కాస్త వస్తువులు జాగ్రత్తగా చూసేందుకు?"

''గడ్డిమేస్తున్న ఆవుని చూసిందెవరు?"

అమ్మమ్మ అడిగింది.

"చూసినాత్తోలరు, నాబట్ట పాడైతే మీకేమి నష్టము? ఇలాంటి వాటకి మనుషులుండరు. తిండి తినడానికంటే మనుషులుంటారు "

నాన్నమ్మ అది సహించలేక పోయింది.

"పరాయి వారెవరూ ఇక్కడ లేరు."

"అమ్మకు తెలయదు. ఇక్కడ వస్తువులన్నీ దోపిడీ అవుతున్నాయి."

"ఇక్కడ భాగ్యాలు ఇంకా నష్టంపాలయితే నేనూ నా పిల్లలూ వెళ్లిపోతాము."

"ఇక్కడ మిగతా వాళ్లూ వున్నారు."ఇలా ప్రారంభమయింది దెబ్బలాట.

"అమ్మా! నీకు నేనన్నా నాపిల్లలన్నా గిట్టటం లేదు. మనుమరాలంటే మహాగారాబం. నా పిల్లల వంక కళ్లెత్తి కూడా చూడటం లేదు."

నాన్నమ్మ మౌనం వహించింది. జపమాల పట్టుకుని కూర్చుంది. మాళు అక్కడ ఉండడం ఆమెకు యిష్టం లేదు. పైసాకైనా గతిలేక వంటింటిలో బ్రతకడానికి వచ్చినట్లు కదా ఉన్నాడు, ఈ చిన్నాన్న.

దక్షిణ పార్శ్వ గదిలోను, ఉత్తర ప్రక్క గదిలోను మూడు గదులు పెద్దమ్మకూ, ఆమె బిడ్డలకూ కేటాయించబడ్డాయి. మాళు ఎప్పుడైనా ఆ ప్రక్కకి వెళ్లేది. మొదటి గదిలో పట్టు దుప్పటి కప్పిన మంచ మొకటి వుంది. దానిమీదె పెద్దమ్మ, ఆమె కూతురు పండుకుంటారు. మధ్య గదిలో, భాస్కరుడు, కృష్ణ కుట్టీ నిద్రపోతారు. మూడవ గది నిత్యం తాళం వేసి వుండేది. మాళు ఎప్పుడో ఒకసారి ఆ గదిలోకి వెళ్లింది. అందులో రెండు మంచాలున్నాయి. వాటిమీద పరుపులు, గుండ్రమైన బాలీసులున్నయి. చుట్టు తెరలు వ్రేలాడుతున్నాయి. గోడకి పటములు, ఒక పెద్ద నిలువుటద్దము, దాని ప్రక్కన మట్టితో చేసిన రెండు జింక తలలు వున్నాయి. మంచానికి ప్రక్కనున్న బల్లమీద కంచు పాత్రలు, వెండి పాత్రలున్నాయి. మధ్య ఒక గుండ్రపు బల్ల, దానిపై రసగుండులు అలంకరించి వున్నాయి.

ఈ గది పెద్దమ్మది.

"నా కొ౦ః కూతురుంది కదా దానికి రేపు పెళ్ళయి వస్తువులు వస్తే, ఒక గది వుండాలి కదా."

పెద్దమ్మ కూతురు, బంధువులు వస్తే వారికని ప్రత్యేకముగా అట్టే పెట్టారు ఆగది, శయన సామగ్రిలు.

పెద్దమ్మ కూతురు ఐదవ తరగతి వరకు చదివింది. పేరు తంగేదత్తి, పదిహేను సంవత్సరాలు. మాళుకు వచ్చే మాఘమాసానికి పన్నెండేళ్లు నిండుతాయి.

నాన్నమ్మ గదిలోనే మాళు నిద్రపోయేది. మిద్దెకు పోయే మెట్ల ప్రక్కన దక్షిణ వైపుగా ఒక గది వుంది. అందులోనే మాళు తండ్రి నిద్రపోయేవాడు. అందులో పడవ తెడ్డు ఒకటి మూలగా పెట్టి వుండేది. మూలలో చుట్టి పెట్టిన ఒక చాప మాత్రముండేది.

నాన్నమ్మకు ఒక చిన్న మంచం మీదనే పడుకునే అలవాటు. క్రింద చాపపై గుడ్డ పరుచుకొని మాళు పడుకునేది. వర్షకాలం ప్రారంభించినప్పుడు నాన్నమ్మ.

"ఇక్కడకు వచ్చి పడుకో మాళూ? అని పిలిచేది. మంచి వాన కురిసేటప్పుడు, చలిగాలి వీచినప్పుడు ఈ గదిలో వున్న కంబళి కప్పుకొని పడుకుంటే వెచ్చగా వుండేది.

మాళు విషయం ఆమె తండ్రికి ఏం పట్టలేదు. దగ్గరకి పిలిచి మాట్లాడటం ఏదైన కొనివ్వటం చేసేవాడు కాదు.

"చేతుల్లో ఏదైనా ఉండాలిగదా చేసేందుకు!"

పొలము అమ్మేందుకు ముందు వ్యవసాయానికి, పనివాళ్ళుండేవారు. ఇప్పుడు మాళు తండ్రియే ఆపని చూస్తున్నాడు. ఉదయం, తెల్లవారేముందు లేచి బయటికెళ్ళినప్పుడు. ఎక్కడో గుడ్లగూబలు కూస్తాయి. కోడి యింటిపైకెక్కి కూస్తుంది. అది కొండ ప్రక్క నుంచి ప్రతిధ్వనిస్తుంది. అక్కడ చిన్న చిన్న బాటలు, వరుసగా చెట్లు వున్నాయి. అయ్యప్పన్, చొత్తప్పన్, రాము, అయ్యప్పన్ కొడుకు, కనకరాయున్ అందరూ కొండ దిగివస్తారు. అతను తోట ప్రక్కనుండే చెట్లను కొట్టి నీరు పారించి బయటికి వెళ్ళేటప్పుడు తండ్రి కూడా వెళ్ళేవాడు. మళ్ళీ యింటికి రావటం మధ్యాహ్నం ప్రొద్దుపోయిన తర్వాతనే.

గొడ్ల పాకలో నాలుగు జతల ఎద్దులున్నాయి. మూడు ఒంటెద్దులు మాత్రమే పొలం పనికి పోయేవి. మిగతా రెండు అంబోతులు. ఒకటి యెరుపు యింకొకటి మంచి నల్లని యెద్దు. పెద్దమామకు ఎడ్లబండిలో పోవడమంటే చాలా యిష్టం. గడచిన జ్యేష్టమాసము జరిగిన పశువుల సంతలో వాటిని కొన్నాడు. ఎన్నో చోట్లనుంచి సంతకి ఎడ్లువచ్చాయి.

అనకరై, కుమార నల్లూరులో సంత జరిగినప్పుడు పెద్దమామ నిద్రపోయే ముందు, లాంతరు పట్టుకుని పశువులకు గడ్డివేసి. మెడలో పలుపుతాడు సరిగ్గా వున్నదా అని చూసుకునేవాడు. నెలకొక సారి వృత్తాల సంతనుంచి మేక తలలు

తెచ్చేవాడు. వాటిని ఎద్దులకు, పోతులకు ఆహారంగా యిచ్చేవాడు. వారంలో ఒకరోజు నూనెని ఆహారంగా యిచ్చేవాడు. ఎద్దుకిచ్చే నూనె మంచి నువ్వులతో ప్రత్యేకంగా తయారుచేసినది. నూనె నువ్వులు మొదలైనవి అందరి యిళ్లకి ఇచ్చి పంపే వారు. పేదలకు ఇతరులకు ఇవన్నీ ఇచ్చేవారు. నువ్వులు వేయించి బెల్లం కలిపి తినడమంటే నాన్నమ్మకు చాల యిష్టం.

నెలకు రెండు పేశల చొప్పున లెఖ్ఖ. మంగళ వారము, శుక్రవారము తలంటి స్నానం చేయటం అలవాటు. ఆరోజున తలకు నూనె రాసుకుంటారు. లోపల నడిమి ఉట్టిలో ఒక పెద్ద నల్లచొంబులో పెద్దమ్మ ఎప్పుడూ నూనె పోసి పెట్టి వుంచేది.

తండ్రితో ఏదైనా చెప్పాలంటే మాళుకు భయం. చెవికి పెట్టుకునే బంగారు కమ్మలలో ఒకటి వంకరపోయింది. దానిని సరిచేయాలి. తండ్రితో చెప్పమని చిన్నమ్మతో చెప్పింది. కంసాలి కుంజుకు పావలా యివ్వాలి.

"నీవద్ద డబ్బుందికదా? కుంజు ఈ దారిలో పోతే పిలువు. నేను పిలిచి సరిచేసి ఇవ్వమంటాను."

తండ్రివద్ద డబ్బులేదని ఆమెకు తెలుసును. నాన్నమ్మకూ తెలుసును. కాని నాన్నమ్మ అన్నం తిన్న తర్వాత ఇలా అంది.

"కుట్టా, ఒక్కొటొక్కటిగా చేర్చాలి. ఆ పిల్లకు రెండు పైన కప్పుకొనే వస్త్రములు, ఒక పావడ కొనాలి. ఓణం పండుగకైన అమ్మాయి క్రొత్త బట్టలు కట్టుకోవాలి.

"ఇప్పుడు అమ్మాయికి పన్నెండేళ్లు. పిల్లకు సమర్తాడు వయస్సు దగ్గరకు వచ్చింది. సరియైన బట్టలు లేకపోతే నలుగురు నాలుగు రకాలుగా చెప్పుకుంటారు."

తండ్రి ఎవరితోనో చెబుతున్నట్లుగా అన్నాడు.

"నాచేతిలో డబ్బులేదు"

తండ్రి మౌనం వహించాడు.

"ఏమిరా ఊరుకుంటావు?"

"నీకు తెలియదూ? సంవత్సరానికి నాలుగు పెద్ద వస్త్రాలు, రెండు పై గుడ్డలు, రెండు జాకెట్లు నీకు దొరుకుతున్నాయి కదా!"

"అదిసరే. అయితే ఏమంటావు?"

"మరి యెందుకు యిలా అంటున్నావు? ఒక పైసాయైనా నాచేతికి వస్తుందా? ఎద్దులాగా రాత్రింబవళ్లు కష్టపడి పనిచేస్తున్నానే? నేను ముందు గానే చెప్పాను నాకేమీ ఆస్తిలో భాగం వద్దని. కట్నం కానుకలు లేని సంబంధం చేసుకొన్నందుకే కదా?"

"అలా చేసినందువల్లనే ఇలా కష్టపడవలసి వస్తుంది. కష్టం చెప్పుకుంటే తీర్చేమనిషి లేడు"

పెద్దమామ తన అల్లుని ద్వారా బంధువులోని ఒక సంబంధం స్థిర పరిచాడు. ఆ అమ్మాయే మాళు తల్లి.

మాళు తన యింట్లో వున్నప్పుడు ఈ పెళ్లి గురించి విన్నది పెద్దమామ తండ్రిని పిలిచి అడగ్గా తండ్రి ఒప్పుకున్నాడు. తర్వాత తన తల్లికి స్వల్ప ములో నగలు, బట్టలు ఇచ్చి పెండ్లిచేశాడు. ఇది ఇప్పటి సంగతిగాదు.

"అమ్మాయి, నాన్నను అడుగు."

"నాన్నమ్మ ఉపదేశించింది."

"నావల్లకాదు నన్నంటే అలక్ష్యం. నువ్వు చెబితే ఫరవాలేదు."

"నువ్వు అడగరా, కుట్టా. నువ్వే అడుగు."

"నేనడుగుతాను. అడగాలనే అనుకుంటున్నాను."

ఆ మాట నాన్నమ్మకు ఏదో కలవరం కలిగించింది.

"ఏమిటిరా అంటావు?"

"నాకు అన్నీ తెలుసు. అడగాలనిపించింది అడుగుతున్నాను." అక్కడ బండెద్దులాగా చేతి యంత్రము సరిచేయాలి. అందుకైతే డబ్బుంది. నాకంటే ఏదీ లేదు.—"

తండ్రి యిట్లా మాట్లాడుతాడని మాళు ఊహించలేదు. ఎప్పుడూ మౌనంగావుండే తన తండ్రేనా యిలా అంటున్నది.

"ఇక్కడుండే సంపదలన్నీ నేను అడుసు బురదల్లో పనిచేసి సంపా దించిన డబ్బువల్ల వచ్చినవే."

"ఊరుకోరా, కుంజు కృష్ణుడు వింటాడేమో భగవంతుడా!"

నాన్నమ్మ కలవరంతో తలపై చేతులు పెట్టుకుంది.

"ఒకసారి నేనూ అడుగుతాను బహుశ. నాకు నాలిక లేదనుకుంటున్నా రేమో!"

ఇలా అని తండ్రి వెళ్లిపోయాడు.

అమ్మమ్మ, పెద్దమ్మ, పెద్దమామల మధ్య ఇప్పుడు మాటలు లేవు. ఏదైనా మాట్లాడాలంటే పెద్దమామ తన సహోదరితోనే మాట్లాడే వాడు. పెద్దమామ కంటే పెద్దమ్మ పదేళ్లు పెద్దది.

గత సంవత్సరం తుళ్లలాట జరిగిన తర్వాతనే వారిమధ్య మనస్తాపాలు ప్రారంభమయ్యాయి. ఆరాత్రియే అప్పుణి గురించి ఇష్టం వచ్చినట్లు మాట్లాడి వెళ్లిపోయింది. ఆ సాయంత్రమే ఇంట్లో వాగ్వాదం పెరిగింది.

"ఆ కుర్రాడికి ఇక్కడ హక్కుంది,"

అప్పుడు పెద్దమామ అగి రెండు చేతులూ నడుం మీద పెట్టుకుని, "అధికారమా, అదెవ్వడా కుర్రాడు."

"అతనూ ఇక్కడివాడే."

"అవ్వా! ఊరికే వుండవ్?"

"అక్కా అని పిలిచే మనిషి యిలా అవ్వా అని పిలుస్తాడు."

"నువ్వు ఒక యముడువి. కుంజు కృష్ణా, ఈ ఇంటికి యముడువి."

పెద్దమామ కేకలు వేశాడు.

"నేనేరా అన్నిటికీ....

తర్వాత పెద్దమ్మ ఏమీ మాట్లాడలేదు. తిన్నగా లోపలికెళ్లిపోయింది

"నువ్వే మరీ, నువ్వేమైనా చెయ్యగలవు."

*　　*　　*　　*　　*　　*

అప్పుణి బడికి పోవడం గురించి మాళు చెప్పిన తర్వాతనే వారికి తెలిసింది.

"నిజమేనా?"-

"అవును నాన్నమ్మా, నేనూ చూశాను."

"నీకేదో భ్రమ కలిగి వుంటుంది "

"ఊహూ, నేను మాట్లాడాను కూడా."

దాంతో వారికి నమ్మకం కుదిరింది.

"ఆ పిల్లవాణ్ణి భగవంతుడు ఆయు షిచ్చి కాపాడనీ.దానికి వాడేదిక్కు."

పారుకుట్టి ఒక యింట్లో పనిచేసేదని వారికి తెలుసును. ఎప్పుడైనా ఎవ రైనా పారుకుట్టిని గురించి అడిగితే "అవిడ నాకు పుట్టినదే...." అనేది ఆమె.

కాని ఏళ్ళు గడచినకొద్దీ పారుకుట్టి గురించి తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. పారుకుట్టి ఉండే పుత్తపరంబు పుత్తరాది వారింటి నుంచి రెండుమైళ్ళదూరమే వున్నది. కాని ఈ రెండు మైళ్ళదూరమే మనుష్యులను ఎంత దూరంగా చేసినదని మనసుకి తోచింది. అక్కడికెవ్వరూ పోయే వారు కాదు. అక్కడి కెవరైనా వెళ్లితే మళ్ళీ యీ యింట్లోకి రానివ్వరని భయం. ఈ నిబంధనని మీరడానికి ఎవ్వరికీ ధైర్యం వుండేది కాదు.

పారుకుట్టి ప్రసవించినదనే వార్త చాల రహస్యంగానే ఉత్తరాది ఇంటి లోకి చేరింది. పిల్లలెవరో మాట్లాడేటప్పుడు ఈ విషయం చెప్పారు. అప్పుడు వాళ్ళు మెల్లిగా తోట ప్రక్కకు వెళ్ళి మాట్లాడుకున్నారు.

"బ్రతికి వున్నదా, ఏం బిడ్డ?"

"మగ బిడ్డనే."

"ఒళ్ళు జబ్బేమి లేదే? సహాయమునకు ఎవరున్నారు ఆమెతో?"

"నిన్నరాత్రి నొప్పులొచ్చాయట. ఉదయానికి మగబిడ్డను కన్నది."

"తోడు ఎవరున్నారు?"

ఆ మాట పూర్తి కాలేదు. ఆ సమయంలో తన కూతురు కోపంతో ఎగిరి పడింది.

"అంత అక్కరగా వుంటే కూతురు ప్రసవానికి వెళ్ళుండరాదూ?"

ఆమె ఏదీ మాట్లాడక తిరిగి వెళ్ళి, తన చీకటి గదిలో మంచంపై పడుకుంది.

కోంతుణ్ణినాయర్ చచ్చిపోయిన విషయం విన్నరోజు ఎవరూ చూడకుండా ఆ గదిలోనే దుఃఖిస్తూ పడుకుందామె. తనకూతురుకిక ఎవరుసహాయం?

ఏదీ మాట్లాడేందుకు వీల్లేదు ఆ యింట్లో. ఉత్తరాది వారింటి వైపు వచ్చే పనివాళ్లనో, పిన్నలనో, ఒంటరిగా చూస్తే, అన్నీ అడిగి తెలుసు కునేది. పెద్ద కూతురు వినరాదు. మీనాక్షికి ఏం చెప్పినా ఒకటే సంతోషమూ, దుఃఖమూ రెండూ ప్రకటించదు. అది ఆమె తత్త్వం.

అప్పుణ్ణిని చూడాలనిపించింది మనసులో. తన యింటితోట దగ్గిరగానే నిత్యం రెండుసార్లు అతను వెళుతాడు అని వినివుంది. భాస్కరుడు, కృష్ణకుట్టి చదువుతున్న బడిలోనే అతనూ చదువుతున్నాడు కూడా.

భాస్కరుణ్ణి ఈ విషయం అడిగేందుకు వీలుకాదు. "అబ్బాయ్ భాస్క రా ఇక్కడ రారా" అని పిలిస్తే అతను ఎవరైనా ఉన్నప్పుడే దగ్గరకొస్తాడు.

తెల్లవారిఝామున తోటలోనున్న బాట వద్దకు వెళ్ళితే అప్పణిని చూడ వచ్చును. కాని, వాకిట్లోకి దిగడానికి ప్రయాసపడాలి. నిటారుగా నిలుచోలేదు. పది పన్నెండు మెట్లు క్రిందిగా దిగాలి తోటకు వెళ్ళాలంటే. దిగివెళ్ళినా బాట వరకు వెళ్లడం కష్టం. అప్పణితో మాట్లాడటం ఎవరైనా చూస్తే ఇహ అంతే.

"కర్రతో కొడతాను" అన్నాడు. ఆ మాట ఇప్పటివరకు మరపటం కష్టంగా వుంది. చిన్నప్పుడు దేహమంతా చిడుముతో పుచ్చిపోతే మందుల ఆకులు నూరి చమిరి ఒళ్ళుకి రాసిపోసినది. దేహమంతా స్వస్థపడేవరకు కాపాడినది తనే. అమ్మకు పిల్లల్ని చూసుకునేందుకు తీరుబడి వుండేది కాదు. ఉదయం నుంచి అర్ధరాత్రి వరకు పని పాటలతో సరిపోయేది. కుంజుకృష్ణని తను చూసుకుని, అన్నం తినిపించి, కథలుచెప్పి, ఆటలాడించి, తన దగ్గిర పడుకోబెట్టి నిద్రపుచ్చేది. పెద్దవాడయ్యాక అతనితో మాట్లాడుటకుకూడ సమయం సందర్భంచూసి వెళ్ళవలసినదిగా వుంది. ఈ నాటికి కర్రతో కొడతాను అనే మాట కూడా వినవలసి వచ్చింది.

తలచుకున్నప్పుడు ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"అనుభవిస్తాడు, అన్నీ అనుభవిస్తాడు."

"ఎవరితో మాట్లాడుతున్నావు నాన్నమ్మా?"

మాళు గుమ్మములోనుంచి తలఎత్తి అడిగింది.

"ఎవరితోలేదు, నేను చేసిన ఫలాన్ని అనుభవించాలిగా."

"ఊరుకో నాన్నమ్మా."

"ఎవరికంటికీ తెలియకుండా చనిపోదామంటే, యముడికిష్టంలేదు."

"అప్పణి వచ్చేందుకు ఇంకా ఆలస్యంవుంది. మాళుకు ఒక లెక్క ఉన్నది కొబ్బరిచెట్ల నీడ గుమ్మం వద్ద పడాలి. అప్పుడు అప్పణి వచ్చేవేళ.

"ఏం లాభం! అతను బడిలో వుండి వుంటాడు."

"పెద్దమామ వెళ్లిపోయారు."

అప్పణి గురించి చెప్పినది మనస్సులో అసంతృప్తిని రేపింది.

"నీకెలా తెలుసు?"

"అవును అమ్మణి, పెద్దమ్మ, ఇద్దరూ కూడా వెళ్ళారు. ఎల్లుండికి గానీ తిరిగి రారు."

"వారు పోతే నాకేం, వస్తే నాకేం"

ఆమె ఆలోచించింది. ఎవరూలేరు. అప్పణిని పలకరించి కుశల ప్రశ్న లడిగితే ఏం?

కుంజుకుట్టికి యిది యిష్టం వుండదు. కాని ఆమె యిష్టాయిష్టాలగురించి తనెందుకు బాధపడాలి?

కుంజుకుట్టి చిన్నతనంలో యిలా లేదు. ముగ్గురు ఆడ పిల్లలనీ ఆమె ఎంతో యిష్టంగా చూసుకుంది. నంబూదిరి సంబంధం కలిగిన తర్వాతనే ఆమె పూర్తిగా మారిపోయింది. అతనికేమో ఆ సంబంధం యిష్టంలేదు. అమ్మ మేన మామ నిర్బంధించినందున ఎదురు మాట్లాడక ఒప్పుకొన్నాడు. ఆమె కూడ ఒప్పుకుంది. అందుకే యిప్పుడు ఈ నీలగటం.

"మాళూ."

మాళు వంటగదిలోనికి వెళ్ళింది. మళ్ళీ వచ్చింది.

"ఏమి నాన్నమ్మా?"

"పెద్దమ్మ ఎక్కడుంది?"

"పెద్దమ్మ, చిన్నమ్మ గుంటకు వెళ్లారు?"

ఆమె మెల్లిగా లేచింది.

"నువ్వు నాకూడరా. మనం తోటవరకు వెళ్ళొద్దాం."

అప్పణిని చూసి వస్తానని చెప్పడానికి భయం.

"మెట్లు దిగిరాగలరా అవ్వా?"

"సులభంగారాగలనా?"

మాళు సహాయంతో మెల్లి మెల్లిగా తోటకు దిగి వచ్చింది. కొబ్బరి తోటలోని పల్లాలన్నీ దిగి ఎక్కడం చాల కష్టమైన పని. చూపు తక్కువకావ టంతో మరీ కష్టమైంది, కంచె ప్రక్కకు వెళ్ళినిలబడ్డారు.

మాళు ఆ తోటచుట్టి తిరిగి చూసింది. ఎవరూ కనబడలేదు. కాస్సేపు నిలుచుని చూస్తున్నప్పుడు చెట్ల మధ్య దూరంగా ఏదో తెల్లనీడ కనిపించింది. కొన్ని అడుగులు ముందు కెళ్ళినప్పుడు మాళు, "అదిగో అప్పణి" అన్నది.

కానీ అప్పాణి ఆ ప్రక్కగా రావడం లేదు. ప్రక్కతోటలోని గట్టుపైగా నడుస్తున్నాడు.

"ఇక్కడకి రమ్మని పిలవ్వే. అమ్మమ్మ యిక్కడ నిలుచున్నదని చెప్పే."
ఆమె తొందర చేసింది.

అక్కడ నుంచి పిలిస్తే అప్పాణికి వినపడకపోతే? ఆమె కంచెదాటి వెళ్ళి తోటలోకి పరుగెత్తింది.

అప్పాణికి ముచ్చెమటలు పోశాయి. పుస్తకాలు చంకలో పెట్టుకొని, ధోతిని మడిచి కట్టుకొని మెల్లిగా అడుగు లేస్తున్నాడు. దగ్గరకెళ్ళి మాళు ఇలా అంది.

"అప్పాణీ, నిన్ను పిలుస్తున్నారు?"

నడుస్తూనే అతను అడిగాడు.

"ఎవరు?"

"అవ్వగారు ఆ ప్రక్క పిలుస్తున్నారు?"

"నేనక్కడికి రాలేను."

"అవ్వ చెప్పింది అదిగో అవ్వ."

"నేనక్కడికి రానని చెప్పలే?"

అతను వేగంగా నడవసాగాడు. ఆమె నిరాశతో తిరిగిపోయింది. దగ్గిరకి వెళ్లగానే నాన్నమ్మ అడిగింది.

"ఎక్కడే వాడు?"

"రాను పిలులేదుట."

"నేను రమ్మని చెప్పి పిలిచావా, మాళు?"

"అవునవ్వా. నేనక్కడికి రానని చెప్పి వెళ్ళిపోయాడు."

ఆమె ఏమీ మాట్లాడక, ఏదో ఆలోచిస్తున్నట్లు నిలుచుని ఒక పెద్ద నిట్టూర్పు విడిచి. "అతను రాడు. ఎల్లా రాగలడు?" అన్నది.

# నాలుగు

అది తిరువాదిర ఉత్సవానికి ముందురోజు. యూసఫ్ అంగడిలో రోజు కంటే ఎక్కువ జనం వున్నారు.

అయిదు రూపాయలకు మిరపకాయలు కావాలి, అందుకని మనకొక్కలు పంట్టింటినుంచి శంకరన్ నాయర్ ఆ ప్రక్కకు వచ్చాడు. వాప్పు అంగడిలో సరకులు నాణ్యత లేనివి. అక్కడుండేవి పాత సరకులు. యూసఫ్ అంగడిలో అయితే అన్నీ క్రొత్తవి కొనవచ్చును.

ఆ అరుగుపై పనిలేనివారెందరో కూర్చుని వున్నారు. దర్జీ ప్రక్కన నలుగురైదుగురు పిల్లలు గుమికూడి వున్నారు.

మరునాటి ఉత్సవాన్ని గురించి అక్కడందరూ మాట్లాడుతున్నారు. గత సంవత్సరం ముళయంకావు గ్రామానికివెళ్లి పూరదర్శనం చేసివచ్చిన వేలప్పన్ కూడ వాళ్లల్లో వున్నాడు. పాలత్తూరు కుంజువు, ఉక్కన్ బాప్పటి తమలో తాము అకుల వర్తకం గురించి మాట్లాడుకుంటున్నారు.

శంకరన్ నాయర్ బైటికి వెళ్లినప్పుడు ముళయంకావులో పుర నక్షత్రోత్సవం గురించి రాముణ్ణి ఇలా అడిగాడు.

* "తిరువాదిర ఎప్పుడు శంకరన్ నాయరూ?"

"నాకు పండుగ ఏమిటి?" అతను లోపల నుంచే అంగడివానితో ఐదు రూపాయలకు మిరపకాయలు కావాలని అడిగాడు.

"ఏమిటి శంకరన్ నాయరూ? ఇంత తక్కువ తీసుకుంటున్నారేం?"

ముసతామార్ అడిగాడు.

"ఇదే నాకు ఎక్కువ"

వేలప్పన్, రాముణ్ణిను, హసన్‌కుట్టి, ఒకరి ముఖము ఒకరు చూసుకున్నారు. హసన్‌కుట్టి బీడీ వెలిగించి అగ్గిపెట్టిని యూసఫ్ బల్లమీదికి విసిరేసి ఒక చిరునవ్వుతో ఇలా అన్నాడు.

"శంకరన్ నాయరు కిప్పుడు ఎక్కువ ఖర్చుపెట్టే రోజులు."

"అదేమిటో?"

యూసఫ్ అడిగాడు.

"అతన్నే అడుగు."

---

* పుష్యమాసంలో కేరళ స్త్రీలు, బాలికలు జరుపుకునే పండుగ.

"అట్లానా, కానీ, నేనే నాయర్ని అడుగుతా?"

"కొత్తపండుగ జరుపుతున్నారు కాబోలు నాయరుగారు"

శంకరన్ నాయరుకి అరికాలిమంట నెత్తికెక్కింది. ముసలియార్ మిరప కాయలను తూకం వెయ్యలేదు.

అకులబేరం గురించి మాట్లాడుతున్న ఉక్కన్ బాప్పట్టి ఆ సంభాషణ లోకి దిగాడు.

"ఏమిటి యూసఫ్‌గారు, శంకరన్ నాయరుకి రోజులు మారినట్లేనా?"

"నాకు తెలియదబ్బా. రాముణ్ణిని అడుగు. అతనికి తెలుసును."

"ఏమిటోయ్, మావద్దనే నువ్వేమీ చెప్పడంలేదు?"

శంకరన్‌నాయరు శాంతంగా వుండలేకపోయాడు. బాప్పట్టి తగ్గుస్వరంలో అలా అన్నాడు.

"అలాగేమీ సంగతి మోసమైనదికాదు. ఆ అమ్మాయి యిప్పుడు మంచి స్థితిలోనే వుంది."

గుంజిపై ఒరిగి అరమోడ్పు కనులతో నిలుచున్న శంకరన్ నాయరు తిరిగి అరుగుపై కూర్చుని బీడీ కాలుస్తూ దొంగనవ్వు నవ్వుతున్న, ఉక్కన్ నాయరు దవడమీద బలంగా ఒక్కదెబ్బ కొట్టాడు.

వారి మాటలూ నవ్వులూ హఠాత్తుగా ఆగిపోయాయి. దెబ్బ అంత చురుక్కని పడింది. అందరూ బొమ్మల్లా నిలుచుండిపోయారు. సరకులుకోసం వచ్చిన వారందరూ దగ్గరగాచేరి నిలబడ్డారు.

అంతా బాప్పట్టి వంక చూశారు. అతని కన్నులు చింత నిప్పుల్లాగా మండిపోయాయి. అతను ఏమీ చెయ్యడానికి వీల్లేకపోయింది. మూడు క్రిమినల్ కేసుల్లో అప్పటికే యిరుక్కుని వున్నాడు. ఒకసారి జైలు జీవితం కూడా చవిచూసి వున్నాడు. కన్నూరు జైలుకి వెళ్ళేందుకు ఎంతో ధైర్య సాహసాలు కావాలని అనుభవం ద్వారా తెలుసుకున్నాడు. అతను తిరిగి లేచాడు. అప్పుడు తన మొలలోంచి ఒక కత్తిని పైకి తీశాడు.

"సహించలేను వాప్పట్టీ."

యూసఫ్ ఛాతీపై చేతులుంచుకొని క్రిందికి చూశాడు. కాని శంకరన్ నాయరు కత్తితో నున్న ఆ చేతిని చూసి కొంచం కూడా కలవరం చెందక అలాగే నిలబడ్డాడు.

కత్తి పట్టిన చెయ్యి హఠాత్తుగా పైకెత్తినప్పుడు శరీరమంతా రోమాలతో నిండిన ఒక వ్యక్తి చేతులుజాపి అడ్డంగా నిలబడ్డాడు. అతను సైదాలికుట్టి.

"ఇడు సైదాలికుట్టీ."

"కత్తిదింపు, వాప్పుట్టీ, చేతిలోని కత్తిని దింపు."

"ఈ నాయరు పేగుల్ని తీయకపోతే నాపేరు నాప్పుఉక్కన్ కాదు."

"నేను చెబుతున్నా, కత్తిని కిందవెయ్యి. లేదంటే చేతులెత్తేశాను. వేయవూ........"

బాప్పుట్టీ మెల్లిగాచేతులను వెనుకకిపెట్టాడు. వెరచినట్లుండిన అతని చేతిలో నున్న కత్తినితీసి మడిచి తన నడుములో నున్న సంచిలో పెట్టుకున్నాడు సైదాలికుట్టి.

"వాప్పుట్టీ, రక్తం చిందటం చూడలేను."

అతని ముఖం ఎర్రగా కందగడ్డలాగా వుంది. అలాగే నిలుచుండి పోయాడు.

"నాయరుగారు, మీరు వెళ్ళండి."

ఏ విశేషం జరగనట్లు శంకరన్ నాయర్ తిరిగి వెళ్ళిపోయాడు.

దారిలో నడుస్తున్నప్పుడు అతని మనస్సులో అగ్నిజ్వాలలు చెలరేగాయి.

"కుక్కలు....వాళ్ళు చెడ్డపేరు నాకు అంటగడుతున్నారు"

ఆలోచించి చూస్తే అతనికి తానేమీ తప్పుచేసినట్లు అనిపించలేదు. ఇప్పుడు విన్నది ఒక అపవాదే. దీనికి తాను కారకుడు కాడా? అక్కడికి పోవడమూ, మాట్లాడటమూ అందరూ గమనిస్తున్నారు.

తానేమీ తప్పు చేసినవాడుకాడు. ఎవరి సహాయంలేని ఒక కుటుంబానికి వీలయినంతలో కొద్దిగా సహాయం చేస్తున్నాడు. ఇట్టి చిన్న సహాయాలు చేయడం గురించి, కేవలం, కేవలం అతనిపైగా........

శంకరన్ నాయరు రక్తం ఉడికి పోయింది. అతి వేగంగా నడిచాడు. అచ్చుమాన్ అంగడి దగ్గరకు వచ్చినప్పుడు మెల్లిగా గుమ్మంవద్దనిలిచి, ఎవరో పిలిచారు.

"శంకరా!"

"ఏమిటో చేటు అతనికి, శంకరన్ నాయర్ తటపటాయించాడు. ఇక వెనక్కి వెళ్ళ వీలులేదు

- "కొంచెం ఇలా రాగలవా?"

అచ్చుమ్మాన్ మళ్ళీ పిలిచాడు.

శంకరన్ నాయరు లోపలకు వచ్చాడు.

"ఏమిటీ పెద్దాయనా?"

అతను ఏమీ జవాబు చెప్పలేదు.

"ఇందా, ఈ చక్కలాన్ని పొడి చేసి ఇవ్వు". చక్కలాన్ని పొడి చేయడానికి రోలు, రోకలిని తీసుకొచ్చి పెట్టాడు. శంకరన్ నాయర్ తన మనసులో వున్నవన్నీ మ్రింగుకొని చక్కలాన్ని పొడి చేశాడు

"చాలు, ఇంకాపొడిచేయకు."

దీనిని విననట్లు శంకరన్‌నాయర్ తన పని సాగిస్తూనే వున్నాడు. పొడి చేసిన చక్కలాన్ని ఎత్తి అచ్చుమ్మాన్ చేతిలో పెట్టాడు.

అతను విసనకర్రతో విసురుకొని పడక కుర్చీలో పడుకొని వున్నాడు.

"పుత్తన్ పరంబులో జరుగుతున్న వ్యవహారాల్ని నువ్వేకదా గమనిస్తున్నావు? అది వాస్తవమేనా?"

శంకరన్ నాయర్ నాలుక తడారిపోయినట్టు నిలుచున్నాడు.

"ఏమిటిరా"

అతను ఏమీ పలుకలేదు.

ఒక పరిహాస పూరిత నవ్వుతో అచ్చుమ్మాన్ మళ్ళీ అడిగాడు.

"ఇది ఎప్పటినుంచి"

అచ్చుమ్మాన్ మౌనం వహించాడు-శంకరన్ నాయర్ కోపాన్ని అణుచుకొని,

"కొన్ని రోజులుగానే." అన్నాడు.

"తప్పులేదు. అది కావలసిందే. ఆ ఆడదానికి మగవాని సహాయం ఏదీ లేదు." కిటికీ వద్ద నున్న చిన్న ద్వారంలోంచి ఎంగిలి ఉమ్మి, మళ్ళీ చెప్పాడు "కానీ చెడ్డ పేరు రాకూడదు. నలుగుర్నీ పిలిచి మర్యాదకైనా వారికి చెప్పి తీరాలిగా?" అన్నాడు.

శంకరన్ నాయర్‌కు అక్కడ ఇక నిలుచుండటం ఇష్టపడలేదు.

"నాకు పని వుంది. మళ్ళీ వచ్చి చూస్తాను" అని చెప్పి వెంటనే తిరిగి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అతనికి నిద్ర రాలేదు.

ఒక తీర్మానానికి వచ్చిన తర్వాతనే అతను పుత్తన్ పరంబుకు వెళ్ళాడు. సాయంకాల సమయం. అయినా నలుగురూ చూడాలనే వుద్దేశ్యంతో

అతను ఆ యింటి గుమ్మం ఎక్కాడు. సూర్యాస్తమయమైనప్పటికి ఇంకా చీకటి పడలేదు. అతను గుమ్మం ఎక్కాడు.

తలుపు తెరచి వుంది. సంధ్యా దీపపు వెలుగు లోపల పడుతోంది.

"దీపం.... దీపం...."

ఆ చిన్న దీపపు వెలుగులో ఆమె ముఖం ప్రకాశించింది. ఆ పని యింటిలో రోలు వద్ద. ఆ పరిసరములో చూసిన పనిగత్తేనా యీ స్త్రీ అని తలచేందుకు కష్టం. స్నానంచేసి తడి అయిన కేశములు వెనుక వ్రేలాడు తున్నాయి. ముఖంలో విభూతి ప్రకాశిస్తోంది. ఇట్లా అందముగా ప్రకాశిస్తున్న ఆమె ముఖమునందు ఏదో ఒక వేదన కనబడుతున్నది.

నడవలోకి వెళ్లినప్పుడు మళ్లీ ఏదో చేయరాని అపరాధం చేస్తున్నట్లు అతని మనస్సు కలవరపడింది. కానీ ధైర్యాన్ని పుంజుకుని ఏదో అడగాలని తీర్మానించి ఇలా అడిగాడు,

"దీపాలు వెలిగించే సమయమైందా?"

పారుకుట్టి ఎడమచేతిలో చిన్న దీపాన్ని పెట్టుకొని, కుడిచేతి వ్రేలుతో దీపపు ఒత్తిని పెద్దదిగాచేస్తూ,

"అవునండి, శంకరన్ నాయరుగాడు. ఏమిటండీ ఈవేళలో ఇక్కడికి వచ్చారు?, అన్నది.

"పని యింటికి మధ్యాహ్నం వెళ్లొచ్చాను. రెండు కొబ్బరి కాయలు దొరికాయి. వాటినివ్వడానికి వ్యవధి లేదు."

అతను అరుగుపై కూర్చుంటూ,

"అప్పణి ఎక్కడ?" అనడిగాడు.

"స్నానం చేయడానికి వెళ్లాడు."

అంతటితో ఆ సంభాషణ ఆగింది. దీపాన్ని క్రింద పెట్టి, పారుకుట్టి గడప లోపల గోడకి ఆనుకుని నిలుచుంది.

అతని మనస్సులో నున్న తలపులు తుఫానులాగా చెలరేగాయి. చెప్పాలి.... చెప్పాలి... ఆ యింటి గుమ్మంలోకి వచ్చినప్పుడు ఎంతో ధైర్యముగా వున్నాడు. కానీ తీరా లోపలికి ప్రవేశించాక మాటలు పైకి పెగలటం లేదు. గొంతు ఎండిపోతున్నది. అయాసంగా వుంది. ఎంతో శ్రమతో తలఎత్తి అతను ఇలా అడిగాడు!

"పారుకుట్టమ్మా——"

ఆమె ముఖం పైకెత్తి చూసింది.

"నేనిక్కడకురావడం నలుగురూ నాలుగువిధాలుగా చెప్పుకుంటున్నారు"

చాలా శాంతంతో పారుకుట్టి ఇలా అన్నది.

"లోకం ఏదైనా అంటుంది."

అతనికి ధైర్యం కలిగింది.

"మీకు చెడ్డపేరు రాకూడదనే అనుకుంటున్నాను."

పారుకుట్టి కలవరంతో అతన్ని చూసింది. ఆ తర్వాత

"మీవల్ల నాకు సహాయమేకదా?" అన్నది.

శంకరన్ నాయరుకి కొంచెం ఆత్మ విశ్వాసం కలిగింది.

"పారుకుట్టమ్మా, ఏమీ అనుకోకండి. ఒక విషయం అడగాలనే నేనిక్కడకు వచ్చాను."

"ఏమండీ, ఏమిటది?"

"మీకు....మీకు సహాయానికి ఎవరూలేరు. నేను....నేనూ ఒంటరివాడిగానే కాలం గడిపేశాను. పారుకుట్టమ్మకు....సమ్మతమయితే........నేనిక్కడ ఒక బంధం........

"ఒద్దు శంకరన్ నాయరూ?"

స ్పష్టమైన స్వరముతో పారుకుట్టి పలికింది. శంకరన్ నాయరుకు తల ఎత్తేందుకు ధైర్యం చిక్కలేదు.

"నాకటువంటి యోగం తీరిపోయింది. ఇక అటువంటి తలంపులకి నా మనస్సులో చోటులేదు. మీరేమనుకోవద్దు...."

అతనుమౌనం వహించాడు. కాని, అతని మనస్సు కుములి పోయింది. అప్పుడు ఎవరో నడుస్తున్న శబ్దం వినిపించింది. అతను తిరిగి వాకిటి ప్రక్కకి చూశాడు. అప్పుణి, అతను ఎవరి వైపును తిరిగి చూడక తిన్నగా ఇంట్లోకి వెళ్ళాడు.

నాయరు లేచి నిలబడ్డాడు.

"పారుకుట్టమ్మా....నేను చెప్పినదాన్ని మరచిపోండి. తప్పునాదే...."

పారుకుట్టి ముఖం వంచి నిలుచుంది.

"పారుకుట్టమ్మా, ఏమీ విచారించవద్దండి. ఎప్పుడూ నాకు వీలయినంత

సహాయం మీకు చేయగలనమ్మా. ఇప్పుడు నేను మాట్లాడినదానిని మరచి పొండి."

పారుకుట్టి కళ్ళు చెమ్మగిల్లాయి.

అతను మెల్లిగా నడచి వెళ్లిపోయాడు.

అప్పుణి లోపల లాంతరువెలుగులో పాఠం చదువుతున్నాడు. పుస్తకంలో కళ్ళు నిలిచి వున్నాయి. నేలని చూస్తున్నట్లు వంగి అప్పుణిని రెప్పలు వేయకుండా చూస్తూ ద్వారము పట్టుకొని నిలుచుంది పారుకుట్టి. ఆమె ఊహలలో అతను పెరిగి వున్నాడు. పెద్దవాడుగా కనిపిస్తున్నాడు. పదిహేనేళ్ళ బాలునికంటే ఎక్కువగా పెరిగి వున్నాడు. అతని శరీరం ఒక యువకుని శరీరంలాగా కనబడుతోంది. అతను పెరిగి పెద్దవాడయిన వెంటనే తన వద్దనుంచి పాశబంధములు వదలిపోతున్నాయా?

పూర్వంలాగ ఎక్కువ మాట్లాడటం లేదు. అతను అడిగినదానికి సరిగ్గా సమాధానం యివ్వటంలేదు. బడి విడిచాక ఇంట్లో కాసేపువుండేవాడు. తోటలోనైనా చుట్టు ప్రక్కలోని తోటలోనైనా తిరిగేవాడు. ముత్తాచితో యింటికి వెళ్ళి అక్కడ కూర్చుంటాడు. అతని నడక రీతి చూస్తే అతని మనసు ఈ లోకంలో ఉన్నట్లు తోచడంలేదు. ఏదో లోలోపల అతన్ని వేధిస్తున్నది.... అతను బాధపడుతున్నాడు?

అన్నం తినడానికి పిలిచేవరకు చదువుతుంటాడు. అన్నం తిన్న తర్వాత మళ్ళీ చదువు ప్రారంభిస్తాడు. నిద్రవస్తే దీపాన్ని ఆర్పి నిద్రపోతాడు.

అతనేమీ మాట్లాడటం లేదే. ఎందుకు?

"ఏమిటిరా అప్పుణీ. ఆలోచిస్తున్నావు?"

"ఏమీ లేదు?"

"ఏమిటిరా మౌనంగా వున్నావు?"

"ఏం లేదు "

ఏమి లేదను జవాబే వినగలదుగాని తొందరచేసి అడిగినప్పుడంతా ఆమెకి మనసులో ఒకవిధమైన వేదన ఎక్కువవుతూ వుంది.

"భగవతీ, అతనికి నువ్వే దిక్కు. నువ్వే తోడుండాలి."

* * * * * *

అక్కడ ఏరు తిన్నగా పారదు. ఆ మలుపులో వేసవికాలంలోకూడ నీరు నిండి వుంటుంది. దాని ప్రక్కన అయ్యప్పస్వామి గుడి వుంది. ఆ నీటి అలలు శాంతముగా మెల్లిగా పారుతుంటాయి.

అప్పణి ఒక ఎత్తయిన గుట్టపైకెక్కి కూర్చున్నాడు. చిన్నచిన్న అలలు ఒకదానిపై ఒకటి పడుతూ అణగిపోతున్నాయి.

ఆ ప్రశాంత తటాకముయొక్క నిశ్శబ్దాన్ని భంగం చేసినట్లుంది ఆ చిరు అలల మ్రోత.

ఆ రోజు శలవు దినం. కాని యింట్లో వుండడానికి అతని మనస్సు ఒప్ప లేదు. ఆటలాడేందుకు స్నేహితులెవ్వరూ లేరు, అనుకుంటూ ఇంట్లోంచి బయ టికి వచ్చాడు. తిన్నగా ఏటి మడుగు గట్టుకి చేరుకున్నాడు.

అయ్యప్పస్వామి గుడి గట్టు దగ్గర నీరు ప్రవహించడాన్ని చూస్తున్నా డతను. ఆ లోతైన మడుగులో పడినవారు మళ్లీ గట్టెక్కి వచ్చినదిలేదు. ఇది చిన్నప్పుడు విన్నది. మడుగులోపల అయ్యప్పస్వామి విగ్రహం ఉండేదని ప్రతీతి. వర్షాకాలంలో జనం ఆ నీటిమీదుగా ప్రయాణించే వారు. భక్తితో నీటిలో కానుకలు విసిరేవారు. అందువల్ల వారికి ఏ ఆపదలు రావన్న విశ్వాసం. ఆ గుంటలోతున విగ్రహమో దేవుడో వుండటం అసంభవము. అవన్నీ కథలే కదా ?

మొదటి రోజున తన క్లాసులో రామకృష్ణ మాస్టరు చెప్పినది జ్ఞాపకం వచ్చింది.

"రాళ్లలో చేయబడిన దేవతా విగ్రహములలో పలు రకములున్నవి. కొన్నింటకి కల్లు, మాంసము నివేదన చేయాలి. కొన్నిటికి పాలు, పండ్లు నివే దించాలి. మనదేశపు ఆచారము ఇదేకదా?

రామకృష్ణన్ మాస్టరు క్రొత్తగా వచ్చినవ్యక్తి. చక్కని మాటకారి. వారిది ఒక పాఠ్య ప్రసంగముగాకాక ఆసక్తికరంగా వుండేది. కొన్నిసమయాల్లో పాఠ ములు గురించి ఏమీ చెప్పేవారుకాదు. కాని వినడానికి ఆనందముగా వుండేవి ఆయన మాటలు.

శలవురోజులు రావడం ఒక శాపంలాగే కనిపించింది అప్పణికి. బడి వుండేరోజుల్లో ఉదయం వెళితే మళ్ళీ చీకటివేళకు తిరిగివస్తే సరిపోయేది.

ఇంట్లో ఉండటం తనకి కష్టంగా వుంది.

అమ్మని చూస్తున్నప్పుడు ముత్తాచి చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చేవి. అప్పుడతనికి ఆగ్రహం, విరక్తి కలిగేవి.

ఆ మడుగు దగ్గరకి వస్తున్న జనం అతన్ని చూసినప్పుడు ఏదో గుస గుస లాడుతున్నారు. వారు తనని చూసి ఏదో పరిహాసంతో మాట్లాడుతున్నట్లు అతనికి తోచింది.

వాళ్లెందుకు ఇక్కడికి వచ్చారు? దేన్నిగురించి మాట్లాడుతున్నారు?.... వాళ్ల మాటలు వింటున్నప్పుడు అతనికి కంపరమెత్తేది.

అతను-అమ్మని పెండ్లి చేసుకోపోతాడట -

ఆ క్రితం రోజు సాయంకాలం స్నానం చేయడానికి ఇంటికి పడమటి వైపు గుడి ఏటికి వెళ్లినప్పుడు అనేకమంది అక్కడ వున్నారు, దాని ప్రక్కన ఏనుగ మడుగున్నది. అందులో పడవలేవీ కనపడలేదు. అందువల్ల అక్కడ ఎవరూ ఉండరని అక్కడ స్నానంచేయ ప్రారంభించాడు.

దానికి ప్రక్కనే ఉంది స్త్రీలు స్నానం చేసే తటాకం. స్నానం చేస్తుండగా ఏవో మాటలు వినిపించాయి.

"ఎవరు ఆ కుర్రాడు?"

"వాడు పారుకుట్టి కొడుకు."

మళ్లీ వాళ్ల మాటలు వినేందుకు మనసొప్పలేదు.

వినరాదని తలచినా, వినవలసి వచ్చింది.

"టెంకాయ తోట శంకరన్ నాయరు అతనింటికి వెళ్లినప్పుడు ఈ కుర్రాడు ఉండటం లేదా."

నీటిలో మునిగింది, బట్టలు ఉతికింది-అతనికేమీ తెలీదు. కోపావేశంతో ఇంటికి వెళ్లినప్పుడు చూసిందేమిటి? అరుగు మీద అతను కూర్చుని వున్నాడు. అతనే శంకరన్ నాయర్! అమ్మతో ఏదో మాట్లాడుతున్నాడు....

ఊరువాళ్లు చెప్పినది నిజమే. అతను మళ్లీ అక్కడికివస్తాడు. అమ్మకి భర్త అవుతాడు. చిన్న తనములో తల్లి పెండ్లి చేసుకొనినది తన తండ్రిని. ఇప్పుడు అతను మరణించిన తర్వాత, శంకరన్ నాయర్ని....ఇక ఆలోచించలేక పోయాడు.

ఒడ్డున వచ్చి కొట్టుకుంటున్న పెద్ద అలలు చెదరి పోవటం చూస్తూ నిలుచున్నాడు అప్పుణి. సుళ్లు తిరుగుతున్న నీటిపై ఒక రాయి విసిరాడు.

అతను అమ్మకు భర్త అవుతాడు. ఇక తను ఇంట్లో ఏకాకి అవుతాడు.

అతనికి తనదంటూ వేరే చోటు లేదు.

అందరూ శత్రువులే. శంకరన్ నాయరు, భాస్కరుడు, పెద్దమామ. అందరూ. అమ్మకూడ వారితో చేరుతోంది.

స్నేహితుల ముందు తల ఎత్తి నిలబడేందుకు ఇక వీల్లేదు. ఏదో ఒక ఇంట్లో పడ్లుదంచు పనిగత్తె కొడుకు.

టెంకాయ తోట శంకరన్ నాయరు భార్య తన తల్లి.

అతను ఒక రాయిని ఎత్తి వేగంగా ఆ నీటిలోకి విసరి వేశాడు. దిగ్గున లేచాడు. గుంట తోటలో దీర్ఘంగా ఆలోచిస్తూ నడుస్తున్నప్పుడు వెనుకనుంచి ఎవరో పిలుస్తున్నట్లు తోచింది.

"అప్పుణీ...."

ఆ కంఠం పరిచితమైనది. అతను దగ్గరగా వస్తున్నాడు. శత్రుత్వముతోనే అతను శంకరన్ నాయర్ని తిరిగి చూశాడు.

"ఎందుకీ గుంట దగ్గిర కొచ్చావు?"

"ఏం లేదు."

"ఊరికే పొద్దు పోయేందుకు వచ్చావా?"

"ఊఁ"

అతను ముందుకు నడిచాడు. తలపైగా టేకు కట్టపెట్టుకొని నాయరు వెనుక వచ్చాడు. అక్కడి నుంచి బాటకు వచ్చినప్పుడు అతను తన కూడా అడుగులేయ సాగాడు.

మనసులో పుండు రేగింది.

మీతో నాకేం సంబంధం లేదు.

నేను మొగిలితోట కోంతుణ్ణి నాయరు కొడుకుని.

మీరంటే నాకు అణుమాత్రం కూడా ఇష్టంలేదు.

అప్పుణ్ణి ముఖంమీంచి చెమట కారింది. అతను త్వరగా అడుగు లేసేందుకు ప్రయత్నించాడు. నాయరు కూడానే వచ్చాడు. ఏమీ మాట్లాడ లేదు.

అప్పుడు ఎదురుగా లుంగీ కట్టుకొని బనియన్ వేసుకొని చేతి గుడ్డతో తలచుట్టుకొని ఉక్కన్ బాప్పుట్టి వచ్చాడు. దగ్గిరకి వచ్చినప్పుడు ఆగి నిలబడ్డాడు. శంకరన్ నాయరు అప్పుణి, ఇద్దరూ ఆగారు.

ఉక్కన్ బాప్పుట్టి కళ్లు శంకరన్ నాయర్ని "జ్ఞాపకమున్నది" అన్న భావంతో చూశాయి.

"తండ్రీ, కొడుకులిద్దరూ ఎక్కడికి?" అని ఒక ప్రశ్న వేసి అతను వెళ్లి పోయాడు.

అప్పుణికి తలకొట్టేసినట్లయింది. కాస్తకలవరంతేలిన తర్వాత, చంపి వేయాలనే ఉద్రేకంతో శంకరన్ నాయర్ని చూశాడు. అతను తన చూపులను నేలపై వుంచి నిలుచున్నాడు. కదల లేదు.

ఒక ఆపద నుండి హటాత్తుగా తప్పించుకున్నట్లు అతను నడిచాడు.

ఇంటికి వెళ్లినప్పుడు ఎవరూ చూడకుండా భోరున ఏడవాలనిపించింది. ఇంట్లో వున్న చిన్న గదిలో, చాప పరచి, బోరగిల పడుకుని ఏదేదో ఆలోచిస్తూ పడుకున్నాడు.

సాయంకాలం అమ్మ వచ్చి పిలిచినప్పుడు అతను లేవనేలేదు.

కంచెములో అన్నం పెట్టి, మళ్లీ వచ్చి అమ్మ పిలిచింది.

"అప్పుణీ, అప్పుణీ."

దానికి సమాధానం లేదు

"అన్నం పెట్టానురా, అప్పుణీ."

అతను మాట్లాడలేదు.

వంగి వీపు మీద చరచినప్పుడు అతను హఠాత్తుగా లేచి వెర్రివాడిలా అరిచాడు.

"నన్ను అంటకూ....నన్ను ముట్టుకోక...."

పారుకుట్టి బిత్తరపోయింది. వణుకుతున్న కంఠంతో మెల్లిగా అడిగింది.

"నాయనా! అప్పుణీ, నీకేమయిందిరా?"

అతను ఇంకా గొణుగుతూనే వున్నాడు.

"నన్నంటకు. నన్నంటకు."

కొడుకు భోంచేయలేదు.

తల్లీ ఎంగిలి పడలేదు.

ఇద్దరూ ప్రక్క ప్రక్కనే పడుకున్నారు. కానీ ఇద్దరు మాట్లాడుకోలేదు. ఆ రాత్రి అతి భయంకర నిశ్శబ్దతలో అమ్మ వెక్కి వెక్కి ఏడిచింది....

ఆ మర్నాడు అతను వేకువనే లేచాడు. అప్పుడు అమ్మ కన్నుమూసు కొని సోలి పడుకుని వుంది.

ఆమె నిద్రపోతునట్లు కనబడలేదు. వేగంగా షర్టుని తీసుకున్నాడు. లోపలున్న ధోతి, షర్టు తీసుకొని పుస్తకాల సంచి లోపల దోపుకొన్నాడు. గుమ్మం వదలి బయటికి వచ్చినప్పుడు అమ్మకళ్లు తెరిచింది. నెమ్మదిగా లేచి అడిగిందామె.

"ఇంత పెందరాళే ఎక్కడికిరా, అప్పణీ"

"అప్పణీ." ఆమె పూర్తిగ పిలుస్తున్నట్లు లేదు.

"ఎక్కడికిరా? అప్పణీ?"

"ఎక్కడికైనా."

"అబ్బాయీ, నువ్వు లేక నేనెక్కడరా?"

"అమ్మా, నీకు....నీకు శంకరన్ నాయరున్నారుగా?"

వరండాలో నుంచి వీధి తలుపుని తెరచి అతనుక్రిందికి దిగాలి.

"అప్పణీ...."

అతను తిరిగి చూడలేదు.

తొందరగా నడిచి వెళ్లి పోయాడు. వెనకనే తల్లి పిలుస్తూనే వుంది.

* * * * * *

నక్కల కొండల మధ్య అడవి చెట్ల పొదల దగ్గిర ఎత్తైన బండ చివర అతను కూర్చున్నాడు.

తెల్లవారే వచ్చి కూర్చున్నాడతను. బడికి పోయే దారిలో అయితే స్నేహితులెవరైనా చూస్తారు. చూస్తే, లక్ష ప్రశ్నలు అడుగుతారు, ఎవరూ చూడకూడదు, ఎవరితోనూ మాట్లాడ కూడదు. అని నిశ్చయించుకొన్నాడు అప్పణి.

ఆ కొండ లోయలు నిర్మానుష్య మైనవి. దూరంగా పచ్చని చెట్లు మధ్య గొర్రెపోతు గడ్డిమేస్తోంది. వాటి ముందుగా ఆవులు, గేదలు మేస్తూ కనబడ్డాయి.

నిప్పులు చెరిగే ఎండ. చెమటతో ఒళ్లంతా తడిసి పోయింది. షర్టు ఒంటికి అంటుకొని పోయింది.

తలలో ఒక పచ్చి గడ్డి మోపుతో ఒకడు క్రింద కాలి బాటలో నడచి వస్తున్నాడు. ఎవడో కుర్రాడు. అయినా అతను అడిగాడు.

"ఎందుకబ్బాయీ, ఇక్కడున్నావ్?"

"ఏం లేదు."

దూరంగా ఎవరెవరో నడిచి రావడం చూసి అప్పాజీ లేచాడు. పశ్చిమ వైపు దారిన నడిచాడు.

ఉత్తరాది వారింటి ప్రక్కకు వెళ్ళాడు. ఆ యిల్లు మూసి వుంది. రెండు వైపులా చెట్టు చేమ మొలిచియున్న పాతకాలపు చుట్టుగోడ, పాత కాలపుఇల్లు. ముందు ఒక పెద్ద మైదానం, దక్షిణ పార్శ్వమున ధాన్య గిడ్డంగి.

కాస్సేపు అతను నిలబడి, తర్వాత ఆ సందులను విడిచి వాకిలి వైపుకొచ్చాడు. ఎవరూ లేరు.

పెద్దమామ ధాన్య గిడ్డంగిలోనుంచి చూడగలడు. చూడనీ. కొట్టి తరిమినా అప్పాజీ మళ్ళీ ఆ యింటికే వచ్చాడు.

తోట గదికి వెళ్ళాడు.

కూటములో వున్న ఒక గుమ్మములో ఎవరో కనబడ్డారు. చూస్తుండగానే ఆ రూపం కనుమరుగైపోయింది.

అప్పాజీ నడవలోపలికి వెళ్ళి దగ్గరున్న మేజామీద పుస్తకాల సంచి పెట్టాడు

"ఎవరది?"

"నేనే."

మనస్సు మధనపడింది. రోషం ఉండాలి. ధైర్యస్థుడైన తండ్రికి పుట్టిన కొడుకతను.

పెద్దమ్మ అక్కడికి వచ్చింది. భాస్కరుని తల్లి. నిర్వికారమైన కంఠంతో ఆమె,

"ఏమిరా?" అన్నది.

అందుకేమీ చెప్పాలని తోచలేదు అతనికి. ఒక నిముషం ఆలోచించిన తర్వాత,

"అమ్మమ్మని చూడాలి?" అన్నాడు.

అప్పుడు మాళు గుమ్మం దగ్గిరికి తొంగిచూసి లోపలికి వెళ్ళి పోయింది.

"అప్పణీ...."

దక్షిణపు గదిలో నుంచి వచ్చింది అమ్మమ్మ. నిస్సంకోచంగా చిత్రాలంకారములు చేయబడిన ఆ ద్వారబంధందాటి లోపలికి వెళ్ళాడతను.

అమ్మమ్మ దగ్గిరకెళ్ళి నిలుచున్నప్పుడు గుండెలు దడదడ కొట్టుకున్నాయి. అతని తలను, ముఖమును, నిమురుతూ అమ్మమ్మ

"ఎన్నోరోజులుగా నిన్ను చూడాలని కాచుకొని వున్నాను" అంది.

అప్పణి అమ్మమ్మతో లోపలికెళ్ళాడు. తంగేడత్తి ఉత్తర గదిపార్శ్వములోకి పోయేటప్పుడు అతన్ని చూసింది. ఎందుకు అట్లా చూస్తున్నది? ఈర్ష్యనా?

పెద్దమ్మ కోపంతో రెండు సార్లు అటూయిటూ తిరిగిపోయింది. పెద్ద మామ వచ్చాక ఆయనే అడుగుతారు అంతా. తేలిపోతుంది అని ఆమె ముఖ భావమే చెబుతున్నది. ఆ మాటే గట్టిగా అన్నది.

దానికి ఎవరూ జవాబివ్వలేదు. దాంతో ఆమె అప్పణి వైపు తిరిగి గొంతు సవరించుకొని,

"వొరేయ్, నాకంట్లో పడవద్దని చెప్ప లేదు. మునుపు జరిగిన సంఘటన మరచిపోయావా?"

"మరువలేను."

"మరి ఎందుకురా.నువ్విక్కడికి వచ్చింది?"

అప్పణి ముఖం నల్లబడింది.

"పెద్దమ్మామ కంట్లో పడకుండానేవెళ్ళిపో."

"నేనుపోను."

"ఏమీ?"

"నేను పోవడానికి రాలేదు."

తల వెంట్రుకలను ముడివేసుకొని పెదమ్మ ఏదో గొణుక్కుంటూ అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

అప్పణి అమ్మమ్మ ముఖాన్ని తిరిగి చూశాడు. ఆ ఎండిన ముఖం, నెరసిన వెంట్రుకలు, తెల్లబడిన కళ్ళు, శోకపూరిత చూపులు, ఎదురవగానే అతని స్వరం తగ్గిపోయింది.

"నేనిక్కడ వుండాలని వచ్చానమమ్మా."

ఆ ప్రశ్నకి అతను ఎంతో సమాధానం ఎదురు చూశాడు.

కాని ఆమె ఒక మాట మాత్రమే "వుండు" అన్నది.

అమ్మమ్మ పండిన శరీరాన్ని ఒక్కసారి కౌగలించుకుని ఏడవాలని పించింది.

పెద్ద మామ కొన్ని రోజులక్రితం భార్య పుట్టింటికి వెళ్ళాడు. ఈ రోజో రేపటికో తిరిగి రావచ్చును. వచ్చాక ఏమవుతుందో అని అందరికీ భయంగా వుంది. భయం కలవరం ఆ యిల్లంతా వ్యాపించినట్లు వుంది.

మాళు కృష్ణకుట్టిని కనిపెట్టివుంది. పెద్దమామ వచ్చిన వెంటనే అతనే విషయమంతా చెబుతాడేమో. పెద్దమామ దగ్గిర అతను నిర్భయంగా మాట్లాడ గలడు. పెద్దమామకు అతనంటే కాస్త గారాబం ఎక్కువ. ఉత్తరాది వారింట్లో పెద్దమామకు తెలియకూడదని ఏదైనా ఒకవిషయాన్ని చెబితే, అది అవగింజ పేలినట్లు పెద్దమామ ధాన్య గిడ్డంగి వరకు పాకిపోయేది.

అప్పుణికి కాస్సేపైన తర్వాత ఒక విశ్వాసం కలిగింది. అనవసరంగా అతను దేనికీ భయపడేవాడుకాడు. మామయ్య రానీ, తిట్టనీ, కొట్టనీ ఇంకా ఏం కావాలో చేయని, అతను బెదిరించి వెళ్ళిపొమ్మని చెప్పినా తను వెళ్ళి పోకూడదు అనుకున్నాడు.

పెద్దమామ రావడం లేదేమిటి?

ఆఖరికి పెద్దమామ వచ్చాడు ఆసాయంత్రం. అతనితో అమ్మిణి కూడా వచ్చింది. అప్పుణి ఇంట్లో వున్న సంగతి కాస్సేపు అయిన తర్వాతనే పెద్దమామకు తెలిసింది,

"ఎవరే అక్కడున్నది."

వాకిటో నుంచి భయంకరమైన గర్జన వినపడింది.

అందరూ నట్టింట వాకిట చేరారు. అమ్మమ్మ, పెద్దమ్మ, మీనాక్షమ్మ, చిన్నత్త, మాళు, అందరూ అక్కడే వున్నారు.

"నామాటల్ని అలక్ష్యంచేసే ధైర్యం ఎవరికుంది?"

ఎవరూ ప్రత్యుత్తరం యివ్వలేదు.

- "ఆ కుర్రాడెక్కడే?"

అప్పుడు అప్పుణి మెల్లిగా నడవలోకి వచ్చాడు. శరీరం వణుకుతోంది, అతన్ని చూడగానే చెప్పులు వదలి, పెద్దమామ నడవలోకి వచ్చాడు.

"నీతో నేను........"

పెద్దమామకు అప్పుణికి మధ్యగా అమ్మమ్మ వచ్చి నిలబడి గట్టిగా,

"కుంజి కృష్ణా!" అని అరిచింది.

"దూరంగాపో అతని పేగుల్ని నేను చింపి........"

అమ్మమ్మని కొట్టి దూరంగా తోసేసి పెదమామ తన ముందు నిలచిన అప్పుణి దగ్గరకు వచ్చినప్పుడు అప్పుణి ధైర్యమంతా కూడగట్టుకొని

"నన్ను ముట్టుకోకు "అన్నాడు.

"తాకితే ఏమిరా? "అతని మెడమీద ఛెళ్ళున దెబ్బపడింది. మళ్ళీదెబ్బ పడుతుండగా' దక్షిణ గదిలో నుంచి ఒక గొంతు బిగ్గరగా వినపడింది.

"ఆ పిల్లాడిని కొట్టకు."

పెదమామ వెనుకకు తిరిగాడు. రౌద్రాకారపు దృష్టితో చూసినప్పుడు అక్కడున్నది అల్లుడు.

కుట్టన్‌మామ నడవలోకి వచ్చి,

"ఆ కుర్రాణ్ణి ముట్టుకోకు, నేనే చేప్పేది" అన్నాడు.

పెద్దమామ చేతులు క్రిందకి వాలాయి.

"నువ్వెవర్రా నాకు చెప్పడానికి?"

"ఎవరైతే ఏం. ఎవరినైనా అనుకో. అతని మీద చెయి చేసుకోవద్దని చెబుతున్నాను. చేసుకుంటే దానికి ఫలం దొరుకుతుంది."

పెద్దమామ అల్లుని వైపు తిరిగి నిలబడ్డాడు.

"ఛీ....నువ్వేమిటిరా యింత పెద్దవాడైపోయావు?"

అప్పుడు చిన్నమామ ఉచ్ఛస్థాయిలో.

"పెదమామ! పెద్దవారని నేను చూడలేనింక" అన్నాడు.

పడగ ఎత్తిన పాములాగా నిలుచున్న పెద్దమామ తల క్రిందికి వాల్చారు.

పెద్దమ్మ, మీనాక్షమ్మను, చిన్నత్తను, తంగం, ఒకరినొకరు చూచుకున్నారు.

ఏం చేయాలో తెలియక పెద్దమామ కాస్సేపు నిలబడ్డాడు. దాంతర్వాత వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

"కాలం మారిపోయింది. ఈ ఇంట్లో ఎన్నడూ ఇలా జరిగినది లేదు." అంటూ వెళ్ళిపోయారు.

సాయంకాలం అప్పుణి తూర్పుగదిలోకి వెళ్ళికూర్చున్నాడు. నట్టింటి పెద్ద దీపపు వెలుగు అక్కడ పడటంలేదు. గది చీకటిగానే వుంది. విడిగా కూర్చున్నప్పుడు ఆ ఉదయం జరిగిన సంఘటనలు ఒక్కొక్కటిగా మనసులోకి రాసాగాయి. ఆ ఒక్కరోజు ఒక్క సంవత్సరం గడిచినట్లు తోచింది. ఇంతలో ఆ చీకటిలో ఒక నీడ తన దగ్గిరకు వచ్చినట్లు అనిపించింది.

"అప్పుణీ!"

అతనికి ఎవరో తెలిసింది, అమ్మణి.

అప్పుడు తను తన వెనుక మెడ ప్రక్కన ముట్టుకు చూసుకున్నాడు. బాధ ఎక్కువగానే వుంది.

"అప్పుణీ, చాలా నొప్పిగా వుందా?"

తనంటే అసహ్యం. అందుకని కూతుర్ని పంపాడు., మాట్లాడేందుకు.

"ఏమిా, అప్పుణి మాట్లాడవేం?

అప్పుడు ఇంట్లోంచి పెద్దమ్మ పిలుపు....

"అమ్మణి కుట్టీ...." అని పిలవటం వినిపించింది.

అమ్మణి వేగంగా వెళ్ళిపోయింది.

చిన్నమామకు, భాస్కరునికి, కృష్ణన్ కుంజుకు, చిన్నాయనకు ఆకులు వేసి వడ్డించినప్పుడు మాళు అతన్ని కూడా వచ్చి పిలిచింది.

వంట గదిలో నాల్గు కుట్టుడాకులు ఒక చిన్న అరటి యాకు ప్రత్యేకంగా వేశారు. అది అతనికోసం ప్రత్యేకంగా వేయబడింది.

ఉత్తర పార్శ్వపు కూటములో నుంచి వెలుపలకి పోవుదారిన ఒక చిన్న గదిలో అతనికి ఒక చాప ఇచ్చారు.

ఇల్లంతా చీకటి, నిశ్శబ్దం అలుముకున్నాయి. ఆ చీకటిలో ఆ మూల గదిలో ఒంటరిగా పడుకున్నప్పుడు భయం ఎక్కువైంది. చచ్చిపోయిన వారి ప్రేతాలు ఆ చీకటిలో సంచరించి మిద్దెమిాదకి పోతున్నట్లు కాలి గజ్జల శబ్దము, నడుస్తున్నపుడు నడుములో కట్టిన పూసల శబ్దములు, వినపడుతున్నాయా? ఈవిధంగా తనలో తాను ఆలోచిస్తూ అలసిపోయిన తర్వాత అతను నిద్రపోయాడు.

ఆ వుదయం భాస్కరుడు, కుంజుకృష్ణుడు గంజి త్రాగడానికి వెళ్లి

నప్పుడు అమ్మమ్మ అతన్ని కూడ పిలిచింది. కాలులేని ఒక పీఠముపై అతను ఒక కంచము ఎదుట కూర్చున్నాడు.

బడికి అప్పుణి ఉదయమే వెళ్లేందుకు సిద్ధమయాడు. బండిలో వస్తున్న వారికోసం అతను కాచుకోలేదు. పోయేటప్పుడు అమ్మమ్మ గది గడపవద్ద నిల బడి,

"అమ్మమ్మా, నేను బడికి వెళ్లుతున్నా!" అన్నాడు.

మెట్లు దిగినప్పుడు, నేంద్ర అరటి తోటలో అడ్డంగా పోయేదారి పూమాన్‌తోడు చేరితే, అక్కడనుంచి యజ్ఞేశ్వరుని మందిరము ముందుకు ఉండేబాటకు త్వరగా వెళ్లిపోవచ్చు అనుకున్నాడు.

అది దగ్గిర దారి.

సాయంకాలం బడి విడిచిన తర్వాత ఇంటికి వచ్చేప్పుడు వాకిట్లో పెద్ద మామ తిరుగుతున్నాడు. అప్పుణిని చూసి కూడా చూడనట్లు ముఖం తిప్పుకొని, వాకిలిమెట్లు ప్రక్కన పశ్చిమ మైదానం వైపు చూస్తూ నిలబడ్డాడు.

దక్షిణవైపు కూటానికి వెళ్లినప్పుడు పెద్దమామ మాటలు వినిపించాయి.

"ఈ ఇంటికి వినాశం పట్టుకుంది. శుచీ, జాతి నశించాయి. మంచీ చెడ్డా అసలే లేవు. భగవతీ! మహాశక్తీ! ఇహ నువ్వే మమ్మల్ని అనుగ్రహించాలి.

ఆ రోజు మీనాక్షమ్మ ఉపదేశించింది. బడి విడిచి వస్తున్నప్పుడు ఉత్తర నడవ దారిగుండా అతను లోపలికి రావాలి. స్నానం చేయకుండా ఎవరూ మిద్ద ప్రక్కకి పోకూడదు.

రాత్రి భాస్కరుడు, కృష్ణన్ కుట్టి యిద్దరూ వరండా మిద్దె పైనున్న వారి గదిలోనే చదువుతున్నారు. అన్నం తినడానికి మాత్రమే, క్రిందికి దిగి వచ్చే వారు. గడపలోపలుండే పెద్ద దీపస్తంభపు వెలుగులో వెళ్లి కూర్చుని పుస్త కాన్ని తెరిచాడు అప్పుణి. కాని పుస్తకములో మనసు లగ్నంకాలేదు. ఈ ఇంట్లో కొక్కక్కరూ ఒక్కో విధంగా చెబుతున్నారు.

ఉదయం ధాన్య గిడ్డంగి తెరిచి వడ్లు కొలిచే రోజు. వారానికి ఒక్క రోజు గిడ్డంగిని తెరచి వడ్లు కొలిచి, ఇంటికని ఇచ్చేవారు. అలవాటు ప్రకారం మీనాక్షమ్మ గంప ఎత్తుకొని గిడ్డంగిలోకి వెళ్లినప్పుడు పెద్దమామ,

"ఇక్కడ వ్యవహారం నడిపేవాడున్నాడు కదా? అతనే ఇవ్వనీ వడ్లు."

మీనాక్షమ్మ ఊరికే నిలబడి వుండటం చూసి పెద్దమామ మళ్లీ,

"ఒక వడ్లగింజైనా నేనివ్వను. మీకు ఓ పాఠం నేర్పుతాను" అన్నాడు.

లోపల పెద్దమ్మ ఏడవటం మొదలెట్టింది.

చిన్నమామ వచ్చాక విషయం అతనికి తెలిసింది. మాళు ఆమె తండ్రి వద్దకెళ్లి వివరాలు చెప్పింది. చిన్నమామ తిన్నగా గిడ్డంగి ప్రక్కకెళ్లినప్పుడు అమ్మమ్మ అడ్డుగావచ్చి నిలబడింది. అప్పుడు చిన్నమామ,

"ఇంతకాలం నేనేమీ నోరు తెరవలేదు. ఇప్పుడిహ నాకు అధికారం వున్నదీ లేనిదీ తేల్చుకుంటాను."

గిడ్డంగి ప్రక్కన గుమ్మంలో కలహం ప్రారంభమయింది.

"గిడ్డంగిని నేను తెరవను. నీ వెవరా? నాకు సలహా ఇచ్చేందుకు?"

మాళు పెద్దమ్మ, చిన్నత్త అందరూ బైట వరండాలో నిల్చుని శ్రద్ధగా వింటున్నారు.

"నేనా? నేనీ ఇంటి మగవాణ్ణి. రేయిపగలు నా రక్తాన్ని నీరుగా కార్చి కష్టపడగా వచ్చిన వడ్లు ఇక్కడ వున్నాయి."

అంత మాత్రమేకాక పెద్దమామ భార్య పుట్టింటిని గురించి ఏదో అన్నాడు.

పెద్దమామ గిడ్డంగిని తెరవలేదు. చిన్నమామ గాదిలోకి దిగి అక్కడ ప్రత్యేకంగా పెట్టి వుంచిన విత్తన వడ్లెత్తి కొలిచి యిచ్చాడు. మీనాక్షమ్మ అది తీసుకొని వెళ్ళడానికి సంకోచించినప్పుడు ఆమెని అదిలించాడు చిన్నమామ.

"తీసుకొని పొమ్మనికదా చెప్పాను." అని బిగ్గరగా అన్నప్పుడు కొలిచిన వడ్లను తట్టలో పోసుకుని మీనాక్షి, మాళు సహాయంతో ఎత్తుకుని లోపలికి వెళ్ళిపోయింది,

విత్తనాలకుంచిన వడ్లను తినే సమయం వచ్చినందుకు అమ్మమ్మ చాల విచారపడింది.

చిన్నమామ అమ్మమ్మతో ఇలా అన్నాడు.

"దీనికేదయినా ఒక ఒప్పందం ఏర్పాటు చేసుకోవాలి. లేకుంటే నాకు నా వాటా ఇచ్చితీరాలి. నేను ఈ విషయమై ఒక నిశ్చయానికి వచ్చాను."

ఈ తగవులు వచ్చే సమయం వస్తుందని కుట్టన్ నాయరుకి ఎప్పుడో తెలుసు. కాని అది ఇంత త్వరగా వస్తుందని అతను ఊహించలేదు.

పదిహేను, పదహారేళ్ళ నుంచి శ్రమపడుతున్నాడు. పంట పనులకు

తాను పోవటం ప్రారంభించి ఇరువది ఏండ్లకాలమయింది. కాని ఈ నాటికీ ఒక మంచి బట్ట కట్టి ఎరగడు బయటికివెళ్లి ఒక కప్పు టీ త్రాగడానికి కూడ డబ్బులేదు. ఒక సంవత్సరానికి నాలుగు పంచలు, రెండు తుండ్లు, అయిదు కలియడు వడ్లు దొరుకుతాయి. ఆ యింట్లో పనిచేసే ఇతర పనివాళ్లకు ఓణం పండుగ, విషూ ఉత్సవం, అరుద్ర వచ్చినప్పుడు ప్రత్యేకంగా ఒక నూతన వస్త్రం, వడ్లు, కొబ్బరికాయలు, నూనె మొదలైనవి యిచ్చే అలవాటు. ఇట్లా కానుకలు తీసుకునే పనివాళ్ళు యితరుల ఇంటికి పనికి పోవడానికి అధికారం లేదు. తనదీ ఇటువంటి స్థితియే అని తలపులు వచ్చినప్పుడు జుగుప్స కలిగిందతనికి.

పెద్ద ఇంటివాడనే పేరు మాత్రం విశేషం, గొప్పతనము! దీనివల్ల ఏమిలాభం?

మాళుని గురించి ఆలోచించినప్పుడు అతనికి ఇంకా దుఃఖం కలిగింది. ఇక రెండు, మూడు సంవత్సరము లయ్యాక మాళుకి యుక్త వయస్సొస్తుంది. మెడలో, కాళ్ళకు ఏదైనా చిన్న నగకూడలేదు. దానిని ఇంట్లో ఒకపనిగత్తెలాగా కదా భావిస్తున్నారంతా. ఉదయం, సాయంకాలం మాళు మోయలేనన్ని బిందెలు నీళ్లుతీసుకురావటం తను నిత్యం చూస్తూనేవున్నాడు. ఆమె ఆ ఇంట్లో పనిచేయడం అతను చూడలేకపోతున్నాడు. ఇంట్లో పెద్దమామ కూతురు కూడా వుంది. మేడమీంచి కిందికి దిగదు. అక్కయ్యకి ఒక ముద్దుల కూతురుంది. పనసపండు తొనతీయడంకూడ తెలియదు. అన్నిపనులు చేయడానికి మీనాక్షి, మాళు ఉన్నారుగదా? మిగతా వారికేం పట్టింది?

ఇవన్నీ చూసి సహిస్తూనే వున్నాడతను. ఎలాగయితేనేం ఆవేళ బాంబు ప్రేలి ఒక విషయం అటో ఇటో తేలేందుకు అవకాశం ఏర్పడింది. అప్పుణి రావటం అతనికి తెలియదు. అప్పుణిపై అతనికేదీ విరోధమూలేదు, విశ్వాసమూ లేదు. అయితే అంతకు ముందు ఒకసారి అతన్ని మెడపట్టి బయటకు తరిమిన సంగతి తెలిసి చాలాబాధపడ్డాడు. అతనూ ఒక మనిషేకదా? ఆ ఉత్తరాదివారి ఇంటి పురుషుడే అతను. అతని తరఫున అడగడానికి, చెప్పడానికి ఎవరూ లేరనీ———

మళ్ళీ మాళు జ్ఞాపకం వచ్చింది. మనుష్యుని ఆయుషు ఎంత? ఈ రోజు

కన్నుమూసుకుంటే రేపు మాళ్ళు గతి ఏమిటి? ఆమెను కొట్టి తరిమివేస్తారేమో! ఆమెకు ఇక్కడ ఎటువంటి అధికారమూ లేదుకదా.

ఒక సాయంకాలం ఇంటికివెళ్లి చూసినప్పుడు ఒకదృశ్యం ఎదురయింది. ఆ పిల్లవాడు ప్రాణాలతో మిగిలేట్లు కనపడలేదు. అంతవరకు అణిగివున్న కోపం రెచ్చిపోయింది. కలహం ప్రారంభమయే సమయం వచ్చినట్లు నాయరుకి తోచింది. వడ్లు కొలిచి ఇవ్వరాదనేదే, పరిస్థితిలో మార్పులేదు. గిడ్డంగిని మూసి తాళం వేసుకొని తాళం చెవిని తీసుకొన్నాడు. వడ్లు అమ్మకానికి ఏర్పాటు చేస్తున్నారని విన్నాడు. చూద్దాం. అన్నానికి కావలసిన వడ్లను అమ్ము కోవడమా !

"ఉత్తరాదివారి ఇంటిలో ఒకనికి మాత్రమే సర్వ స్వతంత్రమును, సకల బాధ్యత ఉన్నవి కదా ఇప్పుడు. ఇకచూద్దాం." అనుకొన్నాడు.

## ఐదు

నాలుగైదు రోజులైంది వర్షం కురవడం ప్రారంభించి. పిడుగులు, మెరుపులు గాలి ఏవీ లేవు. విడవకుండా వర్షం. అంతే ఒక చిన్న నల్లమేఘం కూడ ఆకాశంలో కన్పించటంలేదు. కనపడితే చాలు పోతగా వర్షం కురుస్తుంది. వర్షం తగ్గగానే మరో నల్లమేఘం ఆకాశంలో కనపడేది.

నీళ్లు నిలచిన ప్రదేశంలో చినుకులు పడేటప్పుడు బుడగలు ఏర్పడటం, అవి నీళ్ళలో కలసిపోవటం పారుకుట్టి చూస్తూకూర్చుంది. ఇప్పుడు పారుకుట్టి పనికెళ్ళడంలేదు. వర్షం మూలాన వడ్లు ఎండవేయటం, ఉడకవేయటం, దంచడం మొదలగు పనులేమి లేవని కుంజాత్తోలు చెప్పి పంపించేశాడు.

వర్షానికి తడిసిన తోటలోని చెట్లనుంచి ఒక్కొకక్క బొట్టుగా వర్షపునీళ్లు కారుతున్నాయి.

సాలెగూడులోని వలలోలాగ మొక్కల చెట్ల అడుగుభాగమున అడుసు, బురద పేరుకొనిపోయున్నాయి. బాటపైనే దృష్టి సారించిన పారుకుట్టి ఏదో ఆలోచిస్తోంది. అప్పుణి రావడం లేదే!

రాడా? అతను ఇక ఎన్నటికీ రాడా?

అతను వెళ్ళగానే బడి విడిచిపెట్టాక, కోపం తగ్గి తిరిగి ఇంటికి వస్తాడనే ఆమె అనుకున్నది. సాయంకాలమైనా అతను రాలేదు. ఎవరెవరినో అడిగింది. అతన్ని చూసినవారెవరూలేరు. ఏడుస్తూ సాయంత్రం రోడ్డెక్కింది, అతన్ని వెతకడానికని, కొంచం దూరం వెళ్ళింది. తోటలు, అంగడిదాటి ఆ ప్రక్కనున్న మామిడితోట వద్దనున్న ఖాదర్ ఇంటికెళ్ళి అడిగితే తెలుస్తుందన్న ఆశతో ఆమె అక్కడకు బయలుదేరింది. ఖాదర్ మాప్లజాతివాడు. అతని కొడుకు మహమ్మదు కూడా అప్పుణి చదివే తరగతిలోనే చదువుతున్నాడని తెలుసు ఆమెకి. అంతలో చీకటి పడింది. చీకటిలో బయటకు వెళితే మళ్లీ రావడం శ్రమతోకూడిన పని. అయినా అంత చీకటిలోను పరుగులాంటి నడకతో వెళ్లింది. కలతపడ్డ మనసుతోనే చకచక నడిచింది. ఖాదర్ మాప్ల కొడుకును అడిగితే అతను అప్పుణిని ఆరోజు బడిలో చూడలేదని చెప్పాడు.

గుండెలపై చేతులు పెట్టుకొని———

"అయ్యో, నాయనా! అప్పుణీ!" అనుకొంది.

ఇంటికి వచ్చి దీపం వెలిగించి మళ్ళీ కొడుకుకై ఎదురుచూస్తోంది.

శంకరన్ నాయరు వస్తే అడుగుదా మనుకొన్నది. శంకరన్‌నాయరు ఆ దారమ్మట రానేలేదు. అతను ఇంటికే రావడంలేదు. ఇహ అతను యిక్కడికి రాడు. తను పనిచేసే యజమాని యింట్లోకూడ అతను కనపడటం లేదు.

తన కష్టాన్ని చెప్పుకునేందుకెవరూ లేరు. సమయానికి ముత్తాచి కూడా లేదు. చిన్నదీపం వెలిగించి ఆలోచిస్తూ పడుకుంది. "అతను రాడా?"

ఎప్పుడు తెల్లవారిందో ఆమెకు తెలియులేదు.

తర్వాత ముత్తాచి వచ్చింది. ఆమె ద్వారానే తెలిసింది. అప్పుణి ఉత్తరాదివారింట్లో ఉన్నాడని. ముత్తాచికి చక్కమ్మ చెప్పింది. చక్కమ్మకు సైదాలి కుట్టి చెప్పాడు.

అప్పుణి ఉత్తరాది వారింటికెళ్లాడా? అక్కడ అతన్ని అవమానించారు కదా! అక్కడకెళ్లి వుండకూడదు.

పనికి వెళ్ళినప్పుడు ఆ యింటి కూతురు అడిగింది. "నీకొడుకు వచ్చాడా? పారుకుట్టీ!"

"వస్తాడ" ని మాత్రమే చెప్పింది. ఒక వేళ అక్కడున్న వారికి తెలుసేమో - అప్పుణి కోపంతో వెళ్ళిపోయిన సంగతి.

సాయంకాలం వేళలోనే ఆమెకు ఎక్కువ వేదనగా వుండేది. వర్షాలు కురవడం ప్రారంభంఅయాక తొందరగా చీకటిపడుతుంది. తోటలోనీళ్లు ఇంకా అల్లాగే నిలిచి వున్నాయి. ఏదో చెప్పలేని భీతితో ఆమె మనసు నిండిపోయింది. రాత్రిళ్లు ముత్తాచి వచ్చి తోడుకి పడుకునేది. పడుకున్న వెంటనే ముత్తాచి నిద్రపోయేది. వీధి తలుపులు మూసివుంటే అమెకు నిద్రరాదు. వసారాలో ఏదైనా శబ్దం అయితే చెవులు రిక్కించుకుని వినేది. ఒక్క రాత్రికూడ అప్పుణి రానేలేదు. కానీ ఏదైనా సందడి వినిపిస్తే ఎవరో వస్తున్నారని చూసేది.

ఈ వర్షంలో అతను బడికి వెళుతున్నాడా? గుంటలలో నీళ్లు పొంగి పొరలు తున్నవి కదా! పడవలు ఆపివేసి మూడురోజులులైనదని అమీనా అమ్మ చెప్పిందే!

ఇంకా రెండురోజులు వర్షముకురిసిందంటే వరదలు ఎక్కువవుతాయి అని అమీనా ఉమ్మ అంగడినుంచి వచ్చేటప్పుడు చెప్పింది. ఇప్పటికీ గుంటలన్నీ నీళ్లతో నిండిపోయి ఉన్నాయికదా. జాగ్రత్తగా నడవకపోతే గుంటలో పడిపోవలసిందే. దేవుడా, ఆదారినేకదా బడికి పోవలసినది. అప్పుణి జాగ్రత్తగా పోతున్నాడా?

"భగవతీ రక్షించు తల్లీ...." పారుకుట్టి ఒక నిట్టూర్పు విడిచింది.

ఇంట్లో బియ్యం అయిపోయాయి. అమీన్ దగ్గర ఒక చారెడు బియ్యం అప్పుతెచ్చుకొంది. అందులో పిడికెడు బియ్యం మాత్రం వున్నాయి. రేపు రాత్రి దాక దానిని ఉంచుకొని గంజిత్రాగాలి. తర్వాత?

ఈ వాన తగ్గడంలేదు.

వర్షాలు ప్రారంభం అయినప్పటినుంచీ ముత్తాచి ఇక్కడే వుంటోంది. కాళ్లుజాపుకొని గూనిగ వంగి కూర్చునేది. అప్పుడప్పుడు వర్షాన్ని శపించేది.

"నాలుగుడుక్కులు వర్షం అన్నారే ఇంకా వర్షం కురుస్తున్నదే"

చలిగాలికి ముత్తాచి శరీరం వణికినప్పుడు తనలోనే సణుక్కునేది. ఇదే

మిటీ వర్షం నాశనానికే వచ్చింది. కలికాలం. కలికాలం. ప్రళయానికి ఇదే మొదలు.

తోట ప్రక్కనున్న కంచె ప్రక్కగా అమీన్ తాటాకు గొడుగు వేసుకొని వచ్చింది.

"పారుకుట్టమ్మా! ఏమైనా తెలిసిందా "

వర్షపు పోరులో పారుకుట్టికి ఏం వినబడలేదు.

పూమాన్ తోట వద్ద వరద వచ్చింది. ఇంకేమి గతి భగవంతుడా!

ముత్తాచి ఆలోచిస్తోంది

"ఇంకా విన్నావా ఉమ్మా!"

ఉమ్మ గొడుగుతో, తడికాళ్లతో వసారాలోపలికి వచ్చి అడిగింది.

"నీ తొంభైఏళ్ల వయసులో ఇటువంటి వరదలను చూసి ఉన్నావా?"

"చూసి ఉన్నానే. ఆకాలంలో సైదాలిఖండం పూర్తిగా వరదలలో మునిగిపోయింది. అప్పుడే నా తండ్రి వరదల్లో చనిపోయాడు.

ముత్తాచి ఆవరదలను గురించి కథగా చెప్పటం ప్రారంభించింది.ఆరోజు తోటలోనున్న ఇంట్లోకి కూడ వరద నీళ్లొచ్చేశాయి. ముత్తాచి ఆవు కూడ మునిగిపోయింది. ఉత్తర పార్శ్వపు ఇంటిలోనున్న ఒక స్త్రీ పనసచెట్టెక్కి కొమ్మపైకెక్కి కూర్చుంది. ఆమె బతికి బయట పడిన సంగతి చెప్పింది ముత్తాచి.

"ఉత్తరాది వారింటితోటలన్నీ మునిగి పోయాయి. వరదల్లో పాములు, పాము పిల్లలు వస్తాయేమోనని చెప్పుకొంటున్నారు. సామానులన్నీ జాగ్రత్త పరుచుకో "

వరదల గురించిన ఒక విషయం పారుకుట్టి తలపుకొచ్చింది. ఆ వరద సమయంలో అనేక ప్రాంతాలలోనున్న మనుష్యులు తమ సామానులను తీసుకుని ఉత్తర పార్శ్వపు ఇంటికి వచ్చారు. ఆ ఇల్లు తోట ప్రక్కనే వున్నా బాగా ఎత్తుగా కట్టినది. వరద నీళ్ళు ఇంట్లోకి రావు. అనేక మందికి మూడు రోజులు అన్నం పెట్టి, చలివేయకుండా మంట వేశారు.'ఆమెకు జ్ఞప్తి కొచ్చింది. ఎడ్ల పాకల్లోను, పశువులపాకల్లోను ఎంతమందో మాల, మాదిగలు యింత తల దాచుకునేందుకు వచ్చారు. మూడు రోజుల తర్వాత వరదలు తగ్గనారంభించాయి

ఆ వరదల్లో ఒక ఏనుగు కొట్టుకొని పోవటం, దానిని కురన్నూరుకు చెందిన ఒక మాప్లవాడు పట్టి, వంతెన పక్కనుంచి గట్టెక్కించడాన్ని తన

కళ్లతో చూసినట్లు ముత్తాచి అమీన్ ఉమ్మతో చెబుతోంది. ఉమ్మ ఆశ్చర్యం ముతో వినేది. ఆ వరదల్లో కొందరికి డబ్బుల పెట్టెలు. పాత్రలు దొరికిన కథలు, వరదలు పూర్తిగా అణిగి పోయిన తర్వాత తనయింటి పొయ్యిలో పాములు పడగెత్తి ఆడిన కథలు చెప్పేది.

ఆ ప్రాంతం వారందరికీ ఆందోళనగా వుంది. కొందరు గుంట ప్రక్క తోటలో కాపురమున్నారు. ఆప్రాంతం చుట్టు నీరు నిండిన సంగతి ఎవరకీ తెలియలేదు. ఆషాఢమాసంలోను ఆశ్వయుజ మాసంలోను ఆ గుంటలు నీళ్లు నిండివుండేవి. కానీ ఈ మాటు అంత భయంకరంగా వచ్చినది లేదు. గత సంవత్సరం పూమాన్ తోటలో వరద ఎక్కువవుతుందేమోనని భయం వేసింది కాని వర్షం నిలిచి పోవటం వల్ల, బాగుగా ఎండలు కాసినందువల్ల భయంలేకపోయింది.

ఆ తోటప్రాంతం అంతా పంట సమృద్ధిగా పండింది. వరదలు రోడ్డు దాటి వస్తే పంటంతా నీటిపాలే. నీటిమట్టం తగ్గకపోతే కష్టం శ్రావణ మాసం లో కోతలుకోసి ఎండబెట్టి తూర్పారబెడితే అంతా ఊకగానే కనబడుతుంది బియ్యం సరిగ్గా వుండవు. గుంట ప్రక్కనున్న పొలం అంతాఇసుక మయంగా వుంటుంది. పొలాన్ని కౌలుకుతీసుకుంటే. పొలంలోని ఇసుకంతా తీయటానికి పొలం కొనటానికి ఎంత ఖర్చు పెట్టాలో అంతా ఖర్చు పెట్టాలి.

తోటలోను, అంగడిలోను రోడ్లలోని జనమంతా భయపడిపోయారు

మధ్యాహ్నంన్నానికి వాన పూర్తిగా నిలిచిపోయింది. ఆకాశం నిర్మలంగా ఉంది. మనసులు కుదుట బడ్డాయి. అందరికీ రెండురోజులు బాగా ఎండ కాసిందంటే చాలు గట్టెక్కినట్లే.

కానీ సాయంకాలం అరయేటప్పటికి ఆకాశంలోని మేఘాలన్నీ దట్ట మయ్యాయి. ఫిడుగులు పడ్డాయి. ఒక్కసారిగ వర్షం కుండపోతగా కురిసింది. దానికి తోడుగా బలమైన పెనుగాలి కూడ వీచసాగింది.

ముత్తాచి పడుకొని తనలో తనే అనుకోసాగింది. "గాలి వీచటం మంచిదే. గాలిలో వచ్చేవాన ఎక్కువసేపు కురవదు."

అయితే పారుకుట్టిమనసు ఈ విషయమై ఆలోచించటం లేదు. అప్పణి ఎక్కడున్నాడు? ఉరుములు మెరుపులు వచ్చినప్పుడు అతనేమిచేస్తున్నాడో? ఇవే ఆలోచనలు ఆమె మనసులో.

చీకటి ఆకాశాన్ని కప్పేసింది. మేఘాలు అడవి బూచులు తిరుగు తున్నట్లుగ కానవస్తున్నాయి. చినుకులు పడుతున్నాయి. ఆ కటిక చీకట్లో కళ్లను మిరుమిట్లు గొలిపే విధంగా మెరుపులు మెరిశాయి. తలపైనే పడినట్లని పించింది పిడుగు మ్రోత ఒకటి.

"నారాయణ.... నారాయణ...." ముత్తాచి జపం చేయటం ప్రారంభిం చింది. ఎత్తి పెట్టిన తడికను వాల్చి కిటికీ తలుపులను మూసేసింది పారుకుట్టి.

గాలి వేగంగా వీస్తున్నది. జుయ్యని అరటి చెట్లు ఆడుతున్నట్లు శబ్దము వినపడుతోంది.

గాలివాన ఎక్కువైంది. గాలి, వాన రెండు తమలో తాము పోటీపడు తున్నట్లున్నాయి. పడమటి దిక్కునుంచి వర్షం ఎక్కువ అవడానికి సూచనగా భయంకరమైన శబ్దం వినబడింది.

కిటికీని మూసిన తడిక కంతల్లోనుంచి చూస్తే అంతా అంధకార మయంగా ఉంది. ఆకాశంలో పిడుగుల మ్రోత, వర్షపు పోరు, తోటలో అటూ ఇటూ ఊగుతున్న అరటిచెట్లు వేగంగా వీచేగాలి, ఇవన్నీ ఆమెకేదో భయాన్ని కలిగించాయి. కిటికీలోనుంచి ఆ చిమ్మచీకటిని చూడ ప్రయత్నించి నప్పుడు ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపు వెలుగులో తల విరబోసినట్లున్న వృక్షములను చూసింది. మళ్లీ అంధకారం.... అంతా చీకటిమయం.

"తుఫానుగాలిలో చూస్తావెందుకు?" ముత్తాచి కళ్లు తెరవకుండానే అడిగింది.

పారుకుట్టి దీపం వెలిగించి, గాలి రాని చోటులో పెట్టింది.

ముత్తాచి కళ్ళు మూసుకొని పడుకొని, అతి త్వరగా జపంచేయనారం భించింది

తోటలో కొబ్బరిమట్ట ఒకటి విరిగిపడ్డ శబ్దము వినపడింది. ఇంకా కొంచెంసేపట్లో వాకిట్లోవున్న ములగచెట్టు ఒకటి విరిగి అరటిచెట్ల మధ్యపడిన శబ్దముకూడ వచ్చింది.

ముత్తాచి కళ్లు తెరిచింది. భయంతో ఆమెకు చలించినట్లయినది.

"పారుకుట్టీ! మనమీసారి బ్రతికి బయట పడుతామా?"

"ఎందుకు భయపడతావు ముత్తాచీ!"

"నారాయణ. నారాయణ. నారాయణ...."

కిటికీలోంచి వస్తున్న గాలి చిన్న దీపాన్ని ఆర్పివేసింది. ముత్తాచి చేస్తున్న నామజపం ఉచ్ఛస్థాయికి పోయింది.

బయటవైపు గోడ ప్రక్కనుంచి ఏదో శబ్దము పారుకుట్టికి వినిపించి నట్లయింది. "ఏమాశబ్దము?" ఆశబ్దమును ఆసక్తిగా విన్నది. అవును, ఎవరో పిలుస్తున్నట్లుంది.

"బయట ఎవరో పిలుస్తున్నట్లుంది. ముత్తాచీ."

ముత్తాచి కళ్లు తెరచినా నామజపంచేస్తూ అక్కడే పడుకున్నది.

బయట వినిపించే గాలిపోరుశబ్దముకంటే ఆమె నామజపం పారుకుట్టికి విపరీతమైన భయాన్ని కలిగించింది.

సందేహంతో నడిచివెళ్ళి తలుపు కొంచెంగాతెరిచింది.

అప్పుడక్కడ అరుగుప్రక్కగా తడిసి చలికి వణుకుతూ నిలబడి వుంది అమీన ఉమ్మ. ఒక చేతిలో తాటాకుగొడుగు, రెండవ చేతిలో లాంతరు ఉన్నవి.

"పారుకుట్టమ్మా ఏంచేటుతేనున్నదో ఈ వర్షం"

"ఏం ఉమ్మా?"

అమీన ఉమ్మ శరీరంనుంచి నీళ్లుకారి అరుగంతా తడిసిపోయింది. ఆమె చలితో వణుకుతున్నది. ఏడుస్తున్నదికూడ.

"ఇప్పుడే మా ఆయన ఇంటికి వచ్చాడు. త్వరలోనే రోడ్డంతా నీటిలో మునిగిపోతుందట. ఇల్లు ఖాళీచేసివెళ్లిపోవాలిట."

"ఎక్కడికి పోగలవు ఉమ్మా"

"ఎక్కడికైనాసరే కొండ ప్రక్కన ఎవరింటికైనా పోవాలి. నాకొడుకులు సామాన్లు సర్దుతున్నారు. ఆవులను గొర్రెలను ఏంచెయ్యాలో తెలియటంలేదు."

పారుకుట్టి అయోమయంగా నిలబడి ఉండటంచూసి ఉమ్మ దిగ్గరగా అడిగింది. "త్వరగా బయలుదేరు. ఆలస్యమైతే పరిస్థితి విషమిస్తుంది. భగవంతుడికే తెలుసు ఏమౌతుందో."

"నేనెక్కడికీపోను ఉమ్మా"

"నీకేం పిచ్చిపట్టిందా? వెంటనే బయలుదేరు, కుంర్లపువాళ్లు, పిల్లలు మేము అందరం పోతున్నాం. నువ్వుకూడా బయలుదేరు."

కంచె పక్కనున్న ఒంటిబాటలో లాంతర్ల వెలుగులో కొంతమంది మూటలతో వెళ్లడం ఆమె చూసింది.

"ఏం పారుకుట్టీ ఇంకా నిలబడి ఉన్నావేం?"

"నేనెక్కడికీ పోలేను ఉమ్మా. నువ్వు వెళ్లు."

"భగవంతుడా? ఏమిటీ ఈమె విననంటుందే?"

"నేను రాలేను. నువ్వు వెళ్లు ఉమ్మా."

కుంచె ప్రక్కనుంచి ఉమ్మ పెద్దకొడుకు పిలుస్తున్నాడు "త్వరగా రా అమ్మా."

"పారుకుట్టమ్మా"

"ఉమ్మా, ఉమ్మా. నువ్వెళ్లు. ముత్తాచిని కూడా నీతో వెళ్ళనీ...."

ముత్తాచి భయపడుతూ వసారాలోకొచ్చి వృద్ధాప్యం వల్ల వంగినిలబడింది.

"నాచక్కలాల డబ్బీ లోపలనే ఉంది." నడవలోకెళ్ళింది ముత్తాచి.

"ఏం మాట్లాడకు తల్లీ! ప్రాణంకన్న ముఖ్యమా ఏమిటి నీ చక్కలాల పెట్టె?"

వర్షపు పోరులో ఉచ్ఛస్థాయి గొంతుతో ఆమెను ఉమ్మ భర్త పిలిచాడు.

"ఉమ్మా, తొందరగా ఉమ్మా!"

"పారుకుట్టీ నీకిక్కడ ఎవరు సహాయము?"

"భగవంతుడే ఉన్నాడు. ఉమ్మా నువ్వు వెళ్ళు"

"ఓ భగవంతుడా!...." అన్నది అమీను ఉమ్మ. ముత్తాచీ ఉమ్మ తాటాకు గొడుగులో వెళ్ళిపోయారు. నీళ్లు తుళ్లి లాంతరు చెమ్మినీపై పడ్డాయి. ఇంట్లోకి కూడనీళ్లువస్తాయేమో. బియ్యం అయిపోయాయి, ఉమ్మసంశయంతో నిలబడినప్పుడు పారుకుట్టి చెప్పింది.

"ఏం విచారించకు ఉమ్మా? బ్రతికి వుంటే మళ్లీ కలుద్దాం!"

ఆ చీకటిలో వారిద్దరూ కళ్లుతుడుచుకున్నది పరస్పరం తెలియదు. వారిద్దరినీడలు చీకటిలో మరుగున పడేవరకు పారుకుట్టి వసారాలోనే నిలబడింది. తర్వాత లోపలికెళ్లి గడియవేసుకుంది.

వేదన, భయము ఆమెను కృంగదీసి నిరాశను కల్పించాయి. ఏం వచ్చినాసరే ఆమె ఎదుర్కొనవలెనని దృఢనిశ్చయముతో వున్నది.

ఆ ప్రాంతమంతా నీళ్ళలో మునిగి పోయింది. ఆ వరదలో ఆమె ఒక చెట్టు కొమ్మను పట్టుకొని వ్రేలాడసాగింది. పట్టు తప్పితే.... అంతే, చాల సేపటి నుంచి పట్టుకొని వున్నందున వేళ్ళు వంకర్లుపోతున్నట్లు అనిపించింది. నీటి ప్రవాహమునకు చెట్టు కదలటం వల్ల వ్రేళ్ళలో పట్టుసడలటంవల్ల ఆమెకు ఎక్కడికో పాతాళానికి పోతునట్లనిపించింది. అయ్యో.... అప్పుడే ఆమెకు మెలకువ వచ్చింది. తనకేమయిందో అప్పుడే ఆమెకు తెలిసివచ్చింది. అది ఒక కల మాత్రమేనని గ్రహించింది.

ఆమె లేచికూర్చున్నది. అయినా వణుకు తగ్గలేదు.

తలుపు తెరుచుకొని వరండాలోకొచ్చినప్పుడు ఆమెకు తల తిరిగినట్ల యింది. ఇంటిచుట్టూనీళ్ళు. వరదనీరు తప్ప వేరేమీ ఆమెకు కనపడలేదు. అల్ల కల్లోలముగా వున్న సముద్రం మధ్యలో తానొకతెప్పలో వున్నట్లుతోచింది. ఆమె కంటికి నీళ్ళు తప్ప పచ్చటి ఆకు ఒక టైనా కనబడలేదు. పొలములన్నీ నీటి మయమైపోయాయి. ఇంతకు ముందు పచ్చగా వుండే పొలాల్లో ఇప్పుడు పడ వలు కదులుతున్నాయి.

చుట్టు ప్రక్కల నున్న ఇళ్ళన్నీ ఖాళీగావున్నాయి. ఎవరి సందడిలేదు. ఏ యింటిలోనుంచి పొగరావటంలేదు. దూరముగా పొలముల్లో నీటిపై తేలు తున్న తెప్పలలో మనుష్యులే కనిపిస్తున్నారు.

వర్షం తగ్గు ముఖం పట్టలేదు. రాత్రి వీచిన ఈదురుగాలి ఇప్పుడు పూర్తిగా తగ్గి పోయింది. తోటలోని అరటిచెట్లన్నీ విరిగి పడి ఉన్నాయి.

కంచెగా కట్టిన కర్రలు గాలికివాలి, విరిగి పోయాయి. గాలికి దూరంగా వున్న మామిడి చెట్లు ఆకులు రాలి ఇంటిముందు బురదలో పడి వున్నాయి. ముత్తాచి ఇంటిపై నాలుగైదు కొబ్బరి ఆకులు మాత్రమే ఉన్నాయి.

వరదలు ఇంకా రావచ్చును.

గొంతెత్తి పిలిస్తే పలికేవారులేరు. ఆమె భయపడలేదు. నిరాశాపూరిత మైన వేదనే ఆమె హృదయాన్ని బాధిస్తున్నది.

క్రితంరోజు మిగిలిన చారెడు బియ్యం ఉన్నాయి. కానీ గంజి కాచు కోవటానికి నిప్పురగిలించటమే కష్టముతో కూడుకున్న పని. ఆ సమయంలో అరుగు ప్రక్కన నిలుచుని నీళ్ళమయంగా వున్న దృశ్యాన్ని కంటికి కనిపించి నంత మేర చూడసాగింది

అమీన్ ఉమ్మ తోటలో కూడ నీటిమట్టం పెరిగింది. మెట్ల దగ్గరున్న కర్రలు కొంచెం ఒరిగిపోయాయంటే ఇంట్లోకి కూడా నీళ్లు వస్తాయి.

దూరంగా ఎక్కడనుంచో ఒక మేక అరుపు వినబడింది. మృత్యువు సమీపిస్తున్నదని ఆ మేక తెలుసుకొన్నట్లుంది. అలల్లో పడవలు కదులుతున్నాయి.

మేక పిల్ల గొంతా అది? కాదు ఒక మనుష్యుని "అమ్మా" అనే ఆక్రందన.

మధ్యాహ్నానికి నావల రాకపోకలు నిలిచిపోయాయి. ఆమేక అరుపు మళ్లీ వినపడలేదు. నలువైపులా మరణించినవారింట్లో ఏర్పడ్డ నిశ్శబ్దం ఆవరించింది.

అదరిపోయినట్లుగా ఒక శబ్దం వింది. మెట్ల ప్రక్కనున్న అరుగు విరిగి పడింది. ఆకలిగొన్న పాములాగ నీళ్లు ఇంటిలోకి వచ్చాయి. చూస్తుండగానే ఇంట్లోను, తోటలోను నీటి మట్టం పెరుగుతున్నది. నీళ్లు గుమ్మం వరకు వచ్చాయి,

అంతవరకు పరధ్యాన్నంగావున్న ఆమె చటుక్కున ఈ విషయం గమనించింది.

నీళ్లు లోపలికొచ్చేస్తున్నాయి. బయట చూడటానికి ఆమెకు ధైర్యంలేదు. ఇంకా కొన్నినిమిషాలే వ్యవధి ఉంది సాయంకాలం తోటగోడ ప్రక్కన ఏదో శబ్దం వినపడింది. ఆ శబ్దం దక్షిణవైపునుండి వచ్చింది. కిటికీలో నుంచి బయటకు చూసింది. పశువులపాక కూలిపోయింది

చీకటిపడింది. వర్షంగూడా ఆగిపోయింది. గాలివాన శబ్దం అన్నీ ఆగిపోయాయి. అంధకారబంధురమైన ఆకాశం. బయట ప్రవహించే నీటి శబ్దం వినిపిస్తున్నది.

ఆమె మనసులో అంధకారం అలముకొంది,

బయట గలగల శబ్దం చేస్తూ ప్రవహిస్తున్న నీళ్ల శబ్దం వినపడుతోంది.

ఆమె ఏమీ ఆలోచించలేకపోయింది. బురదలో నిండిన బాటలు, నడుస్తున్న కొన్ని రూపాలు- ఇలా అనేక దృశ్యాలు మధ్య మధ్య కనబడి మాయమవుతున్నాయి. ఒక నాలుగిళ్లవాకిలి, పెద్ద పెద్ద స్తంభములతో కట్టబడిన

వసారా మధ్య ఎత్తైన దిమ్మ. విశాల వక్షస్థలముగల ఒక పురుషుడు మేఘాలతో కప్పివున్న ఆకాశం.క్రింద ఒక మూలగా సొమ్మసిల్లిపడియున్న స్త్రీ. పొడుగైన కేశములు, నరములు కనబడే నుదురుకల ఆమె ముఖము వాడిపోయినట్లుంది.... ఇలా అనేక దృశ్యాలు మసకమసకగా కనబడుతున్నాయి. బహుశః మరుసటిరోజు తన శవాన్ని దహనంచేయాలసి వుంటుంది. వరద ప్రవాహ వేగములో ముళ్లకంచెలోకి గాని మొగలితోటలోకి గాని, శవము కొట్టుకొని పోవచ్చు. అక్కడనుండి ఆ శవాన్ని తీసి వేయడానికి ఎవరూలేరు.

అతన్ని ఒక్కసారిచూస్తేచాలు.... ఎన్ని వేదనలైనా అనుభవించడానికి తయారు.... అతను వేదనలు అనుభవించకుండానే ఉండనీ .... వద్దుదంచే పసికత్తెకు పుట్టానని అతను బాధలు పడ నవసరంలేదు.

అప్పుటి సుఖంగా ఉండనీ, ఆమె మళ్లీ ఇల్లా ప్రార్థించింది.

"భగవతీ! అతనికి శుభంకలిగేలా దీవించు తల్లీ...."

ముఖాన్ని తలగడలో దాచుకొని చాపపై బోరగిల పడుకొన్నది నిద్రవస్తే మరి ఏదీ ఆలోచించవలసిన ఆగత్యంలేదు చల్లటి వరదనీరు తనని చేరేలోపల తాను నిద్రపోవాలి కొన్ని సమయాల్లో నిద్రపోయినప్పుడే గోడలు కూలిపడి పోయేవి. ఆమెకు కావలసినది కొన్ని నిమిషముల వ్యవధి మాత్రమే.

నిద్రరాకపోతే"నమశ్శివాయ"నామస్మరణచెయ్యాలని తనకు చిన్నప్పుడు అమ్మ చెప్పింది.

కళ్లు మూసుకొని జపించింది.

"నమశ్శివాయ....నమశ్శివాయ"

నీళ్ల ప్రవాహ వేగానికి గోడలు అదురుతున్నాయి.. లోపలికి కొంచెం కొంచెంగా నీళ్ళు వస్తున్నాయి.

..................

నమశ్శివాయ ....నమశ్శివాయ.

ఆమె శరీరం ముడుచుకున్నది. మూసుకున్న ఆమె కళ్ళు ఏదో కాంతిని చూస్తున్నట్లు భావించింది. కళ్ళులోతుకు కూరుకుపోతున్నాయి,

ఆ సమయంలో

"పారుకుట్టమ్మా".

శరీరము, మనస్సు ఇహలోకంలోకొచ్చాయి. ఎవరో మనిషి కంఠ ధ్వని వినిపిస్తున్నది. కానీ కళ్ళు తెరవడానికి మనస్కరించలేదు.

"పారుకుట్టమ్మా"

అతి ప్రయాసపడి కళ్ళు తెరచింది. మెల్లిగా లేచింది. శరీరం గాలిలో గడ్డిపోచ కదులుతున్నట్లుగా ఉంది. మాటలాడ లేకపోతున్నది. ఆమెకు తానెక్కడున్నదీ తెలియలేదు. ఎల్లాగో వీధిలోకి వచ్చి వీధి తలుపులను బల హీనంగా తెరచింది. కళ్ళు చీకట్లు కమ్మాయి.

"అమ్మా...."

"నేనే. భయపడవద్దు. నేనే శంకరన్ నాయర్ని"

కాళ్ళలో బలం చాలక, వేరుతెగిన వృక్షంలా క్రిందపడిపోయింది.

కానీ అంతలోనే రెండు చేతులు ఆమెను పట్టుకొన్నాయి.

"పడవ తెచ్చాను రండమ్మా...."

మాట్లాడాలని అనుకొంది. కాని ఆమెవల్లకాలేదు. శరీరం సొమ్మసిల్లి పడిపోతున్నట్లుంది.

"నేను పట్టుకుంటాను."

ఆమెను చేతులతో ఎత్తుకొని అతను వరద నీళ్ళలోకి దిగాడు.

పారుకుట్టి కళ్ళు తెరచి చూసేటప్పటికి తానొక మహా సముద్రములో వున్నట్లు తోచింది. చుట్టు ఎక్కడా గట్టు కనబడటంలేదు. నీళ్ళల్లో ఎక్కడో తెడ్డు వేస్తున్న శబ్దం వినిపిస్తున్నది. తానెక్కడున్నదీ తెలుసుకునే స్థితిలో లేదామె. కొంచెం సేపైన తర్వాతనే తెలుసుకున్నది. తానున్నది ఒక పడవలో అని. నీటి వేగాన్ని ఎదుర్కొనేందుకు జాగ్రత్తగా తన శక్తినుపయోగించి తెడ్డు వేస్తున్నాడతను. వెచ్చటి చెమట తన ముఖంపైపడింది. అప్పుడు తెలుసు కున్నది తాను అతని ఒడిలో నున్నట్లు, తల ఎత్తి, కూర్చోగలదు. కానీ కళ్ళు మూసుకునే అడిగింది

"ఎక్కడికి పోతున్నాము"

ఎత్తైన చెట్టుకొమ్మలో చిక్కబోతున్న పడవను తిన్నగా తెడ్డువేసి ఇంకొక ప్రక్కకు తిప్పి వేగాన్ని హెచ్చిస్తూ తన బలమంతా ఉపయోగించి, పడవ నడుపుతూ "నీరులేని మరో మెట్టస్థలానికి" అని జవాబు ఇచ్చాడతను.

# ఆరు

త్రన క్లాసులోకి ప్యూన్ కోయాము ఒక చీటీ తీసుకొని వచ్చాడు. రామ నాథయ్య చరిత్ర పాఠము చెబుతున్నాడు. పంతులు చీటిని చదివాడు. "పి. అప్పణ్ణిని హెడ్మాస్టర్ పిలుస్తున్నారు."

పిల్లలందరూ అప్పణి వంక చూశారు. అప్పణి ఆశ్చర్యాన్ని బయటికి చూపించకుండా వుండేందుకు ప్రయాసపడ్డాడు. సాధారణంగా ఏదైనా అల్లరి చేసే పిల్లల్నే ఆఫీసుకు పిలవటం అలవాటు. వారికి రెండు చేతుల మీదా కావల్సినన్ని దెబ్బలిచ్చి పంపేవారు. చిన్న తప్పులైతే కాస్త తిట్లు తిట్టి హెచ్చరించి పంపించేవారు. తర్వాత పెన్సిల్ ముల్లుతో అటువంటి పిల్లల చెవులను పొడిచేవారు. అనుభవించినవారికి తెలుసు, ఆయనవద్ద ఒక డజను పేము బెత్తంతో దెబ్బలు తీసుకోవటంకంటే చెవి మెలి వేస్తే కలిగే నొప్పి ఎటువంటిదో అని..

"ఎందుకోసరమో? ఆలోచించగా తానేమీ అపరాధముచేసినట్లు జ్ఞాపకంలేదు. భాస్కరన్ ఏదైనా లేనిపోనివి కల్పించి చెప్పివుండవచ్చును."

అతను ఆఫీసుకు వెళ్లాడు. ఆఫీసులోకి అడుగు పెడుతుండగా కాళ్ళు వణికాయి.

హెడ్మాస్టర్ ఇలా అడిగాడు.

"ఏమిరా చదువుతున్నావా?"

"చదువుతున్నానండి."

తర్వాత హెడ్మాస్టర్ అతనికి నెలకి ఆరు రూపాయల చొప్పున స్కాలర్షిప్పు వచ్చినట్లు తెలియజేశారు. అర్ధసంవత్సరం పరీక్షలో మొదటిశ్రేణిలో ప్యాసయినందుకు అది దొరికింది.

అయితే ఇక ఫీజు కట్టనవసరంలేదు.!

నాలుగు రూపాయల డెబ్భైయెదు పైసల భారం పోయింది. ఒక్క రూపాయ పావలా మిగిలింది.

నెలకు ఒకరూపాయ ఇరవై యెదు పైసలు సొంతానికి దొరుకుతాయి.

"ఇక్కడ చేవ్రాలు పెట్టు."

ఒకరెవిన్యూ స్టాంపుపై సంతకంపెట్టినతర్వాత హెడ్మాస్టరు ఒకకట్టనోట్లు అతని చేతిలో పెట్టాడు.

"గత ఎనిమిది నెలలడబ్బు ఇది."

ఎనిమిది ఆరు రూపాయలు నలభైఎనిమిది!"

నమ్మశక్యంకావటంలేదు. దాన్ని తీసుకొన్నప్పుడు చేతివ్రేళ్ళు వణికాయి. నలభైయేడు రూపాయలు తొంభైపైసలు చేతిలో పెట్టుకొని ఆఫీసులో నుంచి బయటికి వచ్చినప్పుడు తానొక పెద్దమనిషియైనట్లు అతనికి తోచింది. నిత్యము ప్రార్థిస్తున్నాడు. ఆ ఇంటికి వచ్చినది మొదలు మిద్దెపైనున్న భగవతికిమ్రొక్కే వాడు. భగవతియెక్క అనుగ్రహమే ఇది అనిపించింది అతనికి. భగవతి వారింటి కులదేవత. ఆ మిద్దెపైన వాసంచేస్తోంది. "ఆ కాలం నుంచి అన్న మిచ్చుదాత ఆదైవం". ఇలాగే అమ్మమ్మ భగవతిని గురించి చెప్పింది.

అది ఒక పాత కథ.

ఎన్నో ఏళ్ళ క్రితం జరిగినది. అప్పుడొక రోజు వంటింట్లో ఒక స్త్రీ ఆరు గురు పిల్లలు మాత్రమే ఉన్నారు. ఆమె నిత్యము ఆవుపాలు పిండి గుడికితీసు కొని వెళ్ళి అభిషేకానికి యిచ్చేఅలవాటు. ఏటినిదాటియే గుడికిపోవాలి. ఆ గుడిలో నైవేద్యమైన అన్నాన్ని భుజించే ఆమె కాలం గడిపేది.

ఒక ఆశ్వయుజమాసంలో ఏటినిండా నీరు పొంగటం వల్ల పడవలో పోయేందుకు వీల్లేక పోయింది. ఏటి ప్రక్కనున్న గట్టుపై కాస్సేపు పాలు పాత్రతో కాచుకుంది. ఆఖరుకి వ్యసనముతో తిరిగి వెళ్ళిపోయింది. బిడ్డలకు ఆ రాత్రి అన్నంలేదు. ఆ రాత్రి అర్ధజామున బయటనుంచి ఎవరో పిలిచినట్లు అయింది. తలుపు తెరచి చూస్తే ఒక చెయ్యి మాత్రం లోపలికి వచ్చింది. ఒక పాత్రనిండా అన్నం ఇంట్లో పెట్టింది చెయ్యి.

"పిల్లల్ని లేపి ఈ అన్నం పెట్టు."

పట్టు వస్త్రముతో కప్పినట్లున్న ఒకరూపము మిద్దె తలుపు తెరచుకొని

లోపలికి పోవటం కనపడింది. కాళ్లగజ్జెల ధ్వనికూడా విన్నది. తర్వాత ఏమీ కనబడలేదు.

అది భగవతిదైవమే. ఆతర్వాతనే ఈ ఇంట్లో సకల ఐశ్వర్యాలు వచ్చి చేరాయి.

ఆ రోజు అతనికి భగవతి పైన, అన్ని దేవుళ్ళ పైన అమిత విశ్వాసం కలిగింది

జీతం కట్టవలసిన తేదీ వచ్చినప్పుడంతా గుండె చెదిరిపోయేది. నాలుగు రూపాయల డభ్భైయైదు పైసలు ఎవరిస్తారు?

ఆరోజే పిల్లల మధ్య అతను యోగ్యత గలవాడయ్యాడు. జేబులో నలభై ఏడురూపాయల తొంభై పైసలున్నాయి. అంత డబ్బును వాడు ఇంతకు ముందు చేతితో ముట్టుకొని చూసినదికూడాలేదు.

ఇంటికి వెళ్ళే ముందు ఈ వార్త అక్కడ పాకిపోయింది. బహుశ భాస్కరుడు చెప్పి వుంటాడు

ఆరోజు పెద్దమామ కొంచం ప్రేమగా మాట్లాడాడు. భోజనానికి భాస్కరుడు, ఇతరులుండగా పెద్దమామే తనని పిలిచాడు

నలభైఏడురూపాయలు తొంభైపైసలకు ఇటువంటి శక్తివున్నదని అతని వల్ల ఊహించుటకు వీల్లేకపోయింది.

ఆ రాత్రి అమ్మమ్మ, "ఆడబ్బుని ఏం చేయకు. నే దాచి పెడుతాను" అన్నది ఆ తర్వాతనే అతనికి రెండు క్రొత్త పంచెలు దొరికాయి. అమ్మమ్మ అందులోనుంచి మేకతల తీయడానికి కూరగాయలకని కొంచెం తీసుకుంది. మిగాతాది అమ్మమ్మ దగ్గరనుంచి చిన్నమామ అప్పుగా తీసుకొన్నట్లు తర్వాత తెలిసింది.

అందువల్ల తనకేమీ బాధకలగలేదు. ఉన్నట్లుంటి తను ధనవంతుడైనట్లు భావించాడు. చిన్నమామ తనకు అప్పుయివ్వాలి! అమ్మమ్మ తన సంపాదనని కొంచమైనా అనుభవించింది.

పులుసు త్రాగుతూ రోజూ అమ్మమ్మ,

"వయసయిపోయిన కాలంలో నీవల్లైనా నాకుసుఖం కలిగిందిరా," అనేది.

ఈ లోగా ఆస్తులను పంచుకునే విషయాలు మెల్లిగా తలెత్తనారం

భించాయి. చాలకాలం మాటలు జరుగుతూనే వచ్చాయి గానీ ఏ నిర్ణయమూ జరగలేదు.

ఆస్తిపంపకం మాటలు ప్రారంభమయాక పెద్దమ్మ, "నాకూ నా పిల్లలకీ రావలసిన వాటా యిస్తేచాలు" అన్నది.

మీనాక్షమ్మకీ, చిన్నాయనకీ ఏవీ అభిప్రాయాలంటూ లేవు. అదుర్దా అంతా అమ్మమ్మదే

దీన్నంతా కళ్లారా చూడాల్సి వచ్చింది అంటూ ఎదురుగా వరండాలో గ్రామ పెద్దలుచేరి మాట్లాడటం ప్రారంభిస్తే, నాన్నమ్మ,

"నాకు ఈ ఇంట్లోనే ఉండి కళ్లు మూయాలని వుంది అంతే" అని దుఃఖించింది.

అప్పణి ఆ ఇంట్లో ఒ వ్యక్తిగా జీవిస్తున్నాడనే సంగతి అసలు పెద్ద మామ మరిచిపోయాడు. అతన్ని తిన్నగా చూడటం కూడా వీలయినంత మటుకు తప్పించుకునేవాడు. అతనికి ఏదీ తెలియకూడదని మామయ్య ఉద్దేశ్యం.

ఇల్లంతా మనుష్యులతో నిండి వున్నా తానెప్పుడూ ఒంటరివాడయినట్లే అతనికి తోచేది. నిత్యం అతన్ని ఆ విషయం బాధించేది. అతన్ని పేరుపెట్టి ఎవరూ పిలవటంలేదు. ఉదయం గంజి త్రాగేసి బడికి పోయేవాడు. సంధ్య వేళలో తిరిగి వచ్చేవాడు. తోటలోని గుంటలో స్నానంచేసేవాడు. దక్షిణ పార్శ్వపునడవలోని గూట్లో వున్న బుట్టలో నుంచి కొంచెం విభూతి తీసుకుని నుదుట పెట్టుకొని మిద్దెవెళ్ళున్న దేవుణ్ణి చూసి మ్రొక్కేవాడు. దీప స్తంభపు వెలుగులో చదువుకునేవాడు. ఎవరూ అతనితో మాట్లాడేవారు కాదు.

పెద్దమ్మ కష్టమంతా అతనిక్కడనుంచి మళ్లీ తనయింటికిపోడని తెలిసిన తర్వాత ఎక్కువయింది. ఆమె దిగ్గరగానే ఇలా గొణుక్కునేది "నాశనమయిపోతున్న ఈ యింటికి పాడు మఖాలు ముండమోపులు వచ్చి చేరారు."

ఈ మధ్య తనతో మాట్లాడేందుకు వచ్చేది ఒక మాళు మాత్రమే. ఆమె అప్పుడప్పుడు ఏదైన ప్రశ్నలడిగేది. పాఠం చదువుతున్నప్పుడు దగ్గరికి వచ్చి అలాగే నిలబడిచూసేది. అది అతనికి నచ్చలేదు. పగలు గడిచిన విషయాలన్నీ సాయంకాలం ఆమె ఏకరువుపెట్టేది. నలుపురంగులో సన్నగాతీర్చిదిద్దిన

కనుముక్కు తీరు అమెది. అదేమిటో,ఆమె అతనికి నచ్చలేదు. ఆమె అమా యకురాలని అతనికి తెలుసును.అయినా ఆమె ప్రేమగా మాట్లాడితే అతనికి చిరాకు వేసేది. వంటగదిలో పనిలేనప్పుడు, ఆమె అతని దగ్గరకొచ్చి నిలుచుని,

"అప్పణియన్నా, ఏంచేస్తున్నావు? ఇప్పుడు ఏం వ్రాస్తున్నావు?" అనడిగేది.

ఆమెకూడా ఆ యింట్లో ఒక అవసరమైన జీవి.

ఆమెకి యింట్లో పనిపాటులున్నాయి. నిత్యం ఒక, చిన్న తుండు ఒక మురికి పడిన జాకెట్టు తొడుక్కునేది.

తంగేడత్తి అమ్మణి మాత్రం పట్టువస్త్రాలు కట్టుకునేవారు. వాళ్ళు దగ్గ రగా వస్తే సువాసనలు వచ్చేవి. కొబ్బరి నూనెలో గంధపుపొడివేసి కాచినది, సాంబ్రాణివేసి కాయించినది, కేతకీపుష్పమకరందం వేసి కాయించిన నూనెలు ఇలా పలువిధములైన నూనెలుండేవి. మాళు దగ్గరికి వచ్చినపుడు ఒళ్ళంతా చెమటవాసన కొట్టేది.

ఎప్పుడైనా అమ్మణి తన తల్లి ఇంటికి వెళ్ళేది. నాలుగైదురోజులు పోయాక మళ్ళీ తిరిగి వచ్చేది, పెద్దమామకు కూడా పిల్లలంటే అపేక్ష, ముసు పంతా దేవకి వుండేది. ఆమెకు పెళ్ళి అయ్యాక భర్త ఇంటికి వెళ్ళిపోయింది. ఆ తర్వాత అమ్మణి వచ్చింది. అత్తయ్య ఇక్కడికి వచ్చి వుండి చాలా రోజు లయింది. గత తిరువాతిరాముందు రోజు వచ్చింది. అంతే.

ఒక రోజు అప్పణి షర్టు ఊతికి ఎంతవేశాక ఇంట్లో వట్టి బనియన్ మాత్రము వేసుకొని కూర్చున్నాడు.

"అప్పణి బనియన్ వేసుకుంటే బాగున్నాడు" అంది అమ్మణి

ఆమెతో మాట్లాడేందుకు ఆతనికి అమిత సిగ్గు, కొన్ని సమయాల్లో ఆమె దగ్గరికి వచ్చేది. అప్పుడు ఒకమాదిరి భయం కలిగేది. ఆమెని చూసి నప్పుడల్లా ఎదుట కనబడే ఆ రూపం కనుమరుగయి దీపస్తంభాల మధ్య ఆ కాంతిలో పత్రాలు ధరించి చేతులతో పువ్వుల గుత్తులను పట్టుకొని నాట్యం చేసిన ఒక సర్పకన్యక రూపమే తలపుకి వచ్చేది.

సాయంకాలం పూట్ల పెద్దమామ తోటలో షికారుకి వెళ్లినప్పుడు అమ్మణి ఇంటి గుమ్మంలో నిలబడి తలవిప్పుకొని, వ్రేళ్ళతో జుత్తు సవరించుకునేది.

అప్పాణికి చాటుగ ఆమెను చూడాలన్న కోరిక కలిగేది. ఆమె నడుస్తున్నప్పుడు ఆమె ధరించిన పట్టు నీలిరంగు జాకెట్టు ధగ ధగ మెరిసేది. కుప్పెలు కట్టిన జడ, చందనం రంగులోని ఆమె శరీరము చూసేందుకు కన్నులకింపుగ వుండేది. సర్పతుళ్ళలాట నాటికన్న ఈనాడు ఆమె కాస్త ఒళ్ళుచేసి అందముగా తయారయింది. అరటిలోటలో సాయంకాలపు సూర్యకిరణాల కాంతిలో, ఆమె అర్ధ నిమీలిత నేత్రాలు మనోహరంగా వుండేవి. ఎర్రని గాజులు వేసుకొన్న చేతులు అందాలొలికేవి. తలదువ్వుకునేప్పుడు ఆ గాజులు గలగలలాడేవి.

ఆమె ఎదురుగా వచ్చి నిలుచున్నప్పుడు తిన్నగా ఆమె ముఖంలోకి చూడాలని ఆశ కలిగేది అయితే నిందాపూర్వకంగానే చూడాలనిపించిం దతనికి. పెద్దమామకు ప్రియపుత్రి! తన పట్ల కఠోరంగా ప్రవర్తిస్తున్న మనిషికి ప్రియకుమార్తె. పెద్దమామపైవున్న ద్వేషమంతా ఆమెపై చూపాలనిపించేది కానీ, తన ఎదుటకి వచ్చినప్పుడు ఆమె వైపుకు తలెత్తి చూడలేక పోయేవాడు. దూరంగా వుండి చూస్తుంటే ఆసక్తిగా వుండేది. ఆమెముఖంమీద, మెడమీద పడిన జుట్టు కదులుతుంటే నల్లనిపాము ఆడుతున్నట్లుండేది. అర్ధనిమీలిత నేత్రాలతో, స్వప్నములో విహరిస్తున్నట్లు, నడుస్తున్నదా అనిపించేదిచూపరులకి.

సాయంత్రం వేళల్లో ఆమె వాకిట్లో నిలుచున్నప్పుడు సర్ప వనములో నాగములు వచ్చి పడగెత్తి నాట్యం చేస్తాయా అనిపించేది. సర్పాలకి సుందర మైన కన్యలంటే చాలప్రీతి.

అందమైన ఒక సర్పమే అమ్మణి దూరంగా నిలబడి ఆమె తల యెత్తి చూస్తేసరి, పడగెత్తినట్లు చాలా అందంగా వుండేది. అయితే దగ్గరికి వెళ్ళ డానికి భయం....

ఒక సంధ్యవేళ అప్పాణ్ణి కాగితాన్ని తీసుకొని ఇంగ్లీషుపుస్తకంలోనుంచి చూసి ఏదో వ్రాసుకుంటున్నాడు. అప్పుడు అమ్మణి వెనుకపక్కగా వచ్చి నిలుచుంది.

"అప్పాణీ, ఏం చేస్తున్నావు?"

వ్రాస్తున్నదాన్ని ఆపక, శ్రద్ధగా తిరిగి చూడకుండానే అప్పాణి,

"ఏం లేదు" అన్నాడు.

"అప్పాణీ నీ పుస్తకాన్ని ఇవ్వు. నేను చూస్తాను."

ఆమె దగ్గిరగా వచ్చి నిలుచున్నప్పుడు జాజిమల్లిపువ్వుల వాసన గుప్పున గుబాళించింది.

వ్రాసిన నోటు పుస్తకాన్ని అతను క్రిందపెట్టాడు. ఆమె దాన్ని చేతిలోకి తీసుకుంది.

అమ్మణి ఐదవ తరగతి వరకే చదివింది. ఇంగ్లీషు చదవడం అంతగా తెలీదు. తనకి ఇంగ్లీషు చదువను, వ్రాయను వచ్చునని అతనికి చాలా గర్వంగా వుండేది.

పుస్తకాల కాగితాలని తెరచిపెట్టుకొని అమ్మణి "దీన్నంతా, అప్పణీ, నువ్వు చదవగలవా?" అని అడిగింది.

"ఏదీ, దీన్ని చదువూ, నేను వింటాను."

అదెలాగ? పైకి చదవటం ఎల్లా? తను చదివితే వినాలని ఎంత ఆశ ఆమెకు? చదివి చూపించి తన సమర్థతని చాటాలని అతనికి ఆశగా వుంది. కానీ ఏదో సిగ్గు అనిపించింది

"ఇదెవరి పటము?"

ఒకపుటని త్రిప్పి చూపించి ఆమె అడిగింది.

"రాణి లక్ష్మీభాయి."

"లక్ష్మీభాయి ఎవరు?"

లక్ష్మీభాయి ఎవరో ఆమెకు తెలియదు. ఝాన్సీరాణి గురించిన కథ అతనికి పూర్తిగా తెలుసును. అదంతా తాను ఆమెకు ఎట్లా వివరించగలడు?

"ఒకరాణి ఆమె ఆకాలంలో." అని మాత్రమే అన్నాడు.

"ఇదెవరు?"

"ఇది ఎగిరే గుర్రం, ఎగిరే గుర్రం కథ. రాజకుమారి, యువరాజకుమారుడును గుర్రపుస్వారి చేస్తున్నారు."

"ఆ తర్వాత?"

"ఆ తర్వాత రాజకుమారి, రాజకుమారుడు వివాహం చేసుకుంటారు."

"ఆ తర్వాత?"

"ఆ తర్వాత సుఖంగా వుంటారు."

"ఆ తర్వాత ?"

ఏం చెప్పాలో అతనికి తెలియక వూరుకున్నాడు.

అమ్మణి గలగల నవ్వింది. అప్పుడు అతనూ నవ్వాడు. కాని వెంటనే నవ్వు ఆపుకున్నాడు. ఆమె అతని భుజముపై తన చేతులను నొక్కిపెట్టి నిలబడింది.

మళ్ళీ జాజి మల్లి పువ్వుల సుగంధం.

"అప్పుణీ, నీకి కథ పూర్తిగా తెలియదూ?"

"పూర్తిగా చదివాను."

"మరి ఎందుకు చెప్పలేదు?"

అట్లా అడిగినప్పుడు ఆమె ఓ బాలికలా తోచింది అతనికి. కాని, అందు కతను ఏదీ సమాధానం చెప్పలేదు.

"ఏమిటీ, అప్పుణీ, ఏం మాట్లాడవు?"

దీనికి అతనేమీ జవాబు ఇవ్వలేదు.

"నామీద కోపం వచ్చిందా?"

"నాకేం కోపంలేదు."

ఏదో ఆలోచిస్తూ మెల్లిగా ఆమె ఉత్తర పార్శ్వగదిలోకి వెళ్లిపోయింది.

ఇంట్లో పెద్దమామకూ, చిన్నమామకూ కలహాలు మామూలు అయి పోయాయి.

ఆస్తి పంపకానికి పెద్దమామ సిద్ధముగాలేడు. ఇంటిలో అన్నానికి వడ్లు ఇవ్వడంకూడా మానేశాడు. పెద్దమ్మ గొంతు రోజురోజుకీ ఎక్కువగా వినిపించ సాగింది.

సంవత్సరాంత పరీక్షాఫలితాలు బడితెరచే ముందే తెలిశాయి. అప్పుణి ప్యాసయ్యాడు. మార్కులు ఇంకా తెలియలేదు. బహుశ: మొదటి శ్రేణిలో ఉండాలి. లేకపోతే రెండవదిగానైనా వచ్చి వుండాలని తలపోశాడు. కృష్ణన్ కుట్టి వారియర్ మొదటి శ్రేణిలో ప్యాసైయుండవచ్చు.

ప్యాసైన వివరాలు తెలుసుకుని అమ్మణి అడిగింది.

"అప్పుణి, ప్యాసైయ్యావు కదా?"

"ప్యాసయ్యాను."

"ఎన్నవ శ్రేణి?"

"అదే తెలియదు."

"అప్పుణీ మొదటి శ్రేణిలో వుండాలి."

అలాగైతే ఒక బహుమానంకూడా లభిస్తుంది. గత సంవత్సరం బడి వార్షికోత్సవములోనే అతనికి బహుమానం దొరికింది. నోటీసు బోర్డులో పేరు చూస్తే తెలిసింది.

పెద్ద గుంపు. బహూకరణ ప్రదాన ఉత్సవానికి పోయేందుకు తను కాచుకు కూర్చున్నాడు. మైక్‌లో అతని పేరు విన్నప్పుడు మైమరచిపోయాడు. పి. అప్పుణి, ఆ పేరులోకమంతా వినిపించినట్లు అనిపించింది. జనం మధ్య నుంచి నడచివెళ్ళి, బహుమానాన్ని తెచ్చుకొన్నాడు. అట్టపై గడ్డముతో వున్న ఒక వ్యక్తి చిత్రము ముద్రించిన ఇంగ్లీషు పుస్తకం అది.

"అప్పుణీ, నీవు చాలా గొప్పవాడివి అవుతావు."

అమ్మణి ఎగతాళిచేస్తున్నదా? లేదు. అదిఒక ఆశీర్వచనముగ అతనికి తోచింది.

"చదివి ప్యాసై పెద్ద ఉద్యోగం వచ్చినప్పుడు........"

ఆమె ఆ తరువాత ఏమీ చెప్పలేదు. ఆమె చూపులు తనపై వున్నట్లు అతను గ్రహించాడు.

అది శ్రావణమాసం. ఒక చీకటిరాత్రి. నూనెలేక దీపస్తంభందీపపు వెలుగులేక చీకటిగా వుంది మీనాక్షమ్మ పని పూర్తయ్యాకనే ఆమె చిన్న దీపాన్ని తీసుకోవచ్చును అన్నం తిన్నాక అతనికిష్టమైన తూర్పువైపు గదిలో పడుకున్నాడు.

పెద్దమామ ఆ రోజు ఊళ్ళోలేడు. గురువాయూర్‌స్వామి దర్శనానికి వెళ్ళాడు గిడ్డంగి ప్రక్కన అంతా చీకటిగా వుంది.

చిన్నమామ సాయంకాలం అన్ని పనులు చేసి వచ్చి నిద్రపోయాడు. వర్షాకాలమైనందున చలికావటంచేత పెద్దమ్మ ఆమె కొడుకులు అన్నం తినేసి నడవలోపల పడుకుంటారు. వంటగదిలో మీనాక్షమ్మ, మాళు, ఏదో పని చేస్తున్నారు

వాకిట్లో నుంచి చలిగాలి వీస్తోంది. అప్పుణి చీకట్లోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు

అప్పుడు, అమ్మణి అతని దగ్గరకు వచ్చింది.

"అప్పుణీ నిద్రపోయావా?"

అతను ఉలిక్కిపడ్డాడు. ఆమె దగ్గరకి వచ్చినది చీకటిలో తెలియలేదు.

"నీకు దీపం ఏదీ దొరకలేదా?"

"లేదు."

"నాన్న లేరు. గిడ్డంగి దీపాన్ని వెలిగించి తీసుకొస్తాను."

"వద్దు."

ఆ గిడ్డంగి ప్రక్కకి అతను పోవడంలేదు. పోవుటకు ప్రయత్నించినదీ లేదు.

"ఎందుకు వద్దంటావు? ఇక చదవదలచుకోలేదా?"

"లేదు."

"అయితే ఎందుకు నిద్రపోలేదు?"

"నిద్రరాలేదు."

"అప్పుణీ. పుస్తకంనుంచి కథ ఏదైనా చెప్పవూ?"

"అందులో కథ ఏదీ లేదు.

అమ్మణి ప్రక్కన కూలబడింది.

"అబద్ధం చెబుతున్నావు. ఎగిరే గుర్రం మీద స్వారీ చేసే రాజకుమారి రాజకుమారుని కథ లేదూ?"

"అది ఇంకో పుస్తకంలో వున్నది."

"ఎగిరే గుర్రమంటే బాగుండేది కథ. లేదూ, అప్పుణీ? వరదలు వచ్చేటప్పుడు అలాటి కీలుగుర్రం ఉంటే బాగుండేది కదా?"

అప్పుణికేదో మనసులో తోచింది, పదహారు పదిహేడు సంవత్సరాల యువతి అమ్మణి. అయినా చిన్న పిల్లలాగా అడుగుతోంది.

"అదంతా కథల్లోనే కదా?"

'నీకు ఉణ్ణి గురించిన కథ తెలియదు. అప్పుణీ, నీకు తెలుసా?, అని అడిగింది

"ఏ వుణ్ణి?"

ఉత్తరాదింటి ఉణ్ణి కథ అమ్మణికి తెలుసును. ఉణ్ణి ఒక మనిషిని తన సిగలోనే దాచిపెట్టి వున్నదట. నీటిలోపల సగం మనిషి లోతులో జుత్తు విరబోసుకుని నిలుచునుంది. (అమ్మణికికూడ కేశములు చాల పొడుగైనవి.) రాత్రి ఉణ్ణి గదిలోకి ఒక పురుషుడు వెళ్ళాడు. ఉదయం వేషం మార్చుకుని, వెళ్ళిపోయాడు.

ఈ కథ అతనికి నచ్చింది. దాంట్లో ఒక అంశము మళయాళ పుస్తకములో పద్యరూపంలో వుంది.

వాకిట్లో తోటగాలి చల్లగా వీస్తున్నది. ఆగాలి శరీరాన్ని చల్లగా తాకుతోంది.

"ఏమిటీ చలియా?" అమ్మణి అడిగింది. దుప్పటి పైన కప్పుకొనేదుంటే చలిగా లేదు."

"ఊం వుంది"

"అయ్యప్పస్వామి గుడిలో ఒంటరిగా ఆ చలిలో ఎలావున్నారో?"

అప్పుణి వీపుపై అమ్మణి శరీరం మెల్లిగా ఒరిగింది. ఆమె చేతులు వెచ్చగా వున్నాయి.

"అప్పుణి నీకు మందయింది. నువ్వు మిద్దెమెట్ల గదిలో పడుకున్నావంటే చలిగా వుండదు. అక్కడ కిటికీలు, తలుపులు మూసేస్తే వెచ్చగా వుంటుంది."

అప్పుడు అతను అల్లరిగా ఇలా అడిగాడు:

"వానాకాలం పూర్తయ్యేవరకు ఆ గదిలోనే పడుకోనా."

ఆ ప్రక్కనే కిటికీలేవీ లేని ఒక చిన్న గది వుంది. పాత పాత్రలు డబ్బాలు టిన్నులు, ఇతర సామానులన్నీ వున్నాయి ఆ గదిలో. సంవత్సరానికొకసారి ఆచార్యులు వచ్చి పూజచేసేది ఆగదిలోనే.

అమ్మణి చిన్నగా నవ్వింది

"నాకు భయంవేయదు".

"ఎందుకు?"

"పొరమాన్, నారాయణన్ వాళ్లంతా వస్తారు"

పొరమాన్, నారాయణన్, ఇంకా కొందరున్నారు. వాళ్లంతా చచ్చిపోయిన పూర్వీకులు. వారినిగురించి ఎన్నో కథలున్నాయి. నారాయణన్ జ్ఞాపకం వచ్చినప్పుడు భయంకరమైన తలంపులు వచ్చేవి. అతను తన కోడల్ని కొట్టిచంపేశాడట. అది చాలాకాలం ముందు జరిగిన సంగతి. ఆకోడలి ప్రేతం-దాన్ని తలుచుకున్నప్పుడు తానొక ధీరుడని భావించే అప్పుణికే భయం వేసేది. దెబ్బ తగిలి చెంపలనుంచి, నోటిలోనుంచి, ముక్కులోనుంచి రక్తం కారాయట. చనిపోయినప్పుడు ఆమెకు పదహారేళ్లు.

అవిడ ఏం తప్పుచేసిందని అడిగి తెలుసుకోలేదు. ఇదెప్పుడో జరిగిన సంఘటన. ఏదో కారణం చెబుతారు. ఓ! దీనిని ఎట్లానమ్మటం? అన్నంలో వెంట్రుకలున్నాయిట. అందుకని కొట్టి చంపివేశాడా? అదికాదు. దానికంటే ఏదో పెద్ద తప్పుచేసి వుంటుంది.

"ఆమూలగదిలో పడుకుంటే భయంగాలేదు?"

అమ్మణి అడిగింది.

"నాకేం భయంలేదు."

ధైర్యస్థుడవే నీవు. రాత్రి పొరమాన్ ప్రేతం వచ్చి నీ మెడ పట్టుకుంటుంది."

"అదంతా ఏం లేదు!" అన్నాడు తిరస్కారభావంతో.

"అంత ధైర్యమా. అయితే రాత్రి నేను వచ్చి భయపెడతాను."

అతని మెడపై అమ్మణి చేతులుంచినప్పుడు అతనికెలాగో అనిపించింది.

ఆమెకట్టుకున్న వస్త్రాలనుంచి గుప్పున సువాసన వచ్చింది,

చేతులు అతనిమీదుగా వేస్తూ, అమ్మణి మళ్ళీ రెట్టించి, అడిగింది.

"భయపడవూ? భయమేలేదానీకు?"

అప్పుణి శరీరమంతా ఏదో విద్యుత్ ప్రవహించినట్లయింది.

దక్షిణ పార్శ్వగదినుంచి వెలుగు పడింది. మాళు వచ్చింది.

"అమ్మణియక్కా, ఎక్కడున్నావు, అమ్మణి యక్కా?"

వెనుకనే మీనాక్షమ్మ వచ్చినిలబడింది. అమ్మణి గబుక్కున మెడపైనున్న చేతులు తీసేసి లేచి నిలబడింది.

"ఇదిగో వస్తున్నా. నువ్వు ఆ గిడ్డంగివాకిలి తలుపు తాళంవేశావా? వెళ్లి వేసిరా," అన్నది.

మీనాక్షమ్మ అప్పుణిని చూసి,

"ఏం, నీవు పడుకో లేదింకా?" అనడిగింది,

అతను ఇహ చదవదలచుకోలేదు. "ఇప్పుడే వెళ్లి పడుకొంటానన్నాడు".

"త్వరగా పడుకో. నేను గడప తలుపులన్నీ మూసి, తాళంవేసి వెళ్లి పడుకోవాలి."

అప్పుణి మూలగదికి వెళ్లాడు. చాప తీశాడు. అక్కడ వెలుగు లేదు. చీకట్లోనే నిత్యము చాపవేసి పడుకోవటం. పట్టిచాపమాత్రమే అతను ఉపయోగించేవాడు. తల క్రింద పెట్టుకొనేందుకేదీ లేదు.

చిన్నదీపాన్ని చేత్తో పట్టుకొని అమ్మణి ఆ గదిలోకి మళ్లీ వచ్చింది. ఆమెతో మాళుకూడా వచ్చింది. ఇటీవలమాళు ఆమెకి సహాయంగా వుంటోంది,

"మాళూ! చెంబుతో నీళ్ళుతెచ్చి పెట్టావా?"

"పెట్టాను."

"ఒకగ్లాసుడు నీళ్ళు తీసుకురా."

మాళు నీళ్ళు తీసుకు రావడానికి వెళ్లింది. గడప పట్టుకొని నిలుచుంది అమ్మణి. ఆ చిన్నదీపపు వెలుగులో ఆమెముఖం ఆకర్షణీయంగా కనపడుతోంది. క్రింద చీకట్లోపడుకొన్న అప్పణి నిద్ర పోతున్నాడో, లేదో పరీక్షగా చూసింది. కళ్లుమూసుకొని వున్నాడు.

"దొంగ నిద్రయేనా?"

"అతనేమీ మాట్లాడలేదు. కొద్దిగా కదిలాడు.

"రాత్రి నేను భయపెట్టటానికిరాబోతున్నాను."

మాళు నీళ్లు తెచ్చింది. తర్వాత ఇద్దరూ ఆ గదిలోంచి వెళ్లిపోయారు.

మేడపైన గదిలోనే వాళ్ళు పడుకోవటం. బయటనుంచి మెట్లు ఎక్కుతున్న శబ్దం వినపడింది. ఆ తర్వాత మంచమువద్ద శబ్దం వినపడింది. మిద్దె అంత ఎత్తుగాలేక పోవటంవల్ల, పైన ఏ చిన్న శబ్దమైనా కింద స్పష్టంగా వినపడేది.

మళ్ళీ మంచం దగ్గర శబ్దము వినపడింది. అమ్మణి మంచము పైనే పడుకునేది. క్రింద మాళు పడుకునేది.

అప్పణికి నిద్ర రావడం లేదు. తెరచిన కిటికీ ఊచల మధ్య నుంచి చల్లని గాలి లోపలికి వస్తున్నది. దూరంగా ఎక్కడో మంచి వాన కురుస్తూ వుండాలి. కిటికీ ఊచల మధ్యగా చూచినప్పుడు తోటలో నున్న పశువుల కొట్టాయి, దానిప్రక్కనే మునగచెట్ల కొమ్మలు, నీడలాగా కనపడుతున్నాయి. చలి ఎక్కువ అయినప్పుడు కిటికీ తలుపులు మూసేశాడు.

అంతా చీకటి, భయం ఏమీ లేదు. పైన గదిలో అమ్మణి మాళు వున్నారు. ఎదురుగా వున్న గదిలో పెద్దమ్మ, అమె కొడుకులున్నారు. ఆ ప్రక్కనే మరో గదిలో నుండి గుర్రు వినిపిస్తున్నది.

అప్పణి కళ్ళు మూసుకొని పడుకున్నాడు. చీకట్లో చలిగాలి వీచడం వల్ల వణుకుగా వుంది. కప్పుకొనుటకేమీ లేదు. వాన కురుస్తున్నప్పుడు అమ్మ దుప్పటితో కప్పేది. చలి ఎక్కువయితే తనని దగ్గరకి తీసుకుని పడుకునేది. ఆ రోజులు అవి.

ఇవన్నీ జరిగి చాలా సంవత్సరాలు గడచిపోయినట్లయింది. తల్లి జ్ఞాపకం వచ్చింది.

అతని మనసు సరిగా లేదు. గడచినదానిని గురించి ఏదీ ఆలోచించ రాదు....

అనుకుని కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

కాస్సేపటికి నిద్రపోయాడు.

మేఘాలకూటమిలో ఎత్తుగా కనబడుతున్న పెద్ద భవనం తెరిచినప్పుడు అక్కడ రాజకుమారుడు ఒకడు గుఱ్ఱమెక్కి గుఱ్ఱం చెవిని తిప్పాడు. మిద్దెపైగా వున్న విశాలమైన స్థలం పైన దిగాడు పట్టు మంచములో కూర్చుండి రాజ కుమారి వీణ వాయిస్తున్నది.... ....

ఎవరో ఛాతీ మీద చెయ్యి వేసినట్లు అనిపించింది. గట్టిగా అరవాలని పించింది. కళ్ళు తెరవలేదు. ఉంగరాల వ్రేళ్ళు తన ముఖంపై కదలాడాయి.

"నేనే, అప్పణీ."

ఒక నిమిషం. అర్థమయింది. భయపడ నవసరంలేదు. గాజుల శబ్దం.... ఆ చేతులు వెచ్చగా వున్నాయి. కళ్ళు వాటంతటవే మూసుకున్నాయి. నిద్ర మత్తు ఇంకా పూర్తిగా పోలేదు. వేడి శ్వాస తన ముఖాన్ని తాకింది. మెల్లిగా ఏదో కంఠం " భయపడకు " అన్నది,

శరీరం వేడెక్కింది. ఏదో విద్యుత్తు ప్రవహించినట్లయింది. వేడిగా సన్నిహితంగా చేతులు శరీరాన్ని స్పృశించాయి. వాసన సబ్బు సుగంధం రమ్యంగా వీస్తున్నది.... శరీరంలో ఒక విధమయిన శక్తి పుంజుకుంది.

కళ్ళు తెరచి చూడాలనిపించింది. పరుగెత్తుతున్న కీలుగుర్రము పైన రాజకుమారుడు, రాజకుమారి మేఘాల మధ్య విహరిస్తున్నారు, మేఘాలుగా అగపడుతున్నవి జాజిమల్లి పువ్వుల మాలలు. గజ్జలు గలగల మంటున్నాయి.

జాజిమల్లి పువ్వుల మధ్య పుష్పించిన చెట్ల మధ్య గుర్రము పోతోంది భీతితో రాజకుమారి రాజకుమారుణ్ణి చేతులతో చుట్టి, దగ్గరకు చేరింది అతనికి ఊపిరి ఆడటంలేదు.

అతనిప్పుడెక్కడున్నాడు? .... పట్టువస్త్రములు, తలపాగాతో నున్న రాకుమారుడు తానేకదా? ఎత్తైన వృక్ష కూటమి మధ్య చిన్న చిన్న చెట్ల మధ్య తిరుగుతూ ప్రయాణిస్తున్నది గుర్రం. గాలికి,తన శరీరముపై ధరించిన పట్టు వస్త్రములన్నీ వీడి క్రింద పడుతున్నాయి. శరీరంలో ఏదో గుచ్చుకుంటున్నది.

ఎత్తుగా ఇంకా ఎత్తుగా రాజకుమారుడు, రాజకుమారి, మాయా గుర్రం. పైకి లేచి పోతున్నది........

"అప్పాణియిన్నా,"

మాళు పిలుపు వినిపించింది,

"గంట యేమైంది?"

అప్పాణి లేచాడు. కళ్లు తెరిచి, బట్టలు సరిచేసుకున్నాడు. మూసిన కిటికీ తలుపులు తెరిచాడు. ఎండ గదిలో పడింది. కాస్సేపయాక అతనికి ఉన్న ట్లుండి ఏదో జ్ఞాపకానికి వచ్చింది. రాత్రంతా స్వప్నం కన్నట్లు తలిచాడు. మంచు కప్పిన ఋతువులో చూసిన దృశ్యంలాగా కల కరిగిపోయింది. చాప చుట్టి పెట్టినప్పుడు ఏదో దప్పున క్రింద పడింది.

ఎర్రని గాజులు, పగిలిన తునకలు, చుట్టి బంగారు రేకులు కట్టినట్లున్న ఎర్రని జలతారు గాజుల తునకలు. మొదట మాళు వెళ్ళిపోయిందో లేదో చూశాడు. మాళు వెళ్లిపోయింది.

ఆ గాజుల తునకలని పట్టుకొని అతను తోటవైపు వెళ్లాడు. నీళ్లగుంట నిండి వుంది. గట్టుప్రక్కన గుంజపై పెట్టి గంపలో నుంచి కచ్చిక తీసుకు న్నాడు. తడిలేని ఒక రాతిమీద కూర్చున్నాడు.

విరిగిన గాజు తునకలను ఒక్కొక్కటీగా తీసి నీళ్లల్లో పారవేశాడు. అవి మిణుగురు పురుగుల్లాగా నీళ్ళల్లో వెళ్లిపడ్డాయి. అవినీళ్లల్లో పూర్తిగామును గిపోయే వరకు అలా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఆ ఎర్రగాజులు నీళ్లల్లో తేలి, కాస్సేపటికి అడుక్కిపోవటం అతను స్పష్టంగా చూశాడు.

మనసులో ఏదో వ్యథ, దుఃఖము గూడుకట్టుకున్నాయి. అయినా అంత రాంతరాలలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం పెల్లుబికింది. ఒంటరిగా కూర్చుని అవిషయమై ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

* * * *

మధ్యవర్తులు పలువురు అక్కడికి వచ్చారు. దీర్ఘచర్చలు సాగాయి. కానీ ఏ నిర్ణయమూ జరగలేదు.

వసారాలో భాగవ్యవహారాలు గురించిన సంగతి విని, లోపల అమ్మ మ్మకి అక్కడ ఉండ బుద్ధిపుట్టలేదు. అరవైఏడు సంవత్సరాలుగా ఆమె కాపు రంచేసిన పెద్ద ఇల్లది. అందులోనే తన శేషజీవితాన్ని గడిపి మరణించాలని

ఆమె కోరిక. నిత్యము ఆ విషయం పైకి అనటం ఆమెకి పరిపాటి అయి పోయింది.

చిన్నమామని చూసినప్పుడంతా అమ్మమ్మ "నేను చచ్చిన తర్వాతనే ఈ యింటిసామాన్లు, కుండలను భాగించుకోండి," అనేది.

చిన్నమామ ఏమీ జవాబు చెప్పటం లేదు.

పడవల మడువు గట్టునున్న మూడు పంటలు పండే వరిపొలం తన భాగం రావాలని పెద్దమామకి ఆశగా వుండేది.

"నేనూ, నాబిడ్డలు కష్టపడాలి. మాతరపున మాట్లాడే వారెవరున్నారు?" అనేది పెద్దమ్మ.

"వక్కీలు" అని పల్లెప్రాంతములో పిలిచే మధ్యవర్తి కుమారనాయర్ను, కోరుకుట్టి పణిక్కర్ను ఆ ఇంటికి రాని రోజులు లేవు. పంపకాలు అంత సులభంగా జరగటం సాధ్యంకాదనే పణిక్కర్ చెప్పాడు. దున్నే పొలము, యితర భూమి అక్కడా, అక్కడా చెదురుమదురుగా వున్నాయి. కొలతలు తీసి వెల నిర్ణయించవలసివుంది. కొన్నిటిపై అప్పులున్నాయి. భాగాలు చేయాలి. ఇవన్నీ చేయడానికి ముందు ఎవరెవరికి ఏం పంచాలో నిర్ణయంచేయాలి.

పెద్దమామకు ఆ ఇంట్లో రెండు భాగాలు కావాలని అతని వాదం. కొన్ని సంవత్సరాలుగా ఇంటిలోని వ్యవహారాలు అతని చేతులమీదుగానే జరుగుతున్నాయి. కనుక పెదకుమార్తెకు, పెద్దకుమారునకు రెండు భాగములు ఇవ్వటం ఆ కాలపు సంప్రదాయము. తన వల్లగదా ఇంటికి ఇంత సంపద, అభివృద్ధి సంక్రమించాయి. ఈ విషయం కుమారన్‌నాయర్ చిన్నమామతో చెప్పినప్పుడు అతను ఏవగించుకున్నాడు.

"అభివృద్ధి! అభివృద్ధిపొందింది ఇల్లుకాదయ్యా, పువ్వులతోట!"

పెద్దమామ. చిన్నమామ ఒకరినొకరు తిన్నగా చూసుకోవటంలేదు పణిక్కర్ కుమారన్ మాత్రమే వారికి మధ్యవర్తిత్వం జరుపుతున్నారు. రెండు పొలాలు ఉత్తరాదినవున్న భూమిని తనకి యిచ్చేందుకు ఒప్పుకుంటేగాని, భాగము చేయటానికి అంగీకరించనని పెద్దమామ స్పష్టముగా చెప్పాడు. లేకపోతే ఎలా భాగాలు పంపకం అవుతాయో చూస్తానని బెదిరించాడు.

అప్పుడే అక్కడికి మధ్యవర్తిత్వానికి పల్లె అధికారియైన నంబ్యార్ వచ్చాడు.

ఆ రోజు అప్పుణికి శలవురోజు. ఆ సంవత్సరమే ప్రభుత్వ పరీక్షలు. కష్టపడి చదువుతున్నాడు. ఆరోజు తీర్పుచేసేదినమని ముందే విన్నాడు. ఆరోజు చక్కిలు కుమారన్ నాయరు, కోరుకుట్టి పణిక్కరు వచ్చినప్పుడు దక్షిణవైపు గదిలోకి వెళ్ళి నిలబడ్డాడు.

అధికారి ఆ తరువాత వచ్చాడు. చుట్టుపక్కల నంబ్యార్ పల్లెటూరి ప్రముఖుడు. అతను వచ్చిన తర్వాత పైనుంచి ప్రత్యేకం పడకకుర్చీ తెప్పించారు. తాంబూలం తెప్పించటానికి ఏర్పాట్లు జరిగాయి.

దక్షిణ వైపు అరుగు ప్రక్కన పెద్దమ్మ ఆమె కొడుకులు కూర్చున్నారు.

ఇంటి గుడి నిర్వాహముగురించి మళ్ళీ గుడికి కావలసిన భూముల నిర్వహణగురించి మాటలు సాగనారంభించి, పెద్దమామ, అధికారి మాట్లాడుకోవటం ప్రారంభించారు. ఆలస్యానికి కుమారన్ నాయర్ విసుగు చెందినట్లు కనిపించాడు.

"అప్పుడైతే కుంజుకృష్ణనాయరూ, మఱియొకపాలు కావాలంటే ఇప్పుడే యిక్కడ చెప్పేయండి. తర్వాత ఏంచెప్పినా లాభంలేదు"

అంటూ అధికారి అసలు విషయానికి వచ్చాడు.

పెద్దమామ వాకిట్లోకిదిగి వాకిలిలో అరటితోట దగ్గరకి వెళ్ళి ఎంగిలి ఊసి మళ్ళీ వచ్చి "ప్రారంభించండి" అన్నాడు.

అధికారి బిగ్గరగా నవ్వాడు. "అలాఅంటే పని కుదరదు."

"భాగం పంచుకుంటే నాదేం పోయింది. నా తలమీంచి ఒక భారం తీరిపోతుంది అంతే అసలు విషయం ఏమిటంటే....."

"ఏంచెప్పాలో చెప్పండి."

"ఈ ఇంటి వ్యవహారం అధికారివద్ద చెప్పి తీర్చాల్సిన అవసరంలేదు. అచ్చుమాన్ ఉన్నకాలములో నాయరు కులంలో కల్లా చెప్పుకోతగ్గ పలుకుబడి వున్న కుటుంబంగా ఇది పేరుపొందింది."

"నాకు తెలుసు. నాకు తెలుసు."

"అదే చెపుతున్నాను. అధికార్లకు తెలుసును. ఈ కాలపు చిన్నవాళ్ళకేమీ తెలియదు. అప్పుడు పాలు పంచినప్పుడు అరువైనాల్గు మంది పని వాళ్ళుండేవారు. భాగంచేయటం మొదలు పెట్టినప్పుడు లక్ష్మీ ప్రసన్నత కరువయింది. కానీ ఇది భగవతి ప్రసన్నమైనస్థలం. అదీ అధికార్లకు బహుశః తెలిసివుండాలి.

అధికారి, "తెలుసు, తెలుసు," అను అర్థముతో తల ఆడించాడు.

"కానీ, ఇంకో సంగతి కూడా అధికార్లు వినండి. ఆ పూర్వసంపత్తి ఈ పాతయిల్లే యిహ మిగిలాయి. నేనంత మాత్రం, చెడుతలంపులు లేకుండా ఒక అవగింజైనా మోసంచేయకుండా ధాన్యమంతా చేరుస్తూ వచ్చాను. నామూలంగానే ఇంటి వ్యవహారాలు సక్రమంగా జరుగుతూ వచ్చాయి, కానీ ఇప్పుడు పరస్పరం తగవులాడుకుని, గరిటెలు, పళ్ళాలు భాగం చేసుకోవటం.....

పెద్దమామ కొంచెం ఆగాడు. మళ్ళీ గంభీర స్వరంతో ఇలా అన్నాడు "ఐందేదో అయింది. ఈ ఇల్లు నాశనం కావటానికి అట్టే రోజులులేవు."

అప్పుడు లోపలనుండి మెల్లిగా ఓ కంఠం "ఎలాగో నాశనమవుతుంది." అనటం వినపడింది.

చిన్నమామ కాస్త ముందుకి రావటం అధికారి చూశాడు.

"చిన్న నాయరుకి సంవత్సరానికి లెఖ్ఖలు వ్రాసి చూపిస్తే చాలదా? ఎందు కోసరం భాగాలు పంచాలి?"

పెద్దమామ దానికేమీ ప్రత్యుత్తరం ఇవ్వలేదు. వకీలు కుమారన్ నాయర్ ఒక వెర్రివానిలాగా నవ్వుతూ ఇలా అన్నాడు.

"ఇక్కడ చిన్న నాయరు ప్రత్యుత్తరం చెప్పవలసిన అవసరం—".

"నాకు తెలుసును. నాకు తెలుసును." అధికారి అతని మాట పూర్తి అయేందుకు అనుమతించలేదు, "మీ కలవరపాటుచూస్తే భాగంమీకు పంపకము అవుతోందా అన్నట్లు వుంది."

వకీలు కుమారన్ నాయర్ మళ్ళీ ఓ వెఱ్ఱినవ్వు నవ్వాడు.

"ఏమిటి చిన్న నాయరుగారు?"

"దానికి కొంచెము అవకాశం కావాలి"

చిన్నమామ లోపలనుంచి నట్టింటివదకు వచ్చి నిలబడ్డాడు. అధికారి కూర్చున్న కుర్చీ చేతులు పట్టుకొని ఇలా అన్నాడు.

"అధికారీ, నేను చెప్పేది కూడ మీరు వినాలి. నాకు వయసు అయింది పధ్నాలుగేళ్ళ పిల్లకి తండ్రిని నేను. గోచిపాత కట్ట నారంభించినప్పట్నుంచీ నేను పంటపనిలో పడ్డాను. అలా కష్టపడినందుకు నాకేమి కొబ్బరి గెలలు దొరికాయి? సంవత్సరానికి నాలుగు ధోవతిలు, కలిమడు వడ్లు! అధికార్లు!

చెప్పండి. వేరెవరింటిలోనైనా ఈ మాత్రం కష్టపడి పనిచేస్తే దీనికంటే ఎక్కువగా ధొరికివుండదూ?"

అధికారి కదలక నిశ్శబ్దముగా వింటున్నాడు.

చిన్నమామకు చెప్పాలనిపించినవన్నీ చెప్పలేదింకా.

'ఈ ఇంటి వ్యవహారాలు చూసి పడినకష్టాలను ఇక్కడ చెబుతున్నాను. అల్లుళ్ళు, బిడ్డపాపలు బాగుండాలని కదా కష్టపడి ఇక్కడ ఇన్ని విధాలుగా పాటుపడ్డాను. అతని బంధువులేకదా గుంపుగాచేరి తిని తిరుగుతున్నారు. భాగాలు జరిగితే కుటుంబమేమీ నాశనంకాదు.'

పెద్దమామ అప్పుడు కోపంతో చిందులు తొక్కుతాడనే అందరూ వూహించారు. కానీ అలా జరగలేదు. పెద్దమామ ఏమీ మాట్లాడక వుండటం ఆశ్చర్యకరముగా తోచింది అప్పుడికి.

చిన్నమామ బిగ్గరగా ఇలా అన్నాడు.

"అధికార్లు! ఇదికూడా వినాలండీ. ఉత్తరాది ఇంట్లో ఏంజరిగినా అతనికి పట్టటంలేదు. కేవలం పువ్వులతోట గురించే తాపత్రయమంతా."

పెద్దమామ తాను కూర్చున్న స్థలంనుంచే మామని ఒక్కసారి ఉరిమి చూసి అదురుతున్న కంఠంతో,

"ఏమిటిరా?" అని కేకవేశాడు.

"ఇంతవరకు సహించి ప్రయోజనంలేదు. సరైన వ్యక్తి ముందే అంతా చెబుతాను."

"కృతఘ్నుడా! చెప్పరా ఇంకా చెప్పరా నీ తండ్రి సంపాదించిన సొత్తా అక్కడికి నేనెత్తుకొనిపోయిచ్చింది? నీ తండ్రి యొక్క....

అధికారి శాంతపరిచాడు.

"ఊరుకో కుంజుకృష్ణనాయరూ. యువకుడు. ఆలోచించకుండా మాట్లాడటం వాళ్లకి అలవాటు."

"నాకు చెప్పేందుకు భయమేమీలేదు. అక్కడికి కొనిపోయి చేరుస్తున్నారు. వారింట్లో నుంచి ఎవరైనా వస్తే, నాపెళ్లాంబిడ్డలు గిడ్డంగిలో నుంచి బియ్యం పప్పులన్నీ తీసుకునివచ్చి అన్నీచేసి పెట్టాలి. పువ్వులతోట వారింటి పనివాళ్లుగదా యిక్కడింటి కూతుర్లు, కొడుకులు. కానికి గతిలేనివారందరూ."

దక్షిణవైపు గదినుంచి అమ్మమ్మ మధ్యకి వచ్చి గట్టిగా కేకపెట్టి,

'చిన్నవాడా, నలుగురికీ భయపడి అయినా వూరుకోరా.'

చిన్నమామ ఆవేశంతో మళ్లీ చెప్పనారంభించాడు. మాలమాదిగలాగా పనిచేయాలి. గొడ్డులాగా జీవించాలి. నేనొక్కడినే శ్రమపడితే ప్రయోజనం వుంది.

"ఏదో దారి చూద్దాం."

పెద్దమామ వాకిట్లో చెప్పులు వేసుకొని అటూ ఇటూ తిరిగి నడవసాగాడు. చెప్పవలసినవన్నీ చెప్పకోనీ అనే బావం ముఖములో స్పష్టమయింది. ఆ తర్వాత చిన్నమామ మౌనంవహించాడు. పెద్దమామ అధికారిముందు నిలిచి,

"అధికారీ అతను నోటికి వచ్చినదల్లా వాగుతున్నాడు అతన్ని-అతన్ని...." పెద్దమామకు ఊపిరి అడనట్లయింది, "ఈ కుర్రాడికి తండ్రి పోయాక అరటి చెట్టు, పనసచెట్టు ఏదో భేదం తెలియని వయస్సు. నేనే ఇతన్ని కాపాడింది. అటువంటి వాడిప్పుడు నాపై నేరారోపణచేసేందుకు వచ్చాడు. ఈ యింట్లో ఇలాగెప్పుడూ జరగలేదు."

క్షణం ఎవరూ మాట్లాడలేదు. పెద్దమామ మళ్ళీ ప్రారంభించాడు.

"అధికారీ, ఇక భారాన్ని నేను మోయలేను భాగించండి. అధికారెట్లా చేస్తారో చేయండి.,.

లోపల అమ్మమ్మ తన చీరకొంగుతో కళ్లు తుడుచుకుంది.

"ఈ ఇంటి భారమంతా మోసినందుకు సరియైన ఫలితమే లభించింది అందుకనే నాకు రెండు భాగాలు కావాలని చెబుతూంట. వీళ్ళ డబ్బు ఓ చిల్లిగవ్వకూడా వద్దు. కుటుంబంలోని పెద్దకి ఇలా రెండు భాగాలు యివ్వటం లోక రివాజు."

"అలా ఏం కుదరదు." చిన్నమామ మళ్ళీ గట్టిగా అరిచాడు

అధికారి చిన్నమామని సమాధాన పరచాడు.

"అలా అనకూడదు చిన్ననాయరూ. అలాచేయటం లోకసమ్మతం కాదా?"

"ఆ రోజులు మారిపోయాయి."

అప్పుణికి ఇంక వినే ఓపిక నశించింది. ఇంతలో మీనాక్షమ్మ వచ్చి పిలిచింది. వంటింటి ప్రక్కనున్న కట్టెలు తీసి ఇవ్వమని. అతను చేసే సహాయాల్లో ఇది ఒకటి. మీనాక్షమ్మ నిచ్చెన పట్టుకుంది. అప్పుణిపైకి ఎక్కి కట్టెలు తీసి క్రిందికి ఇస్తున్నాడు.

ఇంట్లో ఏం జరుగుతుంది? ఒక నాటకం చూసినట్లు అతనికనిపించింది. రంగస్థలంమీద ఇద్దరు మామలు అభినయిస్తున్నట్లనిపించింది.

ఆ సాయంకాలమే అధికారి నంబ్యార్ తిరిగి వెళ్ళిపోయాడు. కుమారన్ నాయరు నిరాశతో యింటికి వచ్చినప్పుడు పెద్దమామ,

"ఏమిటి, ఏదైనా తీర్మానానికి వచ్చినట్లేనా?"

అనడిగింది పెద్దమ్మ. ఉత్తరాదిన వున్న భూమి, ఇంకా భాగములు....

వక్కీలు కుమారన్ నాయరు ఆ ఇంటి క్షేమంకోరే వ్యక్తి. అతను అమ్మమ్మ దగ్గిర శలవు పుచ్చుకోవటానికి లోపలకు వచ్చినప్పుడు అమ్మమ్మ,

"కుమార్ ఒక పనిచెయ్యగలవా?"

"ఏమిటి?"

"నాకు ఏవీ ఒద్దు. కేవలం ఒక మామిడి చెట్టునీడ చాలు."

వక్కీల్ కుమారన్ నాయరు ఆమె ఏంచెప్పుతున్నదీ అర్థంకాలేదు.

"నేనేం చేయాలమ్మా?"

"నేనిక్కడే, ఈ యింట్లోనే కన్ను మూయాలి. అదే నా కోరిక. అందుకు మీరంతా సమ్మతించేలా లేరు."

"నేనేం చేయను"

"ఏం చేయవద్దు"

అతను మౌనంగా కాస్సేపు నిలబడ్డాడు. ఆ తర్వాత మెల్లిగా బయటకి వెళ్ళిపోయాడు.

కొన్ని రోజులవరకు ఏ మాటలూ జరగలేదు. తిరిగి ఇంట్లో శాంతి నెలకొన్నట్లు అనిపించింది. కానీ మళ్ళీ కలవరం రేగింది.

పెద్దమామకు రెజిష్టర్ నోటీసు వచ్చింది. చిన్నమామ వాదిగాను, ఇతరులందర్నీ ప్రతివాదులుగా ఆ నోటీసు ప్రకటించింది.

మధ్యలో అమ్మణిని పిలవటం జరిగింది.

"ఎక్కడున్నావు అమ్మణీ?"

అమ్మణి గిడ్డంగి గదిలోనుంచి వచ్చింది.

"రేపు నువ్వు నీతల్లింటికి వెళ్ళు. ఇది ఇకమీద నీతండ్రి ఇల్లుకాదు....."

అమ్మణి దీనికేమీ సమాధానం చెప్పక నిలుచుంది.

"నీకొక ఇల్లు నీ వాళ్ళుండగా ఇక్కడకు వచ్చి వుండవలసిన అవసరం లేదు."

అమ్మణి మెల్లిగా లోపలికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి అప్పణి మూలగదిలో మేలుకొని వున్నాడు. అందరూ నిద్ర పోయారు. తెల్లవారుతుండగా స్వప్నంలాగా ఒకరాత్రి జరిగిన సంఘటన తాలూకు తలపులు జ్ఞప్తికి వచ్చాయి.

అమ్మణి వెళ్ళిపోతే ఇక తిరిగి రాదా?

అమ్మణిని సూటిగా చూసినప్పుడు మునుపంతా ఏదో అసూయతో కూడిన ఆశ నిండేది. ఇప్పుడు ఏదో బిడియంగా వుంది. ఆమె తన పొడుగైన కేశములను దువ్వుతుంటే చూడటం తనకి సరదా. కిటికీ ద్వారములో సాయంకాల వేళల్లో ఆమెకి తెలియకుండా కొద్దిగా చీకటి పడుతున్నప్పుడు ఆమెని తదేకంగా చూసేవాడు. ఆమె వాకిట్లో నిలబడితే చూడటం అతనికి మహా ఇష్టం.

చలిగా లేదు. అతను ఊరికే ఏదైనా శబ్దం వస్తుందేమో అని ఎదురు చూస్తున్నాడు. బహుశ అమ్మణి నిద్రపోయుండాలి. ఆ గదిలో శబ్దము ఏదైనా వస్తున్నదా?

మేడమెట్లు మీద ఏదో, అవును శబ్దం వస్తున్నది. గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఎవరో వస్తున్నట్లు అలికిడి. అతని శరీరాన్ని ఎవరో స్పృశించి నట్లు అనిపించింది. అతను ఆ చేతులను గట్టిగా పటుకొన్నాడు. లేచి ఏదీ మాట్లాడ లేక చాపమీద కూర్చున్నాడు అమ్మణి పావడకట్టుకుంది అతని భుజాలపై చేతులువేసి గట్టిగా పట్టుకుంది. వారిద్దరూ ఏమీ మాట్లాడక మౌనంగా కూర్చున్నారు. ఎంతసేపు అలా కూర్చున్నారో వారికే తెలియదు.

"అప్పణీ!" మెల్లిగా ఆమె పిలిచింది. ఆమె వ్రేళ్ళు అతని వీపుమీదుగా అటూయిటూ కదులుతున్నాయి.

"రేపు నేను వెళ్లిపోవాలి అప్పణీ"

అప్పణికి ఆమె ముఖాన్ని చూడాలనిపించింది. చీకటి ఏమీ చూడడానికి వీలులేదు.

మళ్లీ ఎప్పుడు తిరిగి వస్తుందోనని అతను అడగలేదు. కాని ఆ విషయం

అడగాలని తహ తహలాడింది. తన కంఠాన్ని పెనవేసుకున్న చేతుల గాజులని అతను మృదువుగా తిప్పుతున్నాడు.

"అప్పణీ, నా వూరికి రావా?"

"రాలేను. ఎలా వచ్చేది?"

"నేను ఇక్కడికి ఇకరాలేను...."

"మాటాడవేం? నా మీద కోపమా?"

"ఊ."

"అప్పణి, నువ్వు పెద్దవాడవయ్యాక నన్ను మరువకూడదు. మరచిపోవు కదూ!"

"లేదు. మరవలేదు. గ్యాసుదీపాలు ముందు ఒకవైపు వేలాడుతున్న తలవెంట్రుకల అలలతో వక్క పువ్వుల గొత్తు చేతుల్లో పట్టుకుని నాట్యం చేసిన ఆ దృశ్యాన్ని అతను మరవలేదు.

"లేదు."

అంతే అతను సమాధానం ఇచ్చింది. కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. గుండె దడ దడ కొట్టుకుంటోంది. ఇంకా ఇద్దరూ అలాగే కూర్చున్నారు.

"నేను వెళ్లిపోతున్నా, అప్పణీ. ఇక నిద్రపో."

"లేచి నిలబడేముందు అతని చెవి దగ్గర తన నోరు పెట్టి నవ్వు దుఃఖము మిళితమైన కంఠంతో అమ్మణి మెల్లిగా,

"నిన్ను భయపెట్టేందుకు ఇక అమ్మణి....రాదు" అన్నది.

మెట్లుమీద మళ్లీ శబ్దం వినపడింది.

ఒంటరిగా కళ్లు తెరచి పడుకొని వున్నప్పుడు ఏదో దుఃఖం కలిగింది.

మరునాడు. తెలతెలవారుతుండగా అమ్మణి ఊరికి బయలుదేరింది. పెద్దమామ కొక్కెములో వ్రేలాడుతున్న వస్త్రముతీసి పైన కప్పుకొని, గొడుగు పట్టుకొని ఇంటి మెట్లు దిగాడు.

అమ్మణి ఒక్కొక్కరివద్దకు వెళ్లి 'వెళ్లొస్తా' నని చెప్పిన తర్వాత అప్పణి వద్దకొచ్చి నిలబడింది. అప్పణి వాకిట్లో వున్న కసువుగడ్డి మూటల ప్రక్కన పాకుడు గోడదగ్గిర నిలబడి ఆగోడమీద ఏదో చిత్రం గీస్తున్నాడు.

ఆమె వెళ్లటం చిత్రం గీస్తున్నాడు. అప్పణి చూడలేదు. లోపలికి

వెళుతున్నప్పుడు దూరంగా ఏదో నీలం రంగు జాకెట్టు చెదిరిపోయినట్లు మసకగా కనిపించింది.

* * * *

ఆరోజు తెల్లగా తెల్లవారాక అప్పుడే బడికి వెళ్ళాడు. ఉదయం గంజి దొరకటం లేదు. కొన్ని రోజులుగా సమయానికి అన్నం దొరకటంలేదు. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. గిడ్డంగిలోని బియ్యం పెద్దమామ దుకాణాదారుకి అమ్మేశాడు. వడ్లు కావాలని అడిగేందుకు వెళితే పెద్దమామ తిట్లు తగవులా ప్రారంభించేవాడు.

కొన్నిరోజులుగా పెద్దమామ ఇంట్లో ఉండటం లేదు. పువ్వుల తోటకు వెళితే మళ్ళీతిరిగిరావడం పది పన్నెండు రోజులు తర్వాతనే. వక్కలు కోయడం కొబ్బరి కాయలు దింపడం ఇటువంటి పనులకు మాత్రమే ఆయన వచ్చి తనిఖీ చేస్తున్నాడు. ఇంటి ఖర్చులు చూస్తే భాధ్యత ఏదీ లేనట్లు ప్రవర్తిస్తు న్నాడు.

ఇంట్లో భోజనానికి కావలసిన సరకులు తేవటంలో చిన్నమామ ఏమాత్రం ఆసక్తి చూపడం లేదు. తను వచ్చే వేళకి ఇంట్లో అన్నం పెట్టకపోతే మీనాక్ష మ్మని కోపంగా తిట్టేవాడు.

ఇరుగు పొరుగు వారింట్లో నుంచి వడ్లు, బియ్యం అప్పు తెచ్చేందుకు పోయేది మీనాక్షమ్మ, "ఇదంతా నాయోగం" అనేది.

పనివారికి, గుత్తదార్లకు పెద్దమామ, చిన్నమామకు ఏదీ డబ్బు ఇవ్వ కూడదని, ఉత్తరువు ఇచ్చాడు. చిన్నమామ మరో మార్గం అవలంబించాడు. సర్పతోటకు ప్రక్కనున్న పెద్ద మామిడి చెట్లని నరికి హసన్ కుట్టికి అమ్మే శాడు. ఒకమూట వడ్లు ఇంటికి తీసుకు వచ్చాడు.

మిగతా డబ్బు గురించి పెద్దమ్మ అడిగినదానికి ఇలా సమాధానం చెప్పాడు

"నీ పనేదో చూసుకో అనవసరంగా మాట్లాడక" అన్నాడు.

ఆ చెట్లని నరికేందుకు, కొట్టేందుకు పనివాళ్ళు ఇంటి నడవలోకి వచ్చారు. వారిలో ఒకడు దాహం వేసి ఉత్తరాదివారింట్లోకి వచ్చినప్పుడు ఈ సంగతి అమ్మమ్మకు తెలిసింది.

ఆ పగలంతా ఆమె ఏడుస్తూ పడుకుంది.

మూడు నెలల్లో పొలంలోని చెట్లు అన్నీ నరికివేశారు. ముందు భాగం లోని స్థలమంతా ఖాళీ అయిపోయింది.

ఆ యింట్లో వుండటం ఒక్కొక్క క్షణం కష్టముగా తోచింది అప్పుణికి. ఏడుస్తున్న అమ్మమ్మ, ఎప్పుడు చూసినా కఠోరంగా కోపం చూపుతున్న పెద్దమ్మ, పడగెత్తిన నల్లనాగుపాములాగా, అతి వేగముగా అడుగులు వేస్తూ కేకలువేస్తూ కోపముతోవున్న పెద్దమామ, ఏదో ఒకటి అరుస్తూ తుఫానులాగా ఇంటికి వచ్చే చిన్నమామ - ఇదేమిటి ఎటువంటి మనుష్యులు వీళ్లు?

అతని మనసులో జుగుప్స! క్రోధం నిండిపోయాయి. మీనాక్షమ్మని చూస్తే మటుకు ఏదో ఒక విధమైన జాలి కలిగేది. ఉత్తరంవైపు గదిలోనుంచి గుడిసెలోపల ఎవరికీ తెలియక వడ్లు మోసుకొని వక్కతోట పక్కగా వస్తున్న ఆమెను చూసినప్పుడు ఓమాటు అప్పుణి కంట్లో నీళ్లు నిలిచాయి.

దేవుడు సుఖము, దుఃఖము మనుష్యునికి ఇస్తాడా? అయితే ఆమెకి మాత్రమెందుకాదైవం సుఖమివ్వలేదు?

బడినుంచి వస్తూ అప్పుణ్ణి ఇలా ఏదేదో ఆలోచిస్తూ నడిచేవాడు. స్నేహితులు అతన్ని దాటుకుని ముందుకి వెళ్ళిపోయేవారు.

భాస్కరుడు అంతకు క్రితం సంవత్సరం ప్యాసవ్వలేదు. ఇప్పుడు తొమ్మిదవ తరగతిలో చదువుతున్నాడు. ఇంట్లో ఎటువంటి కలవరాలు కలిగినా భాస్కరునికిగాని, కృష్ణకుట్టికిగాని ఎట్టి చింతలు లేవు. భాగ్యవంతుల కుటుంబములో నంబూదిరికి పుట్టినవారంటే అట్లానే వుంటుంది మరి?

ఓరోజు బడినుంచి వస్తూంటే దారిలో మండపం దగ్గిర ఎవరో నిలబడి వున్నారు. అప్పుణి అది గమనించలేదు. దగ్గరకొచ్చినప్పుడు అతను ఊరికే తనవంకే చూస్తున్నట్లు అనిపించింది. అప్పుడే అతనికి స్ఫురించింది, శంకరన్ నాయరని.

"అప్పుణీ" అతను దగ్గిరకొచ్చాడు.

"అప్పుణీ" అప్పుణి తల తిప్పేసుకున్నాడు.

తిరిగిచూడలేదు. కాస్త వేగముగా అడుగులు వేస్తూ నడిచాడు. కొంచెం దూరం వెళ్ళి తిరిగి చూశాడు. అతను కనబడలేదు.

దారిలో కలుసుకుని తనని ప్రసన్నం చేసుకుందామని వచ్చాడు. తనకి అన్నీ తెలుసు. ఎంతో సహించాడు. వరదలు వచ్చాక మరోచోటికి వెళ్లిపోయారు. జరిగిన సంగతి అందరికీ తెలుసు. ఆ విషయం పెద్దమ్మకు తెలిసినప్పుడు ఏమేం అన్నదో వినేందుకు ఎంతో కష్టమయింది. ఇలా ఆలోచిస్తూ అతను లోపలికి వెళ్లాడు.

ఆ రోజు మొదలు, ఏదో తన శరీరాన్ని కట్టివేసినట్లు సదా తనతో వుండే బంధనం తెగిపోయినట్లయింది. అవమానము, వేదన కలిగింది.

ఏదో చెప్పుకునేందుకు వచ్చాడు. కొబ్బరితోట శంకరన్ నాయరుకి తనకీ ఏమీ సంబంధం లేదని....

బడికి వెళ్లినప్పుడు గంట కొట్టి పదినిముషాలైంది. శంకర నారాయణ య్యర్ క్లాసు అది. ఆరోజు పంతులు రాలేదు. అందుకని డ్రాయింగ్ మాస్టారు వచ్చారు. పిల్లలకి అతని వద్ద భయం లేదు. క్లాసులో వేడుకలు జరుగుతు న్నాయి.

రెండవ పీరియడు మెమో ఒకటి చదవటం జరిగింది. పదిరోజులకు ముందే ప్రభుత్వ పరీక్షకు ఫీజు చెల్లించాలి, పదిహేను రూపాయలు.

అది పదవతేది. ఇంకా ఆరురోజులే వున్నాయి. పదిహేను రూపాయలు ఎక్కడ దొరుకుతాయి? ఉన్నట్లుండి అతనికి జ్ఞప్తికి వచ్చింది. అమ్మమ్మ దగ్గిర అతని డబ్బు ఉన్నది కదా. అందులోనుంచి చిన్నమామ తీసుకొన్న అప్పుని తిరిగి యిస్తేచాలు.

సాయంకాలం ఇంటి కొచ్చినప్పుడు అమ్మమ్మతో చెప్పాడు.

"పరీక్షకు ఫీజు కట్టాలి. పదిహేను రూపాయలు కావాలి ?"

"నాయనా! చిన్నమామని అడుగు నేను అతనితో చెబుతాను."

చిన్నమామని అడగాలని నిశ్చయించాడు. చిన్నమామతో ముఖాముఖి యింత వరకు మాట్లాడింది లేదు. కానీ, మాట్లాడేందుకు భయమేదీ లేదు. అతను తనపట్ల కాస్త ప్రియంగానే, ఆసక్తి కనబరుస్తున్నట్లు భావించాడు.

పెద్దమామ కొట్టిన రోజు తనకి జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు చిన్నమామ కదా తనని కాపాడింది. ఇంతవరకు అతనితో తాను మాట్లాడినది లేదు. అయినా, పెద్దమామ వంటి అమిత భయంకరుణ్ణి ఎదిరించి మాట్లాడిన అతను తన కంటికి ఒక వీర పురుషుడిగానే తోచాడు.

చిన్నమామ చాలా ఆలస్యంగా వస్తాడు. కొన్నిరాత్రిళ్లు రాడుకూడా.

మర్నాడు సాయంకాలం స్నానంచేసి తిరిగి వస్తున్నప్పుడే మాళు,

"నాన్నవచ్చాడు" అని చెప్పింది.

అరుగుమీద కూర్చున్నాడు చిన్నమామ. బీడి త్రాగుతున్నాడు. ఆముఖ భావం అతనికి ఎలాగో అనిపించింది. కొన్నిరోజులుగా చిన్నమామ ఆ లా గే కనిపిస్తున్నాడు.

కాని దగ్గరకెళ్లాడు. అతను తనని చూసినట్లు కనబడలేదు. కానీవెనక్కి తిరిగి చూసినప్పుడు,

"ఊం?" అని పలకరించాడు.

"పదవతారీకు పరీక్షకు డబ్బు కట్టాలి."

"అందుకు?"

"చిన్నమామా-?"

"అప్పు వసూలు చేయను వచ్చావా?"

"నేనేం చేసేది? – ఫీజు కట్టలేదంటే....?"

"నీ దగ్గర్నుంచి నాలుగు కాసులు తీసుకొనినందుకా, ఇది? నా దగ్గర డబ్బూలేదు, గిబ్బూలేదు."

ఏడుపొచ్చింది. అయితే ఏడవలేదు. కష్టం వచ్చినప్పుడు ఏడవరాదని అతనికి పాఠమైపోయింది.

అతను లోపలికి వెళుతుండగా, చిన్నమామ,

"ఇంకా నువ్వు చదివేసి కలెక్టరు కాపోతావా?" అన్నాడు.

ఆ మాటలు అప్పణి సహించాడు. దక్షిణవైపు గదిలోకి వెళ్ళినప్పుడు మాళు అడిగింది.

"దొరికిందా, అప్పణి యన్నా?"

అడగడానికి వచ్చింది. కోపంతో మాళునిచూసి,

"ఇక్కడ నుంచి 'వెళ్ళిపో" అని కసిరాడు.

ఆమె బిక్కమొఖాన్ని చూడకుండానే చీకటిలో నిండిన తన మూలగది లోకి వెళ్ళాడు

అమ్మమ్మ చాలా దుఃఖించింది.

"నీ అమ్మమ్మ చేతిలో ఏదైనవుంటే, నా తండ్రీ! నీ కివ్వలేకపోతానా?"

ఎవరి వద్దా ఏమీలేదు. అతను తన మనస్సులోనే అనుకున్నాడు తనకి ఎవరూలేరు.

మహమ్మదు తెలివిగలవాడు. డబ్బు ఎలా సేకరించాలో అతను సలహా చెప్పాడు. ఆ భారం తను వహించి, బడిలో స్నేహితులు కొందర్ని స్వయంగా వెళ్లి అడిగాడు. ఎవరి దగ్గరా దొరకలేదు.

"అప్పణీ, ఓ పనిచేస్తావా?"

"ఏమిటి?"

"భాస్కరుని అమ్మని అడగకూడదూ?"

"నాకు అడగటం ఇష్టంలేదు."

"నీ పెద్దమ్మ అనికదా చెప్పావు?"

"అవును. అయితే నేనడగను."

"రేపు డబ్బు కావాలిరా. ఆలోచించిచూడు."

"నేను అవమానం సహించలేను మహమ్మదూ,"

మహమ్మదు ఆ తర్వాత నిర్బంధించలేదు.

డబ్బుంది, పెద్దమామ, పెద్దమ్మ దగ్గిర. దానికోసరం వెళ్ళి అడగటాన్ని గురించి ఆలోచించటానికికూడ వీల్లేదు.

ఆ రాత్రి నిద్రరాలేదు. ఎన్నిరోజులు కష్టపడి ఈ బడిలోకి వెళ్ళాడు? అయితే బూడిదలోపోసిన పన్నీరు అవుతూంది. ఇప్పుడదంతా బూడిదలో పోసిన పన్నీరయింది.

రేపు నాలుగు గంటలకు ముందు డబ్బు చెల్లించాలి.

మహమ్మదు తన యింటికి వెళ్ళి, చుట్టుప్రక్కలవారి సహాయంతో కాస్త శ్రమపడి అడిగి చూస్తానని మాట ఇచ్చాడు. మధ్యాహ్నానికి కాస్త ముందుగా బడికి చేరుకోకపోతే డబ్బు దొరకలేదని అర్థం అని చెప్పాడు.

పరీక్ష వ్రాస్తే తప్పక ప్యాసవగలనని అతని విశ్వాసం. ప్యాసైతే ఎక్కడైనా పని దొరకుతుంది. ఆ తర్వాత - అప్పుడు తను ఎవరినుంచీ సహాయానికి ఎదురు చూడవలసిన అవసరంలేదు. అందరి ఎదుట తలెత్తుకు తిరగ వచ్చును

కానీ అన్నీ ఇప్పుడొక [illegible]యం మీద ఆధారపడి వున్నాయి. పదిహేను రూపాయలు డబ్బుదొరక్కపోతే పరీక్షకి ఫీజు కట్టడం వుత్తమాట.

సూర్యోదయానికి ముందే అతను లేచాడు. పళ్ళుతోముకొని తిరిగి వస్తున్నప్పుడు బావి గట్టుపైన మాళు నిలుచునుండటం చూశాడు. ఆమెని గమనించకుండా ముందుకి వెళ్ళిపోతుంటే,

"ఏమి అప్పణీ, ఇంత తొందరగా మేలుకొన్నావు?" అని అడిగింది.

అతను సమాధానం ఇవ్వకుండా ముందుకి నడిచాడు. తాను నాశనమై పోవటం చూడటానికి అందరూ కాచుకొని కూర్చున్నారు. తన కందరూ శత్రు

వులే. ఉషః కాలములోని మంచు ఆ పెద్ద ఇంటిమీద పూర్తిగా పడు తున్నది. లోపల ఉన్న అందరిపైన అతనికి ఏదో ఒక విరక్తి భావమేర్ప డింది.

తల దువ్వుకొని షర్టువేసుకున్నాడు. రాత్రి తడిసి తేమగా వున్న ధోవతి ఇంకా ఎండలేదు. మురికి ధోవతిని మార్చి, కట్టుకున్నాడు. రబ్బరు టేపుకట్టిన పుస్తకాల కట్ట తీసుకొని బయటికెళ్లినప్పుడు మళ్ళీ మాళు ఎదురుగా వచ్చింది.

"ఎక్కడికి ఈ వేళలో?"

"ఎక్కడికో అక్కడికి!"

వరండాలో అతను మళ్ళీ ఏదో ఆలోచిస్తూ నిలబడ్డాడు. గుమ్మం విడిచి దిగి తోటలోకి వెళ్ళినప్పుడు ఎక్కడికి పోవడం? అని ఆలోచించ సాగాడు.

ఆ రోజు నాలుగు గంటల కల్లా డబ్బు కట్టాలి.

ఎవర్ని కలుసుకోవటం? ఎవరి దగ్గరకెళ్ళి అడిగేది?

అలా నడుచుకుంటూ పోయాడు. తోటరోనుంచి గట్టుపైకెక్కి వీధిలోకి వచ్చాడు.

బడికి వెళ్ళాలంటే దక్షిణవైపు తోటదోవన పోవాలి. అతను తిన్నగా ఉత్తరవైపు దోవన నడిచాడు. గుంట ప్రక్కనున్న బాటలో పోతే చిన్నఅంగడి ఎదురవుతుంది. ఆ ప్రక్కకు వెళ్ళాడు.

ఆ పొలం గట్టుపై నడిచి కాస్సేపయాక అక్కడున్న పెద్ద తోటలోకి నడిచి, కొండ క్రిందకు వెళ్ళాడు. ఎందుకక్కడికి పోతున్నానని ఆలోచించ లేదు. అయితే నక్కల కొండ మధ్యగా పోతున్నప్పుడతనికి ఏదో జ్ఞాపకము వచ్చింది. తన ఇల్లు వదలి వచ్చిన ఆ రోజు ఉదయం కూడా ఇక్కడికే తను వచ్చింది. సైదాలికుట్టిని ఇక్కడే తను చూసింది.

కొండ ప్రక్క ఎండిపోయిన పచ్చగడ్డి మాత్రం చూశాడు. దానిమీద లేత ఎండ పడుతోంది.

ఆ బండమునుపు ఎట్లా వుండేదో సరిగా అలాగే వుంది. అతను దాని పైకెక్కి కూర్చున్నాడు. బాగా జ్ఞాపకానికి వచ్చింది. ఆ బండ మిట్టపైనే ఆ రోజు తను మునుపు ఎక్కి కూర్చున్నాడు. అది రెండేండ్లకు మునుపు జరిగిన సంగతి. అప్పుడు కొండలు, చుట్టూచెట్లూ, చేమలూ నిండియున్నాయి.

రెండేళ్ళు గడిచిపోయాయి. రెండేళ్లకు మధ్య ఎంతో జీవితకాలం గడచి నట్లు అనిపించింది,

రెండేళ్లులోపు తానెంత పెరిగాడు? అద్దంలో చూసుకుంటే తాను పెద్ద వాడు అయినట్లు తోచింది. అప్పుడు నిక్కరు, షర్టువేసుకున్న చిన్న కుర్రాడు. అప్పుడు ఆ అప్పుణి వద్దుదంచి బ్రతికే పనిగత్తె కొడుకు. ఎందరో మనుష్యులు జీవిస్తున్న ఈ లోకంలో తాను ఏకాకి అయిన ఒకమనిషి. యిప్పుడు ఎవరూ స్వంతము, బంధువులు లేకపోయారు. ఎవరికీ భయపడనక్కరలేదు.

ఎండసెగలు తగిలినప్పుడే అప్పుణికి బడి గురించిన తలపు వచ్చింది. బడికి పోవాలి. కాని, పదిహేనురూపాయల సంగతి!

ఆ రాత్రి నిద్రపోయేముందు మిద్దెపైన భగవతికి మ్రొక్కుకోలేదు. ఆ అలవాటు ఆ రోజు మాత్రం తప్పిపోయింది. ఆ కాలంలో పస్తుపడివున్నప్పుడు, ఏటిగట్టుదాటి వచ్చి అన్నంపెట్టిన దైవము వుండేస్థలము అది.

ఎండిపోయిన పచ్చ గడ్డివైపున తన నీడ పడుతోంది,

అప్పుణి లేచాడు. బడికిపోవాలి. క్లాసుమాస్టర్ని అడిగిచూద్దాం. లేదంటే హెడ్మాస్టరుగార్ని అడిగి చూద్దాం

"ఫీజు కట్టలేదూ?" అని అడిగితే చెబుతాను.

"లేదుసార్, నేను కట్టలేను."

"—ఈరోజుకదా ఆఖరిరోజు? నీకు తెలియదు?"

"తెలుసును, సార్."

"ఈరోజు డబ్బు కట్టలేదంటే పరీక్ష వ్రాసేందుకు వీల్లేదు తెలుసా?"

"తెలుసును సార్, తెలుసును."

"—ఒక సంవత్సరం పాడైపోతుంది."

"పోనివ్వండి సార్!"

"ఎందుకురా డబ్బు కట్టలేకపోయావు?"

"నావద్ద డబ్బు లేదు."

"ఇంట్లో?"—

"నాకు ఇల్లు లేదు, సార్, నాకెవ్వరూలేరు. నాకెవ్వరూలేరు."

"అయ్యో పాపం!"

"అలా అనకండి. నా కోసం ఎవరూ విచారించనవసరంలేదు."

ఇలాగా ఆ దృశ్యాన్ని ఊహించుకున్నాడు.

బడికి వెళ్ళినప్పుడు చాలా అలసిపోయున్నాడు. అటూ ఇటూ చూడక గేటుదాటి లోపలి కెళ్ళాడు. పెద్ద కట్టడములో వుండే గది గుమ్మం వరకు వెళ్ళాడు.

పచ్చకోటును, టోపీను వేసుకున్న భూగోళం పంతులు పాఠం చెబుతున్నాడు. పాఠం చెప్పేబదులు తన ఉత్తరభారతము యాత్రని ఎవరో ఒక దివాను కూతురికి తాను ట్యూషన్ చెప్పిన విషయం వల్లిస్తున్నాడు.

ముఖమెత్తి ఎవర్నీ చూసేందుకు ధైర్యం చాలలేదు. రెండవ పీరియడు జరుగుతోంది.

తరగతిలోని నలభైయైదు జంటల కళ్లు తనని చూస్తున్నాయి.

"గెట్ ఇన్" ఏంరా ఇప్పుడే తెల్లవారిందా?" అన్నాడు మాస్టారు.

అప్పుణి ఏం చెప్పలేదు. దీనంగాచూస్తూ నిలబడ్డాడు. మొదటివరుసలో ఎడమ వైపున్న బెంచి ముందు కూర్చున్నాడు. మహమ్మదు కుట్టి వచ్చాడేమో చూడాలనిపించింది. ఈ పీరియడు ముగియని అని ఊరుకున్నాడు

గంట కొట్టారు. మాస్టరు మ్యాపుని మడిచి తీసుకొని వెళ్ళినప్పుడు అతను తిరిగి వెనుక బెంచీవైపు చూశాడు. మహమ్మదు రాలేదు .

ఒంటిగంట బెల్లుకొట్టారు. బయటికి వచ్చిచూస్తే, చెమటోడుతూ గేటు వద్ద నిలుచున్న మహమ్మదు కనిపించాడు. డబ్బు దొరికిందా అని అడిగేందుకు నోరు పెకలలేదు. అతని కళ్ళల్లోను ముఖంలోను ఆ భావం నిండి వుంది

మహమ్మదు కళ్ళు మూసుకొని ఒక నవ్వు నవ్వాడు. చేతులు అతని భుజముపై వేసి.

"దొరికిందిరా!" అన్నాడు.

"దొరికింది" - జేబులోంచి మెల్లిగా రూపాయినోట్లు పదిహేను తీసి ఇచ్చినప్పుడు అప్పుణికి మహమ్మదుని గట్టిగా కౌగలించు కోవాలనిపించింది.

- "ఎక్కడనుంచి, ఎక్కడ నుంచి?"

"అది నీకెందుకు? నువ్వు ఫీజుకట్టు మొదట?"

"ఎప్పుడు తిరిగి యివ్వాలి?"

"దొరికినప్పుడు యిస్తే చాలును."

ఇంక అడిగేందుకు నిలవలేదు. వేగంగా ఆఫీసుకెళ్లాడు. రైటర్ కురుప్ అన్నం తినడానికి వెళ్ళలేదు ఇంకా. అప్పుడే ఫీజు కట్టాడు అప్పుటి.

సాయంకాలమైంది. బడివిడిచి పోయేప్పుడు మహమ్మదుతో ఇలా అన్నాడు.

"నేను డబ్బు దొరకదని అనుకున్నాను."

"నేనూ ఎక్కడెక్కడో అడిగాను. దొరకలేదు. ఉమ్మ యింటికి వెళ్ళి అడిగాను!"

"మరి ఎక్కడ దొరికింది?"

"ఉమ్మ ఒక తోటలోకి వెళ్ళింది. ఎక్కడెక్కడో అడిగి చూసి దొరకక మళ్ళీ యింటికొస్తున్నప్పుడు, ఒకరు డబ్బు తీసుకు వచ్చారు."

"ఎవరదీ మహమ్మదూ, ఎవరు?"

"ఎవరైతే ఏం?"

"ఎవరో చెప్పవూ"?

"చెబితే నీకు నచ్చదు...."

"చెబితే కదా తెలుస్తుంది—"

అప్పుణి ఏదో ఆలోచించాడు.

"ఎవరైతే ఏం నీకు?"

"నాకు తెలుసును. సహాయంచేసినది ఎవరని తెలుసును"

"డబ్బు యిచ్చి పంపించినది నీ తల్లియే."

"అమ్మ!"-అప్పుణి అలాగే నిలుచుండిపోయాడు." అది తీసికునుండ రాదు".

మహమ్మదు భుజాలని బలంగా నొక్కి పట్టుకొని కోపంతో అడిగాడు.

"అది అప్పుడే చెప్పలేదెందుకురా?"

మమహ్మదు ఏం చెప్పకుండా నవ్వుతూ అడిగాడు.

"ఏమిటిరా? ఆమె ఇచ్చిన రూపాయకు నూరు పైసాలు ఇవ్వరూ?" అది తీసుకొని ఫీసు కట్టావు. పూరుకో."

ఒంటరిగా ఉన్నప్పుడు మనసు ఏదో కలవరపడింది.

ఆ రాత్రి చదువుకునేందుకు దీపం, దొరికే వరకు కాచుకునుండాలి. ఎర్రని కిరసిన్ నూనెపోసిన చిమ్నీదీపం. పొగ ఎక్కువగ వుంటుంది. ఎట్లా పెట్టినా దీపపు పొగ తన ముఖంమీద వచ్చి పడుతోంది.

మాళ్ళు వెనుక వచ్చి నిలబడింది. అతను చూడలేదు. కాస్సేపటికి తిరిగి చూశాడు.

"ఫీజు కట్టావా, అప్పణియన్నా?" అని అడిగింది.

"ఊం" అన్నాడు,

"ఎక్కడిది?"

"ఎక్కడిదైతేనేం? నీకెందుకు?

ఈ పిల్ల అన్నీ తెలుసుకోవాలి! చిమ్నీదీపం మసక వెలుగులో గుంజపై జారినట్లు కన్నులు పొడుచుకు చూస్తున్న ఆమెని ఒక్కసారి తిరిగి చూశాడు. తడి తలలోనుంచి వస్తున్న దుర్వాసన అతని ముక్కునుతాకింది. మేకమెడలో దారంకట్టి వేలాడదీసిన పూసల్లాగా ఆమె కళ్ళు మిలమిలలాడుతున్నాయి.

మాట్లాడేందుకు ఆమె దగ్గరగా వచ్చింది. అతనికి కోపం వచ్చింది. దూరంగా వున్నప్పుడు జాలివేస్తుంది. ఆమె కేదీ భగవంతుడు ఇవ్వలేదు. కంటికి ఇంపయిన రూపంకూడా ఇవ్వలేదు పుస్తకంలోని పంక్తులు కళ్లముందు తిరుగుతున్నాయి. పుస్తకంమీద ధ్యానం మళ్ళించేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ఇంగ్లీషు మాస్టరు చెప్పిన దాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. కవి దూరములో, దక్షిణదేశములో నున్న ఒకస్త్రీకి సందేశం పంపిస్తున్నాడు. కవిఆస్త్రీను ప్రేమిస్తున్నాడు. పక్షి ద్వారా సందేశం పంపుతున్నాడు.

**Oh, were I then that she might take me in, And lay me on her bosom and her heart, would rock the snowy cradle till I "died."**

"నేనే నీవై వుంటే ఆమె నన్ను హృదయానికి హత్తుకుని ఆలింగనం చేసుకునేది."

మళ్ళీ ధ్యానంమళ్ళింది. అక్షరములు కంటికికనబడక చెదిరిపోయాయి. ఫళఫళలాడే ఒక నీలంపట్టు జాకెట్టు, కాటుకదిద్దిన అర్ధనిమీలిత నేత్రాలు... హాయినిచ్చే సుగంధం.....

ఛా, ఏమిటీ ఈ ఆలోచనలు ?

పరీక్షకు ఇక మూడు నెలలే వున్నాయి. అతను మళ్ళీ తన ధ్యాస చదువుమీదికి మళ్ళించాడు.

**"Lingereth she to clothe her heart with love, Delaying as the tender hours delay To clothe herself when all the woods are green."**

ఇప్పుడు అమ్మణి ఏం చేస్తోందో? అని ఉన్నట్లుండి ఆలోచించటం మొదలెట్టాడు. నిద్రపోతూ వుండాలి. మెత్తగావున్న పట్టు మంచంపై పడుకొని వున్నది. ఎర్రని గాజులు వేసుకున్న చేతులు తలగడ క్రింద అణిచి పెట్టుకొని పడుకుంది.

మునుపు ఏదో పాత పుస్తకములో చూసిన రాజకుమారి జ్ఞాపకం వచ్చింది.

నిద్రపోతున్న రాజకుమారి.

ఆ కథని తొమ్మిదవ తరగతిలో చదివినట్లు జ్ఞాపకం.

సంవత్సరములు గడిచిపోతున్నాయి. ఆ రాజకుమారి నిద్రపోతూంది. ఆ గదిలోకి రాజకుమారుడు వెళ్లాడు. అందమైన తెరని తొలగిస్తూ, మంచము దగ్గరకెళ్లి ఆమె బుగ్గపై ముద్దు పెట్టుకున్నాడు.

ప్రశాంతమైన ఆమె ముఖారవిందములో.................. ........ఏదో సిగ్గు తొంగిచూసింది. ఒక నిగూఢ ఆనందము వెలిసింది.

"ఇక నాకొక ముద్దు ఇవ్వు"

"ఇవ్వను"

"ఒక్కటి. నేనెన్ని ముద్దులిచ్చాను?"

మెల్లి మెల్లిగా వేళ్ళు మెడని తాకాయి. ఆ తర్వాత........? పైకీ క్రిందకీ లేస్తున్న రొమ్ములపై ముఖాన్ని ఆనించినప్పుడు శరీరమంతా, ఏదో తేలిపోయినట్లయింది.

తెలియని ఒక నూతన లోకంలోకి తట్టిలేపినది అమ్మణియే అనిపించిందతనికి. దీపం పొగ పుస్తకంపై నల్లగాపడింది. దీపాన్ని మరో ప్రక్క పెట్టి చదవసాగాడు.

"నువ్వింకా పడుకోలేదురా?"

ఏదో పనిమీద కిందికి వచ్చిన పెద్దమ్మ అడిగింది.

"తెల్లవార్లూ దీపం పెట్టుకొని వుండేందుకు నువ్వు డబ్బా నూనె తెచ్చి పెడుతున్నావా?"

అతను వెంటనే దీపాన్ని ఆర్పేశాడు. చీకటిలో మెల్లిగా తన మూల గదివైపుకి వెళ్లిపోయాడు.

*  *  *  *

పెద్దమామ పువ్వులతోటకు వెళ్లి ఒక నెల అయింది.

చిన్నమామ అమ్మలేకపోయిన కొబ్బరికాయలన్నీ కొబ్బరికాయల వ్యాపారి కుంజత్తోలుకి అమ్మేసి డబ్బు తీసుకున్నాడు. కుంజత్తోలు వచ్చి ఆ విషయం చెప్పాడు. వంటింటి తోటలోని కొబ్బరికాయలు మాత్రం ఇంటి అవసరానికి తీసుకోవచ్చు. మిగతావన్నీ అతనివే.

"నేను డబ్బు లెక్కపెట్టి యిచ్చాను. నా మనుష్యులు అవి కోసుకోవటానికి వచ్చినప్పుడు ఆ కాయలు కోసి వుంటే వూరుకోను" అన్నాడు.

ఇంట్లో అందరూ ఆ మాటలు విన్నారు.

ఉత్తరాది వారింట్లో భిక్షం, పప్పు బియ్యం తీసుకొని వెళ్లి బ్రతికిన వాడు కుంజత్తోలు. ఆ కుంజత్తోలు ఇప్పుడిక్కడికి వచ్చి వ్యవహారం మాట్లాడుతున్నాడు.

మకర మాసంలో కోతలు ప్రారంభమవుతాయి పెద్దమామ అనుమతి లేకుండానే పడవ గట్టులోని వరిపొలంలో కోతలు ప్రారంభమయ్యాయి. దక్షిణవైపు వడ్ల మోపులన్నీ పేర్చి పెట్టారు. ఇంట్లో అందరికీ భీతి, కలవరం కలిగాయి కొన్ని రోజులు పోయాక వడ్లు కోయడం ప్రారంభించి వుండవచ్చును.

ఈసారి పంట సమృద్ధిగావుంది. వరద గట్టు ప్రక్కన స్థలములో పంట బాగుంటుంది. మిగతా రైతులకు దొరికినది మన్ను మాత్రమే. నౌకర్లకు కూలి ఇచ్చిన తర్వాత అన్నీచేర్చి ఎండపెట్టి ఇంటికి తీసుకొని వచ్చారు. మిగతా వడ్లను గది లోపల పెట్టి తాళం వేసి చిన్నమామ తాళం చెవిని తన చేతిలో పెట్టుకున్నాడు.

ఇంకోరోజు కూలివారు వచ్చినప్పుడు ఇంట్లో అందరూ అదిరిపడ్డారు. వడ్లు అమ్మకానికి పెట్టారు.

పెద్దమ్మ ముందుకి వచ్చి అడిగింది

"కుట్టన్, వడ్లని అమ్మపోతున్నావా?

"అవును, అమ్మపోతున్నా."

"ఇంటికి, పిల్లలకు అన్నానికి కావద్దూ?"

"దానికోసరం ఇంట్లో వడ్లు వున్నాయి. ఇంకా కోతలున్నాయి."

"నీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే కష్టమే మరి".

"సేద్యం నేను చేస్తున్నాను. పంటకోయటం, కీటకాలుపట్టకుండా శుభ్రం చేయటం, అన్నీచేస్తున్న వాణ్ణి నేను. మీరేదీ అందుకు ఖర్చుపెట్టటం లేదు. నాకు తెలుసు."

"నీ యిష్టం చెలాయించడానికి ఈ ఆస్తి నీది ఒక్కడిదేకాదు."

"ఉత్తరం వైపు పంటకోసి, గదిలో పెట్టుకొని, పువ్వులతోటకి తీసుకొని వెళ్ళినప్పుడు ఏమీ మాట్లాడలేదేం? నాలిక లోపల ముడుసుకొనిపోయిందా?"

పెద్దమ్మ కోపంతో తిరిగి వెళ్ళిపోయింది. అమ్మమ్మ ఏదో అడిగినప్పుడు ఆమెమీద విరుచుకు పడింది. అప్పణిని, మాళుని కసితో తిట్టసాగింది.

పనివాళ్ళు గోనెసంచులు తీసుకొని వెళ్ళిపోయారు.

ఇంటిలోపల ఎవరు ఏదీ చెప్పినా అది ఒక పుకారుగానో తగవుగానో మారిపోయేది. ఎవరికీ ఎవరిమీదా విశ్వాసంలేదు.

అప్పణి ఈ తగవులన్నింటికీ దూరంగా వున్నాడు. వాదప్రతివాదాలలో పాత్ర వహించలేదు. అతని మనసులో ఒకటి మాత్రము తీవ్రముగా వుంది, ఎలాగైనా ఆ పొగలారుతున్న యింట్లో నుంచి బయటికెళ్ళిపోవాలి.

బడి విడవగానే, ఇంటికి వచ్చి పుస్తకాలు తీసుకొని చదవేవాడు చీకటి పడేవరకు చదివేవాడు. తర్వాత ఎక్కడైనా ఒకమూలగా చీకటిగావున్నస్థలంలో కూర్చునేవాడు. అన్నం తినే వరకు అలాగే కూర్చునేవాడు. అన్నం తిన్నాక దీపం దొరికేవరకు కాచుకొని వుండేవాడు. అట్టేసేపు దీపం వెలిగించి పెట్టుకునేందుకు వీల్లేదు కిరసిన్ చాలా ఖరీదు.

ఒక అన్నపు పలుకు క్రింద పడిపోయినా, కాస్త నీళ్ళు ఒలికినా ఇంట్లో అందరూ తగవులు ప్రారంభించేవారు

తెలతెలవారుతుండగానే అతను లేస్తాడు. కాకులు కూయక మునుపే మీనాక్షమ్మ లేస్తుంది. మంచుకురుస్తున్న ఉషఃకాలములో, తిన్నెపైకూర్చుండి ఉదయపు వెలుగులో, చదువుకునేవాడు.

ఎదురుచూసిన మార్చి పదిహేనవతేది రానే వచ్చింది. ఆరోజే పరీక్ష ప్రారంభం.

మనసులో ప్రార్థించేవాడు. బ్రతుకుటకు ఏదారీ లేదు....ఒక్కో పేపర్ని వ్రాసి ముగిసినప్పుడు ఏదో ఒక ధైర్యం కలిగింది. శుక్రవారం ఆఖరి పరీక్ష రాసిన తర్వాత పెద్దబరువేదో దింపినట్లు సంతోషం కలిగింది.

అయితే ఇంటికి వెళ్లినప్పుడు ఉత్సాహమంతా నీరుకారిపోయింది. అక్కడ చిన్నమామ, పెద్దమామ పోట్లాడుకుంటున్నారు.

ఎవరూ ఏమీ అడగలేదు. పరీక్ష ముగిస్తే యేం, బాగా వ్రాస్తే యేం. ఎవరికి పట్టింది.

అతను ప్యాసవుతాడు. ప్యాసవకపోయినా ఎవరికీ పట్టలేదు. అమ్మమ్మ మాత్రం ఒక్కొక్కప్పుడు ప్రేమగా.

"నువ్వు గొప్పవాడివి కావాలి." అనేది.

శలవురోజులు గడవటం కష్టం. కానిఇక నిత్యం సెలవురోజులే, పరీక్షా ఫలితం తెలిసేవరకు ఎదురుచూడటం ఆ తర్వాత....?

ఏది జరుగుతుందో జరగనీ....

# ఏడు

ఎదురుచూడని విధంగా రామకృష్ణన్ మాస్టరుగారిని కలుసుకోవటం జరిగింది, ఊరికేగడప దగ్గర నిలుచునుండగా మాస్టరు ఆ దారిలో వెళుతున్నారు.అప్పుణి దగ్గరకెళ్ళాడు.

"ఏమిటీ అప్పుణీ?"

"ఏం లేదు, సార్."

"ఇక్కడేనా మీ యిల్లు?"

"అవునండి, ఇదేనండి."

అతను తన ఇల్లు చూపించాడు.

"ఫలితాలు వచ్చేందుకు ఇంకా టయముందిగా, అప్పుణీ? ఇప్పుడేం చేస్తున్నావు?"

"ఊరికే వున్నానండి. మా ఇంటికి రండిసార్."

"వస్తాను."

"ఏదైనా చదవడానికి పుస్తకాలు ఇక్కడేం దొరకడం లేదండి."

"నా ఇంటికి రా బోలెడన్ని పుస్తకాలున్నాయి. చదివేందుకు పుస్తకాలు లేవని కాలం వృథాచేయక."

అప్పుణికది సంతోషం కలిగించింది,

బడికి కాస్త దూరంగా వుంది రామకృష్ణ మాస్టరుగారి ఇల్లు. మాస్టరు గారింట్లో అనేక పుస్తకాలున్నాయి. కవితలు వ్రాసే అలవాటుంది ఆయనకి. అలా అని విన్నాడు అప్పుణి సాయంకాలం అదొక అలవాటైపోయింది, మాస్ట రింటికి నడిచి వెళ్ళేవాడు. అదిమూడుమైళ్ళ ప్రయాణం. తపాలాఫీసుప్రక్కన వుండేది మాస్టరుగారిల్లు. ఆయన పేపరొకటి చేతిలో పట్టుకొని చదువుతుండే వారు. ఏదైనా పుస్తకంతీసి ఇచ్చేవారు. మాస్టరు సహజంగామాటకారి. ఆయన మాటలు వినడం అప్పుణికి చాలా ఇష్టం.

ఒకరోజు సాయంకాలం పెద్దమామ రెండవ కొడుకు గోపి ఇంటికి వచ్చాడు. అప్పుణి అతన్ని గోపియని పిలిచేవాడు కాదు. గోపన్న అనియే పిలిచేవాడు. అతన్ని ఇంతకుముందు చూసినదికూడా లేదు. అమ్మమ్మ పెద్ద మామ అతనితో మాట్లాడుతున్నారు.

అతను అప్పుణినిచూసి చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయాడు.

"మంచిదయింది. ఆడపిల్లకు ఎంత ఐశ్వర్యమున్నా భర్త వుంటేనే ఆమెకి శోభ కలుగుతుంది." అంటోంది అమ్మమ్మ.

"ఏమిటి మంచిదయింది"

గోపన్న వెళ్ళిన తర్వాత అప్పుణి అక్కడికి వెళ్ళాడు.

అమ్మమ్మ అడిగింది,

"అందరినీ ఆహ్వానించారు అప్పుణీ, నువ్వు వెళతావా ఏం?"

"ఎక్కడికి?"

"పువ్వులతోటకి. ఇరవైఒకటవ తారీఖు అక్కడ పెళ్ళి కదా!"

"ఎవరికి?"

"అమ్మణికి,"

ఆతర్వాత ఏమీ అడగలేదు. కానీ అమ్మమ్మ చెప్పుకుపోయింది. వరుడు దక్షిణ కండం మాధవన్ నాయర్. దక్షిణ కండం వారు. మాధవన్ నాయర్

అనేక సంవత్సరాలుగా పరాయిచోట వుండి ఈ సంవత్సరమే ఇంటికి తిరిగి వచ్చాడు. బాగా డబ్బు గలవాడు.

"ఆమె భాగ్యశాలి."

"సుఖపడనీ." లోలోపలే అనుకున్నాడు. "అమ్మిణి సుఖంగా ఉండాలి."

కానీ ఏదో అవ్యక్తమైన వేదన మనస్సులో రగిలింది. అమ్మిణిని ఇక ఎప్పుడైనా కలుసుకుంటే మాధవన్ నాయర్ భార్యగా ఎదురవుతుంది. అతను అది చూడలేడు.—చూసినట్లైతే—

మూల గదిలో చలితో పడుకొన్న కొన్ని రాత్రులు జ్ఞప్తికి వచ్చాయి. అతను పుట్టినది ఆలస్యంగా. అదే ఐదారేళ్లు ముందు పుట్టి వుంటే ఇప్పుడు యువకుడిగా వుండేవాడు.

మనస్సు ఏదో బాధగా వుంది.

ఆ ప్రాంతాల్లో ఎక్కడైనా ఒక పెళ్లి జరుగుతుందంటే ఆ తర్వాత అమ్మమ్మ ఆవిషయం తప్ప మరి దేన్ని గురించి మాట్లాడదు.

రోజూ ఉదయం, అమ్మమ్మ లెఖ్ఖ వేసేది. పెళ్లికి ఇంకా ఎన్నిరోజులు న్నాయని. ఈ రోజు పదిహేను తారీఖు. పందిరి వేసే రోజు.

తంగేడత్తని చూసినప్పుడు అమ్మమ్మ చెప్పేది.

"ఇక నా తంగకు ఒక మొగుణ్ణి చూసి తీరాలి. నేను ఆ పెళ్లికూడ చూడాలి. దానికి ఎప్పుడు సమయం వస్తుందో!

తంగేడత్తి విన్నప్పుడు సిగ్గుతో తల వంచుకుంది.

పెద్దమ్మ అన్నది కదా,

"అమ్మా, నువ్వుఇంకా పదేళ్లు బ్రతికి వుంటావు. దానికేమీ భయపడకు" తంగేడత్తి అప్పుణికంటే ఒక సంవత్సరం చిన్నది."

పెద్దమ్మకు ఆమె తరువాత పిల్లలు కలుగలేదు.

ఇరవై ఒకటవ తారీఖు రాగానే మొదట అతనికి స్ఫురించిందిదే. ఈ రోజ పెళ్లిరోజు.

పెద్దమ్మ ఆమె కొడుకులు ముందురోజే వెళ్లిపోయారు. మాళు కూడా వారితో వెళ్ళిపోయింది.

మీనాక్షమ్మకు తానుకూడ పెళ్ళికిపోవాలనే కోరిక వుంది. అయితే అమ్మమ్మ, "అందరూ వెళ్ళిపోతే ఇక్కడ నాకు వాయుభక్షణమేనా తినడానికి?" అన్నది.

"నాకీ వంటగదిలోనే ఈ జన్మంతా గడపాలని వుందేమో." అని విసుక్కుని తాను పెండ్లికి వెళ్ళకూడదని నిశ్చయించుకుంది మీనాక్షమ్మ.

అప్పుణి మాస్టరుగారింటి నుంచి తెచ్చిన ఒక పుస్తకాన్ని తీసుకొని దక్షిణ వైపు ఒక స్థలంలో కూర్చున్నాడు. పుస్తకంలోని కథలో మనసు లగ్నం కాలేదు. అమ్మమ్మతో మాట్లాడనారంభించాడు. ఒక్కొక్క నిమిషం పెళ్లిలో ఏం జరిగేదని అమ్మమ్మ చెప్పనారంభించింది.

రాత్రి భోంచేసేందుకు అమ్మమ్మ వాకిట్లోకి వచ్చింది.

"వేళెంతయింది, అప్పుణ్ణీ ?"

"ఎనిమిది, తొమ్మిదవుతుందనుకొంటున్నా, అమ్మమ్మా!"

తర్వాత "అన్నం బాగుందలా? కొంచమన్నమే తిన్నావేమిటిరా?"

సమాధానం చెప్పకుండా అన్నం తింటున్నాడు. అతనికేమీ రుచించ లేదు. కారములేక చింతపండు వేసిన పులుసు మాత్రమే ఉంది.

నిద్రపోతున్నప్పుడు అమ్మమ్మ మాట్లాడుతూనే వుంది. "విందు భోంచేసి వుంటారు ఈ పాటికి అక్కడ."

అమ్మమ్మ మనసు పూర్తిగా పెండ్లింటిలోనే వుంది. అక్కడికి వెళ్లకుండా ఒక్కొక్క నిమిషం అక్కడ జరిగేవన్నీ ఇక్కడ ఊహించుకుంటోంది ఎందుకు?"

మూలగదిలో పడుకొన్న అతని మనసు కూడ ఆ పెండ్లింటివైపు మళ్లింది.

....పందిరిలో గుంపులు ఎక్కువగా వుంటారు. ఇల్లంతా స్త్రీలతో, పిల్లలతో నిండి యుంటుంది. పందిరంతా మాటలు, నవ్వులుగా ప్రతిధ్వనిస్తుంటుంది... ఇప్పుడు అంతా పడుకోవటానికి వెళ్ళి వుంటారు. అమ్మణి కూడ పడుకొని వుంటుంది. ఒంటరిగా కాదు, ఆమెతో ఆ కొత్త మనిషి వుంటాడు. ఇరవై సంవత్సరాలు ఒంటరిగా గడిపిన ఆ మనిషి.

....ఇరవైసంవత్సరాల తర్వాతకదా అతను ఈ దేశానికి వచ్చింది?

వంకర తిరిగిన మీసాలతో పచ్చపొడిచిన చేతులును, భయంకర స్వరూపంగల ముఖముతో వున్న ఒక నల్లని మనిషి చిత్రం అతని మనసులో నిలిచింది. అతనే వరుడు. అకారణంగా అయినాసరే, అతన్ని తలుచుకున్నప్పుడు అసహ్యించుకోకుండా వుండలేకపోయాడు.

....మెత్తగావున్న పరుపు, నల్లని మనిషితో అమ్మణి పడుకుని వుంటుంది. తెల్లని ఛాయతో అందమైన అమ్మణి....

ఎందుకు ఈ ఆలోచనలు....

అప్పాణి లేచివచ్చి కిటికీ తలుపులు తెరిచాడు. బయట వెన్నెలకాస్తున్నా అతనికి ఏదో వేడిగా అనిపించింది.

తోటలో అరటి చెట్టు మధ్య వెన్నల కాస్తోంది. మంచి వెలుగుగా వుంది. ఎండి పోయిన మునగ చెట్టు కొమ్మలు ఏదో ఐదు తలలుగల పిశాచంలాగా కనబడు తున్నాయి. తెల్లని వెన్నెల చీకటి కలిసి చూడడానికి ప్రకృతి మనో హరంగా వుంది.

వెన్నెల పోయేవరకు అతను అలాగే కళ్లు తెరచి పడుకున్నాడు. ఉద యకాలపు చల్లని గాలి కిటికీ వద్దనుంచి వీచిన తర్వాతనే అతనికి కునుకు పట్టింది.

*   *   *

ఫలితాలు వచ్చాయి. అప్పాణి ప్యాసయ్యాడు. జ్ఞానులో సర్టిఫికేటు వస్తుందని అనుకున్నాడు, అంతవరకేదీ నిర్ధారణ చేసుకోలేదు. ఒకరోజు మాస్టరుగారింటికి వెళ్లినప్పుడు పేపరు పెట్టుకొని మాస్టరు,

"అప్పాణీ, టీపార్టీ ఇవ్వాలి నువ్వు!" అన్నారు.

"ఏం సార్ ?"

"నీవు ప్యాసయ్యావు, ఈ పత్రికలో నీనెంబరు పడింది."

అనేక నంబర్లు వున్నాయి ఆపత్రికలో. అందులో తననెంబరుని గుర్తించి చూడడానికి ప్రయాసపడనక్కరలేకుండా ఆ నంబరు క్రింద మాస్టరు గుర్తు చేసి పెట్టారు,

చూసి చూసి తృప్తితీరలేదు. ఆశలన్నీ తీరినట్లు అనిపించింది. మహమ్మదు నెంబరు చూశాడు. లేదు. మహమ్మదు ప్యాసవ్వలేదు. ఇతర్ల నెంబర్లు ఏవీ అతనికి తెలియదు.

ఇంటికి తిరిగి వస్తూ చిగిర్చిన టేకు చెట్ల మధ్య ఎర్రమట్టి బాట దోవగా నడుస్తున్నప్పుడు, లోకానికంతకూ "అప్పాణి ప్యాసయ్యాడు" అని తలెత్తుకుని చెప్పాలని తోచింది.

ఇంటికి వచ్చినప్పుడు అందరి దగ్గరకు వెళ్లి ప్యాసు అయిన విషయం చెప్పాలని ఉత్సాహంతో గుమ్మంలోకి కాలుపెట్టాడు. మెల్లిగా వెళుతుండగా పెద్దమామ గొంతు వినబడింది. ఎన్నోరోజుల తర్వాత అతను తిరిగివచ్చాడు.

చాల సంతోషముగా ఆవేశంతో లోపలికి వచ్చినవాడు ఒక్కుమ్మడిన చల్లబడి పోయాడు.

ఏదీ జరగనట్లు అతను లోపలకి వెళ్లిపోయాడు.

షర్టు విప్పి మురికి ధోవతితీసుకుని పైన కప్పకొని బయటికి నడిచాడు. పోయి స్నానంచేద్దాం. కాస్సేపు ఇంటినుంచి బయట పడటం అవసరమనిపించింది. తలంతా నూనె లేక రేగివుంది. సరిగ్గా నూనె రాసుకొని ఎన్నో నెలలైంది.

వంతెన ప్రక్కనున్న గట్టు దగ్గరకు వెళితే ఏరు లోతుగా నీరు నిండి వుంటుంది. స్నానంచేయడానికి హాయిగా వుంటుంది.

ఎర్రమట్టి పొలములో నుంచి ఏటిలోకి దిగాడు. ఏరు ఎండిపోయి వుంది. విస్తారమైన ఇసుక ప్రదేశము, ఒక ప్రక్కనుంచి నీరు హెూరుమంటూ ప్రవహిస్తోంది. పూర్వం ఈప్రాంతం అంతా వరదలొచ్చి గట్టులు తెగినదే. అది చూసి అతని ఉత్సాహ మెక్కువైనది. అక్కడక్కడ గండ్లుపడిన ఇసుకలో గోతులు త్రవ్వి నీటిలో స్నానంచేయటం జనానికి అలవాటు.

ఇసుక గుట్టలపై అతను నడిచాడు. వంతెన వుండే పల్లం చేరుకోవటానికి నాలుగైదు ఫర్లాంగులు నడవాలి.

వంతెన ప్రక్కనే పడమటి నుంచి ఆ ఏటిలో మరో ఏరువచ్చి కలుస్తుంది. అందువల్లనే ఎండాకాలములో కూడ అక్కడ నిత్యం నీరుండేది. ఒక చివర్న పెద్ద రైలు రోడ్డు పోయేది. అక్కడికి కొంచెం దగ్గరలో ఇద్దరు ఆడవాళ్లు స్నానం చేస్తున్నారు.

అప్రక్క గట్టువైపు చిన్న చిన్న బండలున్నాయి. నీటిలోకి దిగకుండా కాస్సేపు ఆ బండపై కూర్చున్నాడు అప్పణి. పైన వంతెన మీదుగా ఒకప్యాసంజరు బండి వెళ్లింది. వంతెన భూమి గడగడ అదిరాయి. గుమ్మాల వద్ద, కిటికీలవద్ద అనేకమంది జనం వున్నారు. ఎక్కడినుంచి ఎక్కడికి పోతున్నారు ?

ఈ బండి మదరాసుకి వెళుతుందేమో. లేదంటే, కోయంబత్తూరుకెళ్లాలి. అప్పణి ఆలోచించాడు.

అతనెన్నడూ రైలెక్కి ఎరగడు. గ్రామము చుట్టూ వున్న ప్రాంతం హైస్కూలు తప్ప వేరొకటి అతను చూసినది లేదు. పెద్ద పట్టణాలు ఎలా వుంటాయో ఊహించేందుకు కూడా అతనికి వీలులేదు.

నల్లని వంతెన మీదికి అతను ఒక రాయిఎత్తి విసిరి వేశాడు. లోహం మ్రోగుతున్నట్లు శబ్దం వినిపించింది. ఆ ఇనుప స్థంబాలు చూస్తే భయం వేస్తుంది. ఎప్పుడో ఒక్కసారి ఒకతను వాటి మధ్యపడి చచ్చిపోయాడట. పల్లెల్లో చెప్పుకునేవారు.

వంతెన కట్టిన కాలాల్లో ఆ స్థంభాలు కట్టలేదు. తెల్లజాతి ఇంజినీర్లు అన్ని సంగతులూ సూక్ష్మంగా పరిశీలించి ఆ వంతెన వైపు ఇనుప స్థంభాలు కట్టించారు. ఆ తర్వాత వంతెన ఇరువైపుల ఆ స్థంభాలను కట్టించారు. ఇసుక నిండిన తట్ట ఒకటి తీసుకొనివెడుతున్న ఒక కూలిపైన నల్లరాళ్లు కూలాయి.... అతను బయటికి రాలేదు. అటువైపు రైలు వచ్చింది. అతను మరణించాడు. ఈ కథ నిజమైతే అతను అక్కడే దుర్మరణం చెందాడు. ఆ ఇనుప వంతెనకి బలి అయిన మనిషి ఆత్మ అక్కడే సంచరిస్తోంది ....

పైన లేత నీలవర్ణముతో స్పష్టమైన ఆకాశం. సూర్యాస్తమయింది. పడమటి దిక్కులో ఎరుపు నలుపు కలసినట్లున్న మేఘాల గుంపు మాలల్లాగా కదులుతున్నాయి. ప్రకాశవంతమైన కిరణకాంతులు నీటిలో ప్రతిబింబిస్తున్నాయి.

అతను స్నానం చేయడానికి నీళ్లలోకి దిగాడు. బాగా చీకటి పడకముందే నీటినుంచి బయటికొచ్చాడు. ఆ ఇనుప వంతెన ఎన్నో కాళ్లున్న ఒక భయంకర జంతువులాగా కానవస్తోంది. చుట్టూ ప్రవహిస్తున్న నీటి హోరు మాత్రం వినిపిస్తోంది. దూరంగా ఎక్కడో రైల్వే సిగ్నల్ వెలుగు చీకటిలో దొంగ కళ్లలాగా మెరుస్తున్నాయి. ఏకాంతమైన ఆ ప్రాంతం విడిచిపోయేందుకు అప్పాణికి మనసు ఒప్పలేదు.

ఒక వారంలోపలనే సర్టిఫికేటు వచ్చింది. నీలం రంగు అట్ట వేసిన పుస్తకం. గవర్నమెంటు పరీక్ష మార్కులు ఎర్రని సిరాలో వ్రాసియున్నాయి. ఆరు సబ్జక్టులలో మొత్తము నాలుగు వందల ఇరవై మార్కులు వచ్చినాయి.

అది చూసి రామకృష్ణమాస్టరు కూడ ఆశ్చర్యపడ్డాడు. "ఆంగ్లములో డబ్బైయొకటి. గణితములో తొంబైయేడు. అప్పాణి పైకి చదవ వచ్చును.

అప్పాణి వేదనాపూరితుడై నవ్వుకొన్నాడు. ఆంగ్ల దినపత్రికలో ఉద్యోగం గురించిన ప్రకటనలను చూసేందుకు నిత్యం మాస్టరుగారింటికి వెళ్ళేవాడు.

ఒక నెల తర్వాత ఏదో ఉద్యోగానికి ప్రకటన పడింది పత్రికలో. రైల్వేలో క్లార్కులు కొరకై ప్రకటన అది. మాస్టరు ఇలా సలహా ఇచ్చారు.

"అప్పణీ, దరఖాస్తు వెయ్యి. మంచి మార్కులున్నాయి. తప్పకుండా దొరుకుతుంది."

రెండు రూపాయలు కావాలి. రిజిష్టరుచేయడానికి డబ్బు కావాలి. మూడు, నాలుగు రూపాయలు ఎవరిస్తారు? ఎందుకిస్తారు?

పదిహేనవ తారీఖు లోపల దరఖాస్తు పడెయ్యాలి. ఇంకా ఇరవై రోజులున్నాయి. కానీ, అతనికి ఆ గడువు చాలనట్లు తోచింది. రెండు మూడు రోజులుగా మూడు, నాలుగు రూపాయల కోసం ఆలోచించసాగాడు. ఈశ్వరా! నాలుగు రూపాయలు ఎంత పెద్ద సంఖ్యగా నున్నది!

ఆ వేళ వంతెన వద్ద వున్న తెల్లని ఇసుకను చూస్తూ నడిచి వస్తున్నాడు. రోడ్డెక్కినప్పుడు ఒక పిల్లవాడు వెనుకనుంచి పరుగెత్తి వచ్చి,

"నిన్ను పిలుస్తున్నారు." అన్నాడు.

"ఎవరు?"

"సైదాలికుట్టి, ఆ ఎర్రమట్టి గుప్పపై మండపమువద్ద నిలుచున్నాడు."

అప్పణి ముఖముపై పడుతున్న వెంట్రుకలను సరిచేసుకుంటూ మండపం వైపు వెళ్ళాడు. అక్కడ బీడీ త్రాగుతూ దొంగచూపులతో నవ్వుతూ నిలుచు నున్నాడు. సైదాలికుట్టి దగ్గరకెళ్ళగానే,

"చిన్న నాయరుగారూ బాగా పెరిగారు."

అప్పణి నవ్వాడు.

"అక్కడ సుఖంగానే వున్నట్లు తలుస్తాను."

దీన్ని పట్టించుకోక అప్పణి అడిగాడు

"మీరెప్పుడిక్కడకు వచ్చారు సైదాలికుట్టీ?"

"ఈరోజే వచ్చాను."

"ఇప్పుడేవూళ్ళో వుంటున్నారు?"

"వయనాడులో వున్నాను. నువ్వెట్లా వున్నావు?"

"ఇలాగే గడుపుతున్నా".

"ఇప్పుడెన్నవ తరగతిలో చదువుతుంట."

"చదువు ముగిసింది."

"పదో తరగతి ముగిసిందా?"

"హా, ముగిసింది."

"ఇక....ఇక ఒకపని దొరకాలి, ఇంకా యిక్కడుండేందుకు నాకిష్టము లేదు."

"ఎక్కడైనా ప్రయత్నిస్తున్నావా?"

"చూడాలి. దానికే........"

నాలుగు రూపాయలే ఒక ప్రశ్నగా మనస్సులో నిలిచింది. పోనీ చెబుతామా? అలా చెప్పేందుకు మనసు ఒప్పుకోలేదు.

"ఊరికే వుండడం నీకు కష్టమే. ఉద్యోగం దొరకటమూ కష్టమే...."

"పని దొరకాలంటే ఎవరిదైనా సిఫార్సులుండాలి. డబ్బు ఖర్చుపెట్టాలి. నాకీ రెండూ లేవు....నేనెవరి సహాయము లేనివాడిని...."

సైదాలికుట్టి బీడి త్రాగుతూ మౌనం వహించాడు. అతనేదో ఆలోచిస్తున్నట్లు తోచింది. ఆ ప్రస్తావన మార్చి అతను ఇలా అడిగాడు.

"ఇంట్లో తగవులెలావున్నాయి?"

అప్పుణి అయిష్టంగా చెప్పాడు.

"ఏం లేదు. వేరెక్కడకి పోవడానికి దారిలేక అక్కడున్నాను, అంతే."

"భగవంతునిలో విశ్వాసముంచు. మనసు కష్టపెట్టుకోక. పుట్టించినవాడు ఏదైనా ఒకదారి చూపిస్తాడు,...."

అప్పుణి అర్ధంలేని నవ్వు నవ్వి వూరుకున్నాడు.

"నేను వెళ్లొస్తా. రెండురోజులలో నేను వెళ్లిపోతాను. సమయం దొరికితే ఉద్యోగం కోసంప్రయత్నిస్తాను."

అప్పుణి ధోవతితో ముఖం, ఛాతీ తుడుచుకుంటు వెళ్ళిపోయాడు. రెండడుగులు వేసిన తర్వాత సైదాలికుట్టి మళ్ళీ పిలిచాడు.

"చూడు, నీరు నిండితే ఏరునిండును. పుట్టించినవాడు కాపాడు దారి కూడ చూపుతాడు."

రోడ్డు మీంచి పొలము దారిలో దిగినప్పుడు అప్పుణి తనలో తను అనుకున్నాడు - పుట్టించినవాడు దారిచూపుతాడు, అంటే నాలుగు రూపాయల

కోసరం మనస్సు కష్టపెట్టుకోవలసిన అవసరం ఏముంది. భగవంతుని లీలలు. అతనికెంతో విచిత్రంగా తోచాయి.

*     •     •     •

అతనికెవ్వరూ ఉత్తరం వ్రాసేవారులేరు. పెన్సిలుతో మళయాళముతో వ్రాసిన ఉత్తరాన్ని సందేహంతో తెరిచాడు, పైగా అస్పష్టంగా వ్రాసిన "వి" అక్షరము కనబడింది.

"మిక్కిలి ప్రియముగల అప్పుణి నాయరు చదువుకొనేది...."

అప్పుణి నాయర్?

"అప్పుణి, అప్పుణ్ణి నాయర్‌గా మారిపోయాడు."

"మిక్కిలి ప్రియముగల అప్పుణ్ణినాయర్ చదువుకొనేది, సైదాలికుట్టి వ్రాయునది.

ఏమనగా, నిన్ను గురించి ఎస్టేట్టువారి కుమారునితో చెప్పాను. ఏదైనా పని ఇస్తానని చెప్పారు, ఏదీ ఆలోచించక, వెంటనే ఇక్కడికి బయలుదేరిరా.

"వచ్చేటప్పుడు సర్టిఫికేట్టు తీసుకొని రావలసినది. కోవిల్‌కోడులోనుంచి మానంతవాడి బస్సు ఎక్కి-ఊళ్ళో దిగాలి. అక్కడ అంగడిలో అడిగితే నా దుకాణాన్ని చూపిస్తారు. నువ్వు వస్తున్నరోజు తెలుపుతూ ఉత్తరం వ్రాయి. నేను, నా కొడుకు బస్సు దగ్గరకి వస్తాము.

సైదాలికుట్టి.

పుట్టించిన భగవంతుడు సైదాలికుట్టియే అని అనిపించింది అప్పుణ్ణికి. చీకటినిండిన ఆ మూలగదిలో వున్న వాడికి బ్రతికి బైటపడగలననే ఒక సంతోషం కలిగింది. సైదాలికుట్టి వ్రాసినది నమ్మవచ్చునా?

ఎవరూ సహాయం చేయడంలేదని తలచినప్పుడు, ఇంతవరకు తనకు సహాయం చేయపోతున్నాడని ఏ మాత్రము ఎదురుచూడని వాడుకదా, ఇప్పుడు విశ్వాసంతో చేతులుచాపి సహాయం చేస్తున్నాడు.

ఇప్పుడు తను మిగతా విషయాలన్నీ తాత్కాలికంగా మరచిపోవలసిందే. తక్షణం వయనాటికి వెళ్ళాలి. అందుకు కొంచెం డబ్బు కావాలి. పళ్లిపురమునుంచి కోవిల్‌కోడు వెళ్ళడానికి టిక్కట్టు డబ్బులు కావాలి.

అక్కడనుంచి బస్సుచార్జి, దారిలో భోజనానికి వేరే కొంచెం డబ్బుకావాలి. ఎవర్ని అడిగేది.

మాస్టరుగారింటికి వెళ్ళాడు. మాస్టరు తోటలో ఏదో పని చేస్తున్నాడు. అతన్ని ఆ సమయంలో చూడడం మంచిదే అనిపించింది. అయినా సంశయిం చక లోపలకి వెళ్ళాడు. సిగ్గుపడక మాస్టరుతో ఈ విషయం చెప్పాడు.

"దీనికేమిటి కష్టం?"

మాస్టరు చాలా సంతోషించాడు.

"అప్పాణీ, ఇక్కడే వుండు. నేనిదిగో వస్తున్నా?" మాస్టరు షర్టు వేసు కొని బయటికెళ్లారు. కాస్సేపయిన తర్వాత తిరిగి వచ్చాడు.

"అప్పాణీ, నీకు మేలు కలగాలి. ఇదిగో" అంటూ తిరిగి వచ్చారు

పదిరూపాయలనోటు ఒకటి, అతని చేతికిచ్చారు. కృతజ్ఞతతో అతని కళ్ళు చెమ్మగిల్లాయి. నోట మాట రాక అల్లానే నిలబడ్డాడు.

చాల ప్రయాసతో,

"వెళ్లొస్తాను సార్," అన్నాడు.

"వెళ్లిరా. విష్ యూ గుడ్ లక్...."

ఆ ప్రదేశాన్ని వదలి తొందరగా వెళ్లిపోవాలనుకొని అప్పాణి తీర్మా నించుకొన్నాడు,

ఒక తుఫానులాగా తొందరగా నడవసాగాడు.

విష్ యూ గుడ్ లక్....

నీకు మంచి అదృష్టం కలగాలి....

రేపు శుక్రవారము. మహమ్మదుకు చెప్పి పోవాలి. ఆ రోజు ఉదయమే వెళ్లిపోదామనుకున్నాడు. ఇంక ఈ పల్లెటూరికి తిరిగిరాకూడదనే తీర్మానించు కున్నాడు,

ఇక మీద ఎల్లప్పుడూ ఈ మూలగదిలోపల పడుకొని వుండనక్కర్లేదు. అసలు మళ్లీరానే రాకూడదు.

మహమ్మదుతో తన ప్రయాణం గురించి చెప్పిరావాలనుకొన్నాడు. మహమ్మదుతో మాత్రమే చెప్పాలా? వద్దు. వద్దు. అవన్నీ మరచిపోయిన విషయాలు. ఉత్తి జ్ఞాపకాలు మాత్రమే....

ఆ రాత్రి ఎవరికీ ఏమీ చెప్పలేదు. ఎవరూ ఇప్పుడు ఈ విషయం తెలుసుకోనక్కర్లేదు. మహమ్మదు ఇంటికెళ్లాడు అప్పణి. అతని ఇంట్లో అమ్మ మాత్రమే ఉంది. మహమ్మదు అతని తమ్ముడు, తమ అక్కగారి ఊరికి వెళ్లారు.

"అమ్మా, మహమ్మదు వస్తే నేను వచ్చి, అడిగానని చెప్పు."

"మీరెవ్వరూ?"

"మహమ్మదుతో చదువుకొన్న ఒక పిల్లాడు వచ్చి అడిగాడని చెబితే చాలు. అప్పణి."

"పారుకుట్టమ్మ కొడుకు అప్పణియా?"

అప్పణి దానికి ఏదీ సమాధానం ఇవ్వలేదు.

"ఇక్కడికి ఆమెవచ్చినప్పుడల్లా నీ గురించి చెబుతుంటేది."

"నేను రేపు ఊరికి వెళ్లిపోతున్నాను."

"ఎక్కడికబ్బాయి."

"ఈ ఊరు విడిచి వెళ్లిపోతున్నాను. ఒక నౌకరీ కోసం ఏర్పాటు చేసుకుంటున్నాను. ఈ విషయం చెప్పండి."

"చెబుతాను, అబ్బాయీ."

అతను తిరిగి వస్తున్నప్పుడు అమ్మ:

"ఆ అమ్మాయి కొడుకుకి దేవుడు దీర్ఘ ఆయుసు ప్రసాదించనీ" అన్నది.

వేసుకొనుటకేదీ లేదు. ప్రయాణానికి కావలసిన ఒక షర్టు ధోవతి తీసి పెట్టుకున్నాడు. ఇతర షర్టులు, రెండు పంచలు సంచిలో పెట్టుకొన్నాడు. మురికి పడిన ధోవతి, సర్టిఫికేటు పుస్తకము, హెడ్మాస్టర్ ఇచ్చిన కాంటక్ట్ సర్టిఫికేటు అందులో పెట్టుకున్నాడు. ఆ ఉదయం తొమ్మిదిన్నర గంటలకు పళ్ళిపురములో నుంచి రైలు ఎక్కాలి.

సంచి పుచ్చుకొని అమ్మమ్మ గదిలోకి వెళ్ళాడు.

"ఏమిటిరా, అప్పణీ?"

"నేను వెళ్ళొస్తానమ్మమ్మా."

"ఎక్కడికి?"

"నాకో ఉద్యోగం దొరకబోతోంది."

"అలాగా అబ్బాయీ, నువ్వు బాగుండాలిరా... "

అమ్మమ్మ మెల్లిగా లేచి నిలబడింది.

"ఎక్కడరా?"

"వయనాడులో - ఆవూరి పేరు."

"నీ కష్టాలిక గట్టెక్కాయి."

ఒకసారి మూల గదిలోకెళ్ళి నిలబడ్డాడు. అక్కడ జరిగినదాన్ని మరచి పోగలడా? మరువలేడు. బైటకి వెళ్ళినప్పుడు పెద్దమ్మ దక్షిణవైపింటి నుంచి వెనుక ప్రక్కగా వచ్చి పిలిచింది. "అప్పుణీ, ఆగు."

"ఏమీ చెప్పకుండా పోతున్నావేమిటిరా?"

పెద్దమ్మ కంఠంలో అనురాగం ధ్వనించింది.

"గంజి తయారయింది తాగి వెళ్ళు."

అతను నిదానముగా,

"వద్దు" అన్నాడు.

"దారి ఖర్చుకు ఏమైనా కావద్దూ ?"

ఆ ఔదార్యగుణము చూసి అతనికి ఆశ్చర్యం వేసింది. బహుశః ఇది ప్రారంభమే....తిరిగి చూడక వాకిట్లో దిగుతూ ,

"వద్దు." అన్నాడు.

వాకిట్లోపలకొచ్చినప్పుడు ఒకసారి తిరిగి చూశాడు, గడపవద్ద నల్లని ముఖం కనిపించింది. అది మాళుది. మాళు నిలుచునుంది. ఆమెతో చెప్పాలని పించింది. మూసిన గుమ్మం తలుపు తెరచి, బయటకివచ్చినప్పుడు ఎదురుగా చిన్నమామ వచ్చాడు. ముఖాన్ని ప్రక్క త్రిప్పుకొని నిలబడ్డాడు.

తోటలో తోపులో, గట్టు మీదుగా అప్పుణి వేగముగా నడువ సాగాడు.

## ఎనిమిది

బస్సు వేగంగా పోతోంది. ఒక ప్రక్క ఎత్తైన కొండలు, ఇంకో ప్రక్క చెట్లు, చేమలు నిండిన కొండలు. ఒక్కొక్క కొండ మీదుగా బస్సు ఎక్కి దిగి పోతున్నప్పుడు అప్పుణి బయటికి చూస్తున్నాడు. మధ్యాహ్నపు ఎండలో

ప్రకాశిస్తున్నాయి పచ్చని చెట్లు, చేమలు. ఆ చెట్లతో నిండి వున్నాయి విశాల మైన వనాంతరాలు.

అడవి అంతా అరటిచెట్లతో నిండివుంది. ఆ ప్రక్కనే కొండలూ, బండలూ వున్నాయి. పళ్లిపురములో నుంచి బండి ఎక్కింది మొదలు తాను ఏదో మని షిగా మారిపోయినట్లు అప్పణికి తోచింది. పాత అప్పణికాడు తను, ఇప్పుడు. పెరిగి పెద్దవాడైన ఒక మనిషి

మధ్యాహ్నం వేళకి మెడకు వులన్ మఫ్లర్ చుట్టుకొని, చెవిలో పెద్ద సైజు రాళ్లకమ్మలు ధరించిన ఒకాయన దగ్గరగావచ్చి కూర్చున్నాడు.

ఆ ముందు సీటులో స్త్రీలు, పిల్లలు కూర్చున్నారు. అప్పణి తల బయట పెట్టి క్రిందకి చూశాడు. కొండమీద వంకరలు తిరిగిన బాట స్పష్టంగా కన పడింది, కొండపై బస్సు పోతోంది.

క్రిందనుంచి వస్తున్న లారీలు చీమల్లాగా ప్రాకుతూ కనబడుతున్నాయి. పైకి ఎక్కి పోతున్నప్పుడు అప్పణి ఆ ప్రక్క భయంకరమైన లోయ ప్రదేశాన్ని చూడటం జరిగింది.

కుడివైపు ముళ్ల చెట్లు, చిన్న చిన్న చెట్లు, బొయర్లుతో నిండిన ఒక పెద్ద అడవి. దూరంగా పొలాలు అక్కడక్కడ అడవిమానులన్నీ వున్నాయి. ఎర్రని రంగులో వున్న ఆ విశాల భూభాగాన్ని చూసినప్పుడు, బంగారు కమ్మలు పెట్టుకున్న ఆ పెద్దాయన ఆ ప్రక్కనున్న గడ్డపాయన్నిపిలిచి ఏదో చెప్పాడు.

"రబ్బరుతోటలు ప్రారంభిస్తున్నారు. మనకోయకుట్టి హాజి ఈ స్థలమంతా గుత్తకి తీసుకొని వున్నాడటనే?"

సాయంకాలపు ఎండ తగ్గి చల్లబడి చల్లటి పిల్లగాలులు బస్సులోనికి వచ్చి అతనికి ఆహ్లాదమును కలిగించాయి.

"ఇదే స్థలం."

"వచ్చేశామా ?'

అప్పణి అడిగాడు. కండక్టర్ ఔనన్నాడు. అతను సంచి తీసుకొని క్రిందకి దిగాడు. కొండల మధ్య ఒక ప్రక్క కొబ్బరియాకులతో కప్పబడిన అంగళ్లు. పెంకువేసిన అంగళ్లు రెండున్నాయి. మనుష్యుల సంచారములేని ఆ కొండ ప్రాంతములో దుకాణదార్లు అంగళ్లు పెట్టుకున్నారు. సైదాలికుట్టికి

తానువస్తున్నట్లు వ్రాయలేదు. బస్సు వెళ్ళిపోయిన తర్వాత అప్పాణికి ఏదో ఒక కలవరం కలిగింది. ఒక అంగడిలోకి వెళ్ళి,

"సైదాలికుట్టి అంగడి ఎక్కడుంది?" అనడిగాడు.

అక్కడ పనిచేస్తున్న ఒక కుర్రాడికి ఏమీ అర్థంకాలేదు. అప్పాణి అక్కణ్ణుంచి తిరిగివచ్చి ఇంకో అంగడిలో అడిగాడు. బుర్రమీసాలు, మెళ్ళో ఇనుప గొలుసు తాయత్తుగల దుకాణదారు.

"అదిగో ఆ పెంకులువేసిన అగండి ప్రక్కనే," అని చూపించాడు.

అప్పాణికి అప్పుడే ఊపిరి ఆడినట్లయింది.

తాటియాకులతో కట్టిన ఒక పూరిల్లు ఆ దుకాణం. వెనుక ప్రక్క రాతి గోడలతో ఒక చిన్న ఇల్లుంది. దుకాణంలో సరకులు కొనేందుకు ఎవ్వరూ రాలేదు.

తొమ్మిది, పదేళ్ళ వయస్సుగల ఒక కుర్రాడు పెట్టె ప్రక్కన వున్నాడు. అప్పాణి సందేహించటం చూసి,

"ఏమి, ఏంకావాలి" అన్నట్లు గౌరవముతో చూశాడు.

"సైదాలికుట్టి దుకాణం ఏది?"

"ఇదే. ఏంకావాలి?"

"సైదాలికుట్టి లేరా?"

"ఏం చెప్పాలి మా నాన్నకి?"

"సైదాలికుట్టిని చూడాలి."

ఆ కుర్రాడు తలత్రిప్పి చూడకనే,

"నాన్నా, ఇదిగో ఎవరో పిలుస్తున్నారు."

"ఎవర్రా?"

అవును, సైదాలికుట్టి గొంతే.

"ఎవర్రా అక్కడ?"

ఆ దుకాణం వెనుక ప్రక్కవున్న గోన పరదాని తోసుకొని సైదాలికుట్టి బయటికొచ్చాడు. అతను చెక్కిలిపై చెయ్యి పెట్టుకొని ఆశ్చర్యముతో,

"అరె, చిన్ననాయరు?" అన్నాడు.

అప్పాణి నవ్వాడు.

"ఇక్కడ లోపలికిరా. వొరేయ్ ఈ పీట ఇలా తీసుకురా."

అప్పుణి ముఖంమీద చెమట తుడుచుకొని వాకిట్లో నుంచి దుకాణం లోకి వెళ్లాడు.

"మంచివాడివే! ఒక కార్డుపడేస్తే ఏమిటి నష్టం?"

"వెంటనే బయలుదేరాను."

"మంచిదైంది. దారిలో ఏమీ కష్టపడలేదు కదా?"

"అదికాదు. నువ్వింత వరకు దూర ప్రయాణము చేసినది లేదుగదా?"

ఈలోపు సైదాలికుట్టి యింట్లోకి వెళ్ళి వెంటనే తిరిగి వచ్చాడు.

సైదాలికుట్టి ఆ ప్రాంతాన్ని గురించి వివరించాడు. తిరువితాంగూరు నుంచి వచ్చిన క్రైస్తవులు అక్కడక్కడ కాపురం ఉన్నారు. వట్టి పొలము లుగా కనిపిస్తున్న వన్నీ ఆ కాలంలో అడవులుగా వుండేవి. లోపలకు పోతే సాయబువాళ్ళ తేయాకు చెట్లున్నాయి. ఆ వీధిలో వున్న దుకాణదారుల్లో పలువురు క్రైస్తవులే. ఒక నాయరు టీ కొట్టు మాత్రముంది దూరంగా అయిత్రుమన్ కాక్క ఒక చేపలకొట్టు పెట్టాడు.

ఆ కొండ చివర్న దుకాణం పెట్టేందుకు, మనుష్యులెక్కడ వున్నారా అని సందేహం కలిగింది అప్పుణికి.

అయిదు వందల మంది జనం ఆ చుట్టు ప్రక్కల నివసిస్తున్నారు. వారందరికీ కావలసిన సామగ్రిలన్నీ ఈ అంగడి వీధిలోనే కొనాలి. తేయాకు తోటలో దుకాణం వచ్చేందుకు ముందు ఈ ప్రాంతాలలో మంచి వ్యాపారం జరుగుతూండేది. ఇప్పుడు అందరూ అక్కడికి పోతున్నారు.

సరుకుల కొట్టు సైదాలి కుట్టికూడ పెట్టాడు. ఇంకో అంగడికూడ వుంది అక్కడ. అందు వల్లనే సైదాలికుట్టి వ్యాపారం పడిపోయింది

పదమూడు సంవత్సరాలయాయి సైదాలికుట్టి అక్కడికి వచ్చి. మొదట తోటపని చేసేవాడు. తర్వాత చేపల వర్తకం చేశాడు. మనుష్యులు ఎక్కువగా వచ్చినప్పుడు ఒక సరకుల కొట్టు పెట్టాడు, భుక్తికి దొరికితే చాలునని మాత్రం భావించాడు. ఇల్లు కొట్టు అతని సొంతంకాదు. ఎనిమిదిరూపాయలు బాడుగ ఇవ్వాలి. కొంచము డబ్బుంటే ఇల్లు స్వంతంచేసుకోవాలన్న ఆశ వుండేది. అయితే అందుకు కావలసిన డబ్బు దొరుకుతుందని అతనికి విశ్వాసంలేదు.

మాట్లాడినదంతా సైదాలికుట్టియే. అప్పణి వింటున్నాడు.

అప్పుడు గోన తెర వెనుకనుంచి ఒక మాట వినపడింది. "ఇదిగో చూడు."

సైదాలికుట్టిలేచి "కొంచెం నీరు త్రాగు," అన్నాడు.

సైదాలికుట్టి లోపలకెళ్లాడు. అప్పణి సందేహంతో నిలుచోవటం చూసి సైదాలికుట్టి,

"ఇక్కడ రా. ఇక్కడ అంతా మన మనుష్యులే వున్నారు" అన్నాడు.

సంశయముతో లోపలకి వెళ్లాడు అప్పణి.

గుమ్మం దగ్గిర లోపలికి పోయే దారిలో ఒక చిన్న పీట వేసివుంది. అక్కడ రెండు గ్లాసులో టీ పెట్టి వుంది. ఆ ప్రక్కనే పళ్లెములో అరటికాయ బజ్జీలును, మైసూర్పాకులు వున్నాయి.

"కూర్చో...."పీటను చూపించాడు, సైదాలికుట్టి.

"రైల్లో, బస్సులో వచ్చావుకదా? అలసటగా వుండి వుంటుంది.టీ తాగు."

అప్పణి కూర్చున్నాడు. టీ త్రాగాడు.

గడపలో నుంచి నల్లని బురఖా వేసుకున్న ఒకామె వచ్చి నిలబడింది.

"ఫాతిమా, ఇతనెవరో తెలుసా?"

"ఎవరూ?"

"మనవూరు అబ్బాయి."

"అక్కడనుంచేనా?" ఎవరో గుర్తించలేకపోతున్నాను. ఎవరండి?"

"మన కోంతుణ్ణి నాయరు లేడూ! ఆ కోంతుణ్ణినాయిరు కొడుకు."

అప్పణి ముఖమెత్తి నవ్వుతూ సైదాలికుట్టి భార్యని చూశాడు.

"ఏమిటీ, నన్ను పుట్టించినవాడా! ఈ బిడ్డని నేను చూసినప్పుడు ఇంత పిల్లాడు."

ఆమె ఒక కోడి పిల్లను చూసినట్లు చేతులతో చూపి ఆశ్చర్య పడింది. సైదాలికుట్టి నవ్వాడు.

"అదంతా ఆకాలంలో ఫాతిమా పదిహేనేళ్లయింది. అప్పుడింత చిన్న పిల్లవాడుగా వున్నాడు." ఈలోపల కొడుకు ఇంట్లోపలకి వచ్చి జరుగుతున్న సంభాషణలో పాల్గొనటానికి నిలబడ్డాడు.

"అక్కడికి వెళ్లిపోయి కూర్చోరా. జనం బేరానికి వచ్చేవేళయింది "

అతను కొట్లోకి పోయి కూర్చున్నప్పుడు సైదాలికుట్టి,

'ఇతనికి వ్యాపారం చేయడం నేర్పుతున్నాను'. అన్నాడు.

అంగడిలో దీపం వెలిగింది. కిటికీల చువ్వలనుంచి సంధ్యవేళలో, చీకటి అలుముకుని వెలుగు తగ్గుతోంది. కొండి చివర్న నీలమైన ఆకాశం నల్ల పడింది. మంచు మండలంలో చీకటి పడింది. చలివెయ్యనారంభించింది.

సైదాలికుట్టి కిటికీ దగ్గిర నిలుచుని "ఇద్దరు ముగ్గురు మనుష్యులు వస్తున్నారక్కడ, అక్కడే వుండరా.... నేను వస్తున్నాను" అన్నాడు.

సైదాలికుట్టి కొట్లోకి వెళ్లాడు.

ఫాతిమ ఊరు క్షేమాలన్నీ అడిగింది రెండేండ్లయింది ఆమె తన బిడ్డ లతో అక్కడికి వచ్చి. అక్కడున్న పొలం అప్పుపడిపోయింది, దాన్ని అమ్మేసి అప్పుతీర్చారు. మళ్లీ స్వంతంగా వారి గ్రామంలో ఇల్లూ, పొలమూ కొన్న తరు వాతే అక్కడికి పోవాలని వారి వుద్దేశం.

"ఇంత పెద్దవాడవయావిప్పుడు. అయ్యప్పస్వామిగుడి కాలువకు పోయే టప్పుడు నిన్నుచూశాను. అప్పుడు నువ్వు చిన్నవాడివి. పాలు తాగే ప్రాయం."

అప్పుణి గోడపైన జరిగి ఏదో ఆలోచిస్తున్నాడు. పెరిగి పెద్దవాడయ్యాడు. ఇంకా పెరుగుతున్నాడు.

"పారుకుట్టమ్మకు వయసవ్వలేదు కదా!"

అప్పుణి ముఖం దించుకున్నాడు.

"లేదు."

"ఏం చేస్తున్నారిప్పుడు ?"

"ఊం."

ఇక ఏదీ అడగకూడదని అతని ప్రార్థన. అమ్మ వెనుక నుంచి చూస్తున్న రెండు నల్లని కళ్లు మెల్లిగా అప్పుడే గమనించాడు. అమ్మ తిరిగి వెళ్లినప్పుడే ఆమెని అతను సూటిగా చూడగలిగాడు. ఎర్రగా వున్న ఒక అమ్మాయి. ఆమె ముఖములో ఏదో ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వు కనిపించింది.

"ఏమిటి, చూస్తున్నావు ? మనతో వ్యాపారం చేసిన వారికొడుకే."

ఆమె సిగ్గుతో ముఖం వంచుకొని వెళ్లిపోయింది నంభీసు. "కుట్రాడి కంటె పెద్దది. ఈ మన పల్లెటూరే బాగుందని అంటుంది" అన్నది అమ్మ.

అప్పాణి ఇంటి నాలుగు వైపులా చూశాడు. గోడలు నల్లరాళ్లతో కట్టి వున్నాయి. ఇంట్లో రెండు గదులకును, గడప, తలుపులున్నాయి. ఆ ప్రక్క గదికి అరుగు ఒకటి వుంది. దాని పైన ఒక చిమ్నీ దీపము వెలుగుతోంది దాని క్రింద వంటగది లోపల నంబీస పోవటం మళ్లీ రావటం చూస్తున్నాడు అప్పాణి. వెలుగులో వస్తున్నప్పుడు ఆమె జరీపావడ తళ తళలాడింది. చీకటి పడుతున్నప్పుడు, సంధ్య వేళలో ఇనుప బ్రిడ్జీవద్ద బండలపై కూర్చున్నప్పుడు, మేఘ మండలముల్లో సగము దాగి కనపడుతున్న చంద్రుని రూపము అతని మనసులో మెదిలింది.

సైదాలికుట్టి వచ్చేవేళకు ఫాతిమ గడప దగ్గిర నిలుచుని మాట్లాడుతోంది

"ఇక్కడ సౌకర్యాలు సరిగాలేకుంటే నువ్వుసహించుకోవాలి," అన్నాడు సైదాలికుట్టి.

అప్పాణి నవ్వి వూరుకొన్నాడు అక్కడ వుండిపోవటానికి అతనక్కడికి రాలేదు........

"స్నానం చేయవద్దూ?"

అప్పాణి మాట్లాడలేదు.

"కష్టమేంలేదండి. ఇలా పోతే నీళ్లున్నాయి. నీళ్లు మంచివే."

"స్నానం చేయాలి."

"చన్నీళ్ళతో స్నానంచేస్తే అలుపు తగ్గుతుంది. ఒంట్లో సెగ తగ్గుతుంది. షర్టు విప్పండి."

అప్పాణి షర్టువిప్పాడు. సంచిలో నుంచి తువ్వాలు తీసి భుజముపై వేసుకున్నాడు.

"ఫాతిమా, మంచినూనె కొంచముంటే ఇయ్యి."

ఫాతిమా అప్పాణి కుడి చేతిలో కొంచం నూనె పోసింది. చిక్కుపడిన తలకి అప్పాణి నూనె రాసుకున్నాడు.

"నంబీసా, నాటార్చి తీసుకురా."

వంటగదిలో నుంచి నంబీస ఆ ప్రక్కనే వున్న గదిలోనికి వెళ్ళింది. టార్చి తీసుకుని బయటికి వచ్చింది. టార్చి తన ముఖం మీద పడింది.

వెలుగు పడినప్పుడు ఆమె తెల్లని పళ్ళు పైకి కనపడేట్లు నవ్వింది. త్వరగా సైదాలికుట్టి వెనుక నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

సైదాలికుట్టి ముందు అప్పుణి వెనుకా నడుస్తున్నారు. రోడ్డు మీంచి దిగి ఖాళీ స్థలానికి కొంచెం దూరంనడిచారు. ఆ ప్రక్కన బండల మధ్యనుంచి క్రిందికి నీరు శబ్దంచేస్తూ ప్రవహిస్తోంది.

పైన తెల్లని మంచుతో ఆకాశం. నల్లగా ఎత్తైన వృక్షాలు. ఒక ప్రక్కన కొండల పైగా ఎక్కడచూసినా వేలాది మిణుగురు పురుగులు మెరుస్తున్న ఆ దృశ్యం చూసేందుకు అద్భుతంగా వుంది. ఆ అడవి దగ్గిర పడే కొండ నీరు ప్రవహిస్తున్న దృశ్యాన్ని అప్పుణి చూస్తూ నిలబడ్డాడు.

చల్లని గాలి వీస్తూంది. వెంటనే నీళ్ళలోపల దిగాలనిపించలేదు. ఒక బండపైన కూర్చున్నాడు. క్రింద ఇసుక. చిన్న చిన్న గులకరాళ్లు నిండిన ఆ నీటి కాలువ గట్టుపై సైదాలికుట్టి కూడా కూర్చున్నాడు. అప్పుణి తన వుద్యోగాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

"మనం రేపు మీనన్ గారిని పోయి చూద్దాం."

"ఏమీనన్?"

"ఎస్టేట్టు మీనన్. సాయబు ఇంగ్లాండు కెళ్లాడు. ఇప్పుడు మూప్పరు అక్కడ వ్యవహారాలు చూసేది."

"పని దొరకుతుందా?"

"దొరకలేదంటే నేను వేరెక్కడైనా ఏర్పాటు చేయగలను. ఆ విషయమై నాకున్న శ్రద్ధ నీకు తెలుసు........"

సైదాలికుట్టి క్రిందకి దిగి అతని కెదురుగా ఇంకో బండపై కూర్చున్నాడు. అతను జేబులోంచి బీడీ తీసి కాల్చసాగాడు.

"నేను చెబితే అతను కాదనడు. మన ప్రాంతంపువాడే."

సైదాలికుట్టి శంకరమీనన్ గురించి చెప్పాడు. గుడలూరునుంచి అతని ఊరికి ఐదారుమైళ్లే ఉంది. అక్కడుండగానే సైదాలికుట్టికి అతను బాగా పరిచయమయ్యాడు అతనికి కావలసినప్పుడు చేపలు తెచ్చి యిచ్చేవాడు. అతనికి ఎన్నో సహాయాలు చేసేవాడు.

అయినా అప్పుణికి సందేహం కలిగింది. పెద్దమనుష్యులు ఇవన్నీ పట్టించుకుంటారా?

ఆవిషయం సైదాలికుట్టిని అడిగాడు.

"అతను నన్ను మరచిపోయేందుకు వీల్లేదు."

సైదాలికుట్టి కంఠం గంభీరంగా మారింది. ఆ కారణం అడక్కుండానే అతను "అదొక పెద్దకథ" అంటూ చెప్పనారంభించాడు.

తన గ్రామంనుంచి మొట్టమొదట వయనాటికి వచ్చి పనికోసరం అల్లాడుచుండగా శంకరమీనన్ ఆసమయంలో తేయాకుతోటలో నుంచి ఇక్కడికి బదిలీ అయివచ్చి వున్నాడు. సైదాలికుట్టి అతన్ని వెళ్లికలుసుకున్నాడు. అతను అయిదురూపాయలిచ్చాడు. అయిదు రూపాయలు కాదు అతనికి అవసరమైనది ఏదైనా వుద్యోగం. పల్లెలో వుండగా అతను మీనన్‌కి చేపలు కొనియిచ్చిన విషయం మీనన్‌కి గుర్తులేదు.

"సౌకర్యము లెక్కువైతే, మనుష్యులకు జ్ఞప్తి కాస్త తగ్గిపోతుంది" అని సమాధానపడ్డాడు సైదాలికుట్టి.

ఆ తర్వాత సైదాలికుట్టి అతన్ని పదే పదే కలుసుకోగా అతను తోటలో కూలిపని ఇప్పించాడు. ఒకరూపాయ రోజుకూలి. అప్పుడు మీనన్ అక్కడ అసిస్టెంట్ మానేజరు. ఎస్టేటులో నివసించేందుకు పెద్ద భవనమొకటి వుండేది. బంగళా వరండాలో సౌకర్యమైన స్థలంలో సైదాలికుట్టి మకాం ఏర్పాటయింది.

ఆరోజుల్లో మీనన్ అవివాహితుడు. అయినా కూలిపని చేస్తున్న కొంత మందితో సంబంధాలు ఏర్పడ్డాయి. మేస్త్రీ కుంజుకణ్ణనికి కొన్ని ఆశలుచూపి తన స్వప్రయోజనాలకోసం ఉపయోగించుకునేవాడు. కుంజుకణ్ణనికి అందువల్ల లాభమే. ఇట్టి రాకపోకలు అతనికి అలవాటైపోయాయి. అంటే స్త్రీల స్నేహం మీనన్‌కి. దీనినిగురించి సైదాలికుట్టి ఏమీ పట్టించుకోలేదు. అయితే ఎక్కడ్నుంచో ఒక పనిగత్తె అక్కడికొచ్చి చేరిన తర్వాత సైదాలికుట్టి తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. గోపాలన్ అనే వంటవాడొకడుండేవాడు. అక్కడ పిలిచిన వెంటనే వచ్చేందుకు ఎస్టేటు నౌకర్లుండేవారు. మీనన్‌కి ప్రత్యేకంగా వేరే నౌకర్లుండేవారు.

"కంటికందమైన పడుచు, ఆమె నాయరు కులానికి చెందిన పడుచుగా తోచలేదు."

ఆమె అక్కడికి పనిగత్తెగావచ్చింది. అయినా అక్కడ పనిఏదీచేయుట లేదు. మీనన్‌కి ఆహారము మొదలైనవి తయారుచేసి పెట్టటం ఆమె పని.

ముందువైపు ఒక గది మాత్రమే వుంది మధ్యాహ్నం వేళలో, సాయం కాలము వేళలో ఆమె కనపడేది.

పనివారెవరూ ఆమెను చూసినట్లు కనపడలేదు. ఆమె అధికారం చూపుట మొదలు పెట్టినప్పుడు గోపాలన్ గొణగటం ప్రారంభిచాడు.

ఆ తగవుల మధ్య సైదాలికుట్టి వేరుగా వుండటం ప్రారంభించాడు. కొన్ని రోజుల తర్వాత ఆ పనికత్తె క్రిందికి దిగిరావటం మానేసింది, కొన్ని మాసాలైన తర్వాత ఒకరోజు రాత్రి బట్లర్ గోపాలన్ సైదాలికుట్టిని పిలిచాడు.

ఎందుకోసం? ఎందుకని అడిగినప్పుడు గోపాలన్ తనకు తెలియదన్నాడు ఆ రాత్రి గంట పది అయి వుండవచ్చును. సైదాలికుట్టి అతనితో వెళ్ళాడు. మీనన్ సిగరెట్టు త్రాగుతూ అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. గోపాలన్‌తో లోపలకెళ్ళగానే అతను గోపాలన్‌తో ఏదో చెప్పి వెళ్ళిపోయాడు.

గోపాలన్ వెళ్ళిన తర్వాత సైదాలకుట్టిని అక్కడే వున్న ఒక గదిలోకి మేనేజర్ పిలుచుకొని పోయాడు.

"సైదాలికుట్టి"

అతని పిలుపు కొత్తగా వుంది

"సైదాలికుట్టీ నీవల్ల నాకు ఓ సహాయం కావాలి !"

"ఏమిచేయాలండి?"

"కొంచెం సేపు ఇక్కడే వుండు, తర్వాత చెబుతా"

సైదాలకుట్టి ఆ గది ప్రక్కనున్న పొయ్యి దగ్గరకు వెళ్ళి చలికాచుకుంటున్నాడు. ఏదో ఆశ్చర్యము భయము కలిగిందతనికి. గోపాలన్ బహుశః నిద్రపోయుండాలి. చదువుకొనే గదిలో సైదాలికుట్టి పుస్తకములు పెట్టిన గోడ అలమారు, ఆ ప్రక్కనే పొయ్యిలో మండుతున్న నిప్పుని చూస్తూ కూర్చున్నాడు.

ఎంత సేపైనదీ సైదాలికుట్టికి తెలియదు.

మళ్ళీ మీనన్ గొంతు విన్నప్పుడే సైదాలకుట్టి లేచాడు

"రా", అని మాత్రం పిలిచాడతను. అతను పైకి వెళ్ళాడు

మెల్లిగా సైదాలికుట్టి లేచాడు

మిద్దెపై ఒక గదిలో బల్లమీద ఒక దీపం వెలుగుతోంది వెలుగు కొంచెం తగ్గించాడు మేనేజర్. చీకటి అలుముకుంది మంచంమీద కళ్ళు మూసుకున్నట్టు తెల్లని పరుపుపై పడుకొని వుంది ఆ పనిగత్తె అప్పుడు సైదాలికుట్టికి

ఇంకోటి కనబడింది నేలపైనా పడక గది గడప పైన రక్తం మరక లున్నాయి.
"పుట్టించినవాడా!" సైదాలికుట్టికి గుండె పగిలినట్లుయింది.

మీనన్ ఇంకో మంచంమీద తెల్లని గుడ్డలో చుట్టి వున్న మూటని చూపించి తగ్గు స్వరంతో "దాన్ని తీసుకొని వెళ్లి పూడ్చి వేయాలి." అన్నాడు.

అతనప్పుడు భీతితో చూశాడు లోతుగా వల్లం చేసి పూడ్చేయాలి. కొంచెం దూరంగా తీసుకెళ్లి, ఎక్కడైనా పూడ్చేయి. మూడవ మనిషికి ఈ సంగతి తెలియకూడదు".

సైదాలికుట్టి ఆగుడ్డమూట తీసుకున్నాడు. చేతులు వణికాయి. మెత్తగా చల్లబడిపోయినదేదో తగిలింది అ గుడ్డని విప్పగా ఒక చిన్నశిశువు. ప్రాణం లేదు

"కట్టెలు వేసిన గదిలో పార వుంది. త్వరగా."

గుడ్డలో కట్టిన అమూటని సైదాలికుట్టి చేతిలోకి తీసుకున్నాడు.

—అక్కడ ఇప్పుడు ఏదో ఒక పువ్వుల చెట్టు వుంది. "మూప్పల్ని చూసేందుకు వెళ్లినప్పుడా చెట్టుని చూపిస్తా."

"మూడవ మనిషికి తెలిసింది ఇప్పుడే."

ఐసులాగా చల్లగా వుంది. స్నానం చేయడానికి మనస్సు ఒప్పలేదు. సైదాలికుట్టి స్నానం చేస్తున్నప్పుడు తానుకూడా దిగి ఒక్కసారి మునిగాడు

తిరిగి వెళ్ళినప్పుడు, సైదాలికుట్టి తాత్కాలికంగా అన్ని విషయాలూ మరచి పోయాడు. మనస్సులో మెదిలింది ఒక్కటి మాత్రమే,

అప్పటికి ఇంకొకరి ఇంట్లో మొట్టమొదట అన్నం తినవలసి వచ్చింది ఈనాడు. అకాలములో మహమ్మదీయుల ఇంట్లో నీరుకూడా త్రాగేవారు కాదు. అదే వారి సంప్రదాయం. ఇప్పుడు, సైదాలికుట్టి ఒక ప్రక్క కూర్చున్నాడు. మరోప్రక్క మహమ్మదు కుట్టి. ఎదురుగా పసుపు రంగులో మాంసము లోనుంచి అవిరి వస్తున్న అన్నము, కూర అన్నం వెడుతున్నది ఫాతిమ.

ఉత్తరాది వారింట్లో బైటనుంచి లోపలికి పోవాలంటే స్నానం చేసే పోవాలి. ఇతర కులస్తులు అ ఇంటి బావి ప్రక్క కూడ పోయేందుకు వీలు కాదు.

ఫాతిమ పెట్టిన అన్నము, కూరలు తింటున్నప్పుడు, అప్పటికి ఏమీ వ్యత్యాసం తోచలేదు. ఎంతకాలంగా పాతుకపోయిన భావాలు తొలగిపోయినందుకు ఆనందం కలిగింది.

రాత్రి నిద్రపోయేందుకు ఏర్పాట్లు జరిగినప్పుడు ఆ నడవలో అప్పణికి చాపవేశారు. చిరిగిన ఒక మురికి తలగడ వేశారు

"ఏదైనా కావాలంటే పిలిచి లేపు"

సైదాలికుట్టి అన్నాడు "ఈ టార్చిలైటుని తలక్రింద పెట్టుకో. బయటికి వెళ్ళాలంటే నన్ను లేపు".

"ఊఁ"

"భయపడకు "

"ఊం, ఊం."

"భయపడేందుకు ఏమీలేదు. నీ విప్పుడు చిన్నవాడివి కావు. ఒక పెద్ద మనిషివి."

సైదాలికుట్టి నవ్వాడు

బాగా చలిగా వుంది. చలిగాలి వీస్తోంది. తలగడపైగా ముఖాన్నిదూర్చి అప్పణి ఆలోచిస్తున్నాడు. ఎంత విరోధిగా ఆ సైదాలికుట్టి కనబడ్డాడో ఇప్పుడు అంత సన్నిహితుడుగా అయ్యాడు.

# తొమ్మిది

తిరుఓణంపండుగకు ఇంక ఐదురోజులే ఉన్నాయి. చలికాలంలో చెట్లన్నీ చిగిర్చి, కొండప్రక్కనున్న ఆ గ్రామాన్ని తమలో దాచుకున్నట్లుగా ఉంది.

ఆ ప్రాంతాన్ని వదలి ఐదు సంవత్సరములు.... కాదు ఏభైసంవత్సరాలు అయినట్లుంది అప్పణికి. ఏరు, చిన్న నీటి మొక్కలతో నిండిన అడవిలాగ మొలచిన మొగలిచెట్లు, ఆ మధ్యనున్న కొండప్రదేశములు ఎప్పుడో, ఎక్కడో చూసిన గుర్తు. అవి అన్నీ మరచిపోలేక పోతున్నాడు.

రాత్రింబగళ్ళు కళ్ళుమూసినపుడు ఒక చిన్నమూలగది అతనికి జ్ఞప్తికి వచ్చింది. ఆ గదిలో ఒకమూల మొగలి ఆకులతో అల్లినచాప చుట్టి వుండేది.

ఐదు సంవత్సరముల తర్వాత ఇంకొక స్థలమునుంచి తలచుకొనే తలపులు అవి. ఆ రోజుల్లో జీవితములోని చేదులన్నిటిని జీర్ణించుకొన్నట్లనిపిం

చింది. బాస్కరన్ నంబియార్. కురుప్పు; జోసఫ్‌లతో తన చిన్నతనంలో జరిగిన సంఘటనలు అన్నీ చెప్పి ఒకసారి గుర్తు చేసుకోవాలనిపించింది. చదువుకొనే రోజులలో వాళ్ళు చెప్పేవి వినేవాడు. కాని మాట్లాడేవాడు కాదు.

ఇక్కడ కొచ్చినప్పుడు-ఒక చిన్న గోనెసంచిలో రెండు జతలు బట్టలు, ధోవతి మాత్రమే వున్నాయి.

అప్పుడు సైదాలికుట్టిని గురించిన ఆలోచనలు వచ్చాయి.

అన్నీ సైదాలికుట్టియే దగ్గరుండి చేశాడు. ఎస్టేటు మేనేజరు బంగళాకు తీసుకుని వెళ్ళి అతని దగ్గర వాగ్దానం తీసుకున్న తర్వాతనే తిరిగి వచ్చాడు.

ఒక్క వారం రోజులు ఎదురుచూడవలసి వచ్చింది "ఫీల్డు రైటర్"పనికి నియమించిన తర్వాతనే సర్వీసు బాండు వ్రాసి యిచ్చాడు.

మొదట్లో నూటనలభైఅయిదు రూపాయలుజీతము. నూటనలభైఅయిదు రూపాయలు!! ఉండటానికి ఇల్లు వేరే.

బాస్కరనంబియారుతోనే మొదట పరిచయమైనది. అతనితో వున్న క్లార్కుకు ఇంకా పెండ్లి కాలేదు. అందువలన ఒంటరిగానే ఉన్నాడు. ఒంటరిగా వుండేవారికే ఆ క్వార్టర్సు ఇచ్చారు. అప్పుణికికూడ అక్కడనే ఇచ్చారు.

నెలకు నూట నలభైఅయిదు రూపాయలు జీతం. ఇంతవరకు నూరు రూపాయల నోటును కంటితో చూసినది లేదు అప్పుణి.

భాస్కరనంబియారు చెప్పాడు-ఫర్వాలేదు సంవత్సరానికి అయిదు ఆరు నెలల బోనసు దొరుకుతుంది. అదీ ఒక విశేషమే.

"ఒక్క సంవత్సరం పని చేస్తే అయిదారు నెలల జీతం" తనలోనే అనుకొన్నాడు అప్పుణి.

ఆ తర్వాత అబ్రహాం జోసఫ్‌లు పరిచయమయ్యారు. తనని తాను పరిచయం చేసుకోవటం అతనికెప్పుడూ కష్టంగానే వుండేది.

"మీరేవూరినుంచి?"

"ఇంట్లో ఎవరైనా ఉన్నారా?"

అదొక కష్టాన్నిచ్చే ప్రశ్న.

"చెప్పుకోతగ్గవారెవరూ లేరు."

"తండ్రి?"

"చనిపోయారు."

"అమ్మ?"

"లేదు" అని తడబడుతూ చెప్పేశాడు. అది తన్నే వంచించుకున్నట్లు తోచింది. ఆత్మవంచన హృదయంలో ఒక పెద్దభారముగా తోచింది. ఆ తర్వాత దానిని సరిదిద్దుకోవటానికి లేకపోయింది.

"అక్క చెల్లెలు అన్నతమ్ముళ్ళు?"

"లేరు."

"అదృష్టవంతులు మంచి భాగ్యమే"

భాస్కరసంబియార్ ఇలా అన్నాడు "నాకు అందరూ వున్నారు. అందరికీ డబ్బు యిచ్చి తీరాలి చాలదూ వేదనకి?"

ఒక నెలవరకు ఏదో ఆందోళనగా వుంది. ఆ తర్వాత అన్నీ సర్దుకుని అలవాటైపోయాయి.

నూటనలభైఅయిదు రూపాయలను ఎంచి తీసుకున్నప్పుడు, అంతడబ్బు స్వయంగా సంపాదించానని తలచినప్పుడు ఏం తోచలేదు. క్వార్టర్సులో ఖర్చు నలభైమూడు రూపాయలు మాత్రమే అవుతుంది

కొత్త జీవితంలో డబ్బుని పొదుపుచేయ నారంభించాడు.

నౌఖరు కృష్ణన్‌కుట్టి వచ్చి అడిగాడు.

"నీరు వేడిగా వున్నది. స్నానంచేస్తారా బాబూ?"

"చేస్తాను"

"ఏమండి?"

"తర్వాత చేస్తాను."

అతను వెళ్ళిపోయాడు.

బయట ఇపుడు ముళ్ళకంచలో తేయాకుచెట్లు నీడలు లాగా కాన వస్తు న్నాయి. దుస్తులుమార్చాలి. స్నానంచేయాలి, అన్నం తినాలి. అయితే ఆపడక కుర్చీలో పడుకొని ఏదేదో తలపుకువచ్చి అతనికి ఆనందంగా ఉంది

మొదటినెల జీతం తెచ్చిన మర్నాడు, సైదాలికుట్టిని చూడడానికి వెళ్ళాడు. ఆ రోజు ఇప్పటికీ స్పష్టముగా జ్ఞప్తికి వుంది. అది శలవు రోజు

సైదాలికుట్టి చేతిలో ఒక కట్ట నోట్లు పెట్టినప్పుడు అతను "ఇదేమీ వద్దు నాకు అబ్బాయీ, నువ్వు దుబారా ఖర్చుచేయవద్దు, రేపు నాలుగుకాసులు అవ సరం వుంటుంది." అన్నాడు.

అప్పట్నుంచే డబ్బు కూడబెట్టి చేర్చాలనే ఆలోచన కలిగింది. అదే మొదటనుంచి చేసుకున్న నిర్ణయం. అవసరమైతేనే ఖర్చుపెట్టాలి.

తన గ్రామంల్లోనుంచి ఏమీ సంగతులు లేవు. పనిదొరికిన రోజు రామ కృష్ణన్ మాస్టరుగారికొక పుత్తరం వ్రాశాడు. ప్రత్యుత్తరం వచ్చింది. రెండవసారి ఉత్తరానికి జవాబు రాలేదు. మళ్ళీ వ్రాసి జవాబుకోసరం ఎదురుచూశాడు. మాస్టరు అక్కడనుంచి బదిలీఅయి వెళ్ళి పోయుండవచ్చును.

చాలా రోజులుగా గ్రామానికి వెళ్ళాలని మనసుగా వుంది. గ్రామానికి వెళ్ళవలసిన అవసరమేదీలేదు. ఊరికే ఆ గ్రామంలో ప్రత్యేకమైన పనిలేదు కూడా. అక్కడ తనకోసం ప్రియముతో ఎవరైనా ఎదురుచూసే వారు లేరని పించిది. అయినా ఒక్కసారైనా అక్కడికి పోవాలి ఉత్తరాది ఇంటికి వెళ్ళాలి ఎవరికీ అక్కరలేని అప్పుణిని వారంతా చూడాలి. ఎవరిసహాయము లేకనే సుఖంగా వున్నాడని వాళ్ళంతా తెలుసుకోవాలి,

శలవు తీసుకున్న విషయం ఎవ్వరికీ చెప్పలేదు చెబితే ఆశ్చర్యపడతారు. ఎప్పుడూ శలవుతీసుకోని వ్యక్తి అని అతనికి పేరు ఎవరూ బంధువులు లేరని వారి విశ్వాసం.

తోటలోపల తోపుమధ్య ఎత్తైయినగట్టు వైపు, తల ఎత్తుకుని ఒక్కసారి నడిచిపోవాలి. 'ఇదిగో అప్పుణి వచ్చాడని' ఆ గ్రామములో నున్నవారు చెప్పకోవాలి.

పోయే ముందు సైదాలికుట్టిని ఒక్క సారి కలుసుకోవాలని పించింది. అతన్ని చూసి ఎనిమిది తొమ్మిది మాసాలైంది. మొదట్లో సైదాలికుట్టి కొట్టుకి వారానికి ఒక్కసారయినా వెళ్ళి వచ్చేవాడు. అతనుకూడ యిక్కడికి వచ్చి పోయేవాడు

గడిచిన కాలాన్ని గురించిన జ్ఞాపకాలు సైదాలికుట్టిని చూసినప్పుడే వచ్చేవి. అతని నౌఖరు మళ్ళీ వచ్చి చెప్పాడు.

"వేన్నీళ్ళు చల్లారిపోతాయి"

అప్పుణి లేచి లోపలికి వెళ్ళాడు. అప్పుడూ ఆలోచనలోనే వున్నాడు.

ఎస్టేటు రోడ్డు ఎక్కిపోతే బస్సు నిలబడే స్థలానికి వెళ్ళవచ్చును. ఆ మూలలో ఎస్టేటు పేరు వ్రాసిన ఒక చెక్కపలక వుంది. రోడ్డుమీద అప్పుణి

నడచి పోతుండగా ఎదుట సూపర్‌వైజర్ ఫిలిప్పు రావటం చూశాడు. ఒక్క సారి నవ్వి అతన్నిదాటి వెళ్ళేందుకు ప్రయత్నిస్తుండగా అతనడిగాడు.

"ఎక్కడికి?"

"ఊరికే, అలాగా."

అంగడి వీధిలో సైదాల్లికుట్టి కొట్టుకెళ్లినప్పుడు బయట ఎవరూలేరు. ఒక నిమిషం ఆగాడు. అప్పుడు మహమ్మదు కుట్టి బయటికొచ్చాడు.

లోపలకెళ్లి అడిగాడు.

"నాన్నలేరూ, మహమ్మదుకుట్టి? "

"పడుకున్నాడు. లోపలకు వెళ్ళండి"

"పడుకోనున్నారా - ఏమైనది. వాప్పకు?"

"ఆరోగ్యం బాగాలేదు."

బయట మంచి శబ్దం విని ఉండాలి సైదాలకుట్టి.

"ఎవర్రా అది?" అనడిగాడు.

"అప్పుణి."

"ఇక్కడ లోపలకి రమ్మను,"

అప్పుణి గోనతెరని లోపలికి వెళ్లాడు ఒక చాప మీద సైదాలికుట్టి పడుకొని వున్నాడు పూర్వం చూసిన సైదాలికట్టి అనేందుకు వీల్లేదు. శరీరం బాగా చిక్కిపోయింది ముఖంలోని ఎముకలు బైటికి కనబడుతున్నాయి. అతన్ని చూసి సైదాలికుట్టి మెల్లగా నవ్వాడు.

"ఒంట్లో బాగాలేదు"

"ఏమిటి ఏమైంది?"

"వాతం. కాలు ముడుచుటకు వీలుకాదు. కుడివైపు చెయ్యి కాలు పడి పోయాయి.

ఫాతిమ ప్రక్క నొచ్చి నిలిచి కళ్ళు తుడుచుకొని చెప్పింది.

"మూడు నెలలైంది పడకలో పడి. పక్షపాతమని వైద్యులు చెబు తున్నారు"

"ఒకపీట తెచ్చి వెయ్యి."

"ఏమీ వద్దు" అన్ని అప్పుణి సైదాలికుట్టి చాప మీద కూర్చున్నాడు.

కొంచెం బాధగా..

"నాకు తెలియనే తెలియదు" అన్నాడు.

"పుట్టించినవాడు ఇలాగ చేశాడు మహమ్మదుకుట్టితో చెప్పి పంపా లంటే ఈయన వద్దని వాదించారు."

ఫాతిమ ముఖంలో పూర్వం వున్నకళ లేదు. గుమ్మంలో నంబీస వచ్చి నిలుచుంది. ఆమె ముఖంలో విషాద ఛాయలు అలుముకుని వున్నాయి.

నేలవైపు చూస్తూ మౌనంగా నిలుచుందామె.

"నేనింక లేవలేననిపిస్తోంది. ఈబిడ్డలు ఇక ఆధారము లేనివారు"

సైదాలికుట్టి స్వరం తగ్గింది

ఫాతిమ శోకంతో మెల్లిగా విషయాన్ని చెప్పింది. వ్యాపారమంతా దెబ్బతిన్నది అయిదు నెలలగా అంగడి అద్దె ఇవ్వలేదు. ఎక్కడికి పోవాలో ఆమెకు బోధపడలేదు.

"ఫాతిమా కొంచెము మంచినీళ్లైనా కావాలని అడగలేదే అతన్ని."

అప్పుణి తొందరగా "నాకేమీ వద్దండి" అన్నాడు

ఫాతిమ లోపల కెళ్లింది సైదాలికుట్టి. అప్పుణి మాత్రమే మిగిలారు.

"అబ్బాయీ, ఇదంతా పుట్టించినవాని కార్యం, చేసిన పాపాలకు తగిన ఫలితం నాకు దొరికింది."

అప్పుణి సైదాలికుట్టి ముఖాన్ని చూడలేకపోయాడు.

"నీవెట్లాగో ఒకదారికి వచ్చావు అదే సంతోషం."

ఆ తర్వాత నడవలో నిశ్శబ్దత ఆవరించింది.

"పుట్టించిన వానికి ఇష్టంలేని పని ఒకటి నేనేచేశాను...."

ఏమిటది? అని సైదాలికుట్టి నడిగి తెలుసుకోవాలని అప్పటికి తోచింది.

"మీనాన్న, నేను ఒక గిన్నెలో అన్నం తినేవాళ్లం."

అప్పుణి ముఖము ఎఱ్ఱపడింది. కళ్ళు త్రిప్పుకొని:

"ఆవిషయాలు ఇక మరచిపోండి" అన్నాడు

"నీకు తెలియదబ్బాయీ! తెలిస్తే........"

"నేను విన్నాను మరచిపోయాను కూడా,"

అప్పుడు అతని భార్య సైదాలికుట్టి తల ప్రక్కనున్న అగ్గిపెట్టె తీసుకో వడానికి వచ్చింది. ఏదో చెప్పాలనిపిస్తున్నట్లు సైదాలికుట్టి ఊరుకున్నాడు.

"పుట్టించినవాడు మరచిపోడు. నేను కన్నుమూసుకుంటే పెద్దదైన ఒక

కూతురు. మామిడి, పనస పండులాంటి ఒక పిల్లాడు - అంత్లా పుట్టించిన వాని పని."

చాల కష్టపడి అప్పాణి,

"సైదాలికుట్టి బాధపడకండి" అన్నాడు.

ఫాతిమా ఒక తెల్లగ్లాసులో టీ తెచ్చి యిచ్చింది. అతను మెల్లగా త్రాగుతూ చెప్పాడు

"రేపు నేను ఊరికెళ్ళుతున్నాను."

సైదాలికుట్టి ముఖం ఆశ్చర్యంతో నిండిపోయింది.

"మంచిది వెళ్లిరా!"

కొంచెం సేపైంది తర్వాత లోపలిగడప దగ్గరికెళ్ళాడు.

ఫాతిమా గోడకు అనుకొని నిలబడింది. ఆమె వెనుక నంబీస నీడలా నిలబడింది

"సైదాలికుట్టికి అవసరమైనది చేయాలి .... అద్దె బాకీ రేపు తీర్చేద్దాం. మహమ్మదుని రేపు ప్రొద్దున నేనుండే తోటకు పంపించండి...."

గుడ్డి వెలుతురులో ఫాతిమ కళ్ళల్లో నుంచి ముత్యాలలాగ కారుతున్న కన్నీటిని చూశాడు. ఆమె దగ్గరకెళ్ళి ఆత్మీయతతో:

"ఏం బాధపడకండి మీకేం కష్టం ఉండదు,"

ఫాతిమ వెనుకనుంచి ఏడుస్తున్న శబ్దం వినిపించింది. బయట కొచ్చాడు సైదాలికుట్టితో వెళ్ళొస్తాననిచెప్పాడు. తిరిగొచ్చాక మళ్ళీకలుస్తానని చెప్పాడు

"అబ్బాయ్!" అప్పాణి పోబోతుండగా సైదాలికుట్టి పిలిచాడు. అప్పాణి ఆగిపోయాడు

"ఇంతకాలంగా చెప్పాలను కొంటున్నాను."

"ఏమిటది?"

"అమ్మని మరచి పోకూడదు. ఆమెకు నువ్వుకాక వేరెవరున్నారు?"

అప్పాణికి ముచ్చెమటలు పోశాయి.

"చూద్దాం సైదాలికుట్టి "

అతను వేగంగా రోడ్డెక్కాడు. రోడ్డుకు రెండు వైపులా దీపాలు వెలుగుతున్నాయి. అంగడి వీధిలో సాయంకాలం వ్యాపారం ప్రారంభమైంది. ఐదేళ్లైనా ఆ వీధిలో విశేషమైన అభివృద్ధి ఏమీలేదు. అదిగో అక్కడనే మొదట మొట్టమొదట బస్సు దిగింది చిరిగిపోయిన పాత షర్టుతోను, ధోవతితోను చేతిలో గోనె సంచితోను, కలవరంతో దిగింది...."

మర్నాడు, ఎండ తగ్గి చీకటి పడే వేళకు పల్లిపురం స్టేషనులో రైలు దిగాడు.

కూలివాడి తలపైన పెద్దతోలుపెట్టి హోల్డాలుపెట్టి తిన్నగా నడిచాడు, పరిచయమైన ముఖమేదైన కనబడుతుందేమోనని చూద్దామనుకొన్నాడు. దాని కిప్పుడేమి అవసరం? టికెట్టు పోర్టరు చేతిలో పెట్టి రైల్వే లైను మధ్యగానడిచి వెళ్ళాడు. ఒక ఘడియసేపు నడచిన తర్వాత కురనూరు వంతెన వచ్చింది.

వంతెనపై చుట్టూతా కలియ చూచాడు నల్లటి ఇనుప స్తంభాలు సగం పైనీళ్ళల్లో మునిగి వున్నాయి. ఆ ఏరు నీటితో ఉధృతంగా ప్రవహిస్తున్నది. గట్టున నడుస్తూ, నేంద్ర అరటి తోడలను తాటుకొని మడుగు గట్టుకివచ్చాడు.

అక్కడ నలుగురైదుగురు కూర్చుని వున్నారు వారు అతన్ని ఆసక్తితో చూశారు. అది గమనించనట్లు అతను గుంటలోకి దిగాడు.

నీళ్ళదగ్గరకెళ్ళాడు. నురగలలో అలలు ఇసుకగట్టును తాకుతున్నాయి. ఇసుక గట్టుని కోస్తూ ప్రవహిస్తున్నాయి.

పడవ దగ్గరకు వచ్చింది. అందులో పచ్చగడ్డి మోపుతోను, తాటాకు గొడుగుతోను ఉన్న ఆడవాళ్ళున్నారు. గుడ్డలమ్మే రావుత్తరు కూడా తన మూటతో వున్నాడు.

అతను చెప్పులను చేత పట్టుకొని పడవలోకి ఎక్కాడు. పడవ వాడు ఒక కేక పెట్టాడు. దూరంగా ఆ ఇసుక ఒడ్డుపై కూర్చున్న వారిలో ఇద్దరు పరిగెత్తుకుంటూ వస్తున్నారు. వారి వేగం ఎక్కువైంది.

కూలివాడు పెట్టి హోల్డాలునుదించి పడవలో పెట్టి నీళ్ళల్లోకి ఎంగిలి ఉమ్మి నిల్చున్నాడు.

పాతవాడు కాడు ఇప్పటి పడవవాడు అప్పుడు పీలగా పొడుగ్గా ఒక యువకుడుండేవాడు. ఇప్పుడు పొడుగైన గడ్డమున్న ముసలి వాడున్నాడు.

ఆ పడవ వాడి దృష్టి అంతా ఆ తోలుపెట్టెమీద, హోల్డా మీద ఉంది. ఏటి అలలు చూస్తూ సిగరెట్టు పీలుస్తున్న అప్పుడిపైన వున్నాయి.

ఇంకొక ఇద్దరు ప్రయాణీకులు వచిన తర్వాత పడవ సరంగు నీళ్ళల్లో గడ వేయ్య సాగాడు. గడ నీటి అడుగు భాగం వరకు పోనప్పుడు తెడ్డుతో పడవ నడిపేవాడు,

ఎదుటవున్న ఇద్దరి దృష్టి తనపైనే ఉన్నట్టు అప్పాజి తెల్సుకొన్నాడు అతను నీళ్ళమీంచి తన చూపులను మరల్చలేదు. ఒకడు కూలివాణ్ణి అడిగాడు.

"ఎక్కడికి"

"ఆ గట్టుకు"

అతడు తగ్గు స్వరంతో అడిగాడు.

"ఆయన ఎవరు?"

"నాకుతెలియదు. బండిలో వచ్చాడు"

ఇంకో ప్రయాణీకుడు మెల్లిగా చెప్పాడు

"కళ పురకు ఉండవచ్చును"

పడవ అవలిగట్టుకు చేరినప్పుడు మొదట అప్పాజి దిగాడు ఆ యిద్దరు దిగి నిలబడ్డారు.

పడవ సరంగైన ఆ మాప్లకు అర్ధరూపాయ ఇచ్చాడు

"చిల్లరలేదే!"

"దాన్ని ఉంచుకో!"

ఆ వృద్ధుడి కళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి.

ఆఇద్దరు ఆశ్చర్యంతో చూశారు. అతను క్రిందకు దిగాడు.

అక్కడ తోపుల్లో, చుట్టుపట్ల ప్రాంతములలో ఏమీ మార్పులేదు. పడమటి వైపు ఒక కొత్త కట్టడం కనుపించింది. అదికొత్త ప్రాథమిక పాఠశాల ఏ ప్రక్కన చూడక అప్పాజి తలేత్తుకుని నడుస్తున్నాడు.

పంటలన్ని కోయడం అయిపోయింది. ఎత్తైన పొలం గట్టుపై నడుస్తూ ఇంకో సిగరెట్టు వెలిగించాడు. ఎదురుగా వస్తున్న మనిషి మర్యాద సూచనగా గట్టుదిగి దారినిచ్చాడు.

మూసిన తలుపును దూరంనుంచే చూశాడు. నడకవేగం పెంచాడు. గుమ్మం తలుపు తెరుచుకొని లోపల నడవలో కెళ్ళినప్పుడు ఎవరూ బయట కనపడలేదు. సంశయంతో కొంచెంసేపు నిలబడ్డాడు. ఉత్తరంవైపు నడవలో ఎవ్వరూలేరు. నడవ మధ్య కెళ్లి బిగ్గరగా అడిగాడు.

"ఇక్కడ ఎవరూ లేరా?"

జవాబు లేదు. గుమ్మం దగ్గరగా వెళ్ళినప్పుడు చూశాడు. తర్వాత తాళం వేసి వుంది.

మళ్ళీ వీధిలోకి వచ్చాడు

కూలివాడు పెట్టె హూల్డాలు తలపై మోసుకొని నిలబడి వున్నాడు.

అతను వెనుకప్రక్కకు వెళ్లాడు. రెండో ముళ్ల కంచె కనబడింది. చేతి యంత్రములున్న నడవలో ఒక స్త్రీ పని చేస్తోంది తెల్ల జాకెట్టు వేసుకొన్న నల్లని శరీరం గల ఆమె వెనుక భాగమే అతనికి కన్పించింది.

"అప్పణి దగ్గాడు. ఆమె వెనుకకు తిరిగి చూసింది. ఆమె మీనాక్షమ్మ

"నేను గుర్తున్నానా మీనాక్షత్తా!"

"అప్పణియా!"

ఆమె ఎండి వడలిపోయిన ముఖంలో ఆశ్చర్యం చోటు చేసుకున్నది. కంచె దాటి లోపలికొచ్చాడు

"మీనాక్షమ్మ గుర్తు పట్టివే!"

"బాగా పెద్దవాడయ్యావు."

అతను ఇల్లు చూపించి–

"ఇక్కడెవ్వరూ, లేరా" అని అడిగాడు.

"ఇల్లు చిన్న మామకు రాలేదు."

"ఇదేనా?"

"చిన్నాయిన, మాళు బాగం పంచుకొని ఒక సంవత్సరమైంది. తర్వాత సింగపూరు నుంచి వచ్చిన రాఘవన్ నాయరుకు అమ్మివేశారు. ఇప్పుడు ఎవరూ ఇక్కడుండటం లేదు"

"ఇల్లు పెద్దమామకు, గిడ్డంగి భాగం చిన్నమామకు........"

"పెద్దమ్మ!"

"ఆమె, పిల్లలు వారింట్లో వున్నారు"

చేతి యంత్రపు గదిని చూపిస్తూ ఆమె చెప్పింది "ఇదేనాయిల్లు యిప్పుడు."

అతనికి అంతా తెలిసింది.

అతను కంచె దాటి లోపలికి వెళ్లాడు కూలి వాడి తలపై వున్న పెట్టె హోల్డాలును దింపి, కూలి ఇచ్చి పంపాడు.

మీనాక్షమ్మ లోపలకు పిలుచుకెళ్లింది. ఆమె వెనుకగా వెళ్ళాడు.

ఎత్తుగా కొబ్బరి ఆకుల తడికలతో కట్టినదాయిల్లు. ఆ కాలంలో, వర్ష కాలంలో వరిమోపు కట్టలను పెట్టడానికి, ధాన్యాన్ని రాల్చటానికి ఉపయోగించబడేది. లోపల మట్టిగోడతో మూడు భాగములుగా విభజింపబడి వుంది

"ఇదెవ్వరే?"

మిక్కిలి బలహీనమైన ఒక గొంతు.

"ఎవరది?" అప్పణి అడిగాడు

"అమ్మమ్మ"

అతను ఆ గోడలోని ద్వారంలోంచి లోపలికెళ్ళాడు అక్కడ ఒక వైపున చిరిగిన కంబళిపై ఆమె పడుకుని వుంది.

"ఎవరే అది, మీనాక్షి?"

అతను చాప దగ్గర మోకాలిపై కూర్చుని చెప్పాడు

"నేనే. అప్పణిని అమ్మమ్మా"

అమ్మమ్మ ప్రయాసతో లేచి కూర్చుంది. ఎండిపోయిన పొగాకు లాగ ముడతలు పడిన చేతలతోను, ముడతలు పడిన ముఖంతోను అప్పణిని చూసింది. ఆమె తల మీద ఒక వెంట్రుక లేదు. అతని శరీరాన్ని తడిమి, నిమురుతూ చెప్పింది.

"అప్పణీ, ఎలాగ వచ్చావు నువ్వు?"

అప్పణి మాట్లాడలేదు

"నా కంటి చూపు అనటంలేదు. రోజురోజుకు ఒట్టో బలం తగ్గి జబ్బు పడుతోంది."

ఆ కళ్ళను అప్పణి పరీక్షగా చూసినప్పుడే ఆమె కళ్లు తెల్లబడి ఉన్నాయి.

అతని తలను, భుజాలను తడిమి చూస్తూ చెప్పింది.

"మనవడా! నువ్వు పెద్దవాడివైపోయావురా!"

"నాలుగయిదేండ్లయింది కదా!"

అక్కడున్న వంట గది తెరచి వుంది నాలుగైదు మసి పట్టిన కుండలు రెండు మట్టి గిన్నెలు, ఒక దీపస్తంభము ఉన్నాయి.

అప్పాణి లేచి బయట గదిలోకొచ్చాడు. మీనాక్షమ్మ తట్ట పుచ్చుకుని, బయటికి చూస్తూ నిలబడి ఉంది.

"మన అదృష్టం సాయంకాలవేళలోనున్న ఒక మనిషి సహాయంకూడ ఇప్పుడు లేదు...." కొంచెంసేపు పోయాక తనని తానే సమాధాన పరచుకొన్నట్టుగ చెప్పింది "నువ్వు వెళ్లిపోవడం కష్టపడనక్కరలేకుండా పోయింది."

"చిన్నమామ, వాళ్ళు ఎక్కడున్నారు?"

"ఉత్తరవైపింటిలో...."

అప్పాణి కళ్ళు పాత గోడపైన, పేడతో అలికిన నేలపైన దండెంపైనున్న చిరిగిన బట్టలపైన వున్నాయి.

అక్కడ నుంచే బయటకు చూశాడు.

ఉత్తరాదివారి ఇల్లు ఏకాంతంగా, భయంగొల్పుతోంది

మీనాక్షమ్మ అడిగింది.

"అప్పాణీ! బండిలో వచ్చావా?"

"అవును"

"ఇక్కడ ఏమీ సౌకర్యములేని పరిస్థితి.... ఆ యింటికి పోతావా?"

"నేనిక్కడే ఉంటాను. నాకోసం ఏకష్టమూ పడవద్దు."

"ఏం చేయటానికి నాకు తోచటంలేదు" అందామె.

షర్టు విప్పి గోడనున్న మేకుకు తగిలించాడు. పెట్టె ఒక ప్రక్కగా పెట్టి హోల్డాలు విప్పి పర్సు తీశాడు అందులోంచి పదిరూపాయలనోటొకటి ఆమె చేతిలో పెట్టి "అవసరమైన సరుకులు కొనుక్కుని రా!" అన్నాడు

రాత్రి వెన్నెల కాస్తున్నది. చేతి యంత్రపు గదిలోంచి భోంచేసి బయట కొచ్చాడు.

ఆ గది పక్కనే ఉంది సర్పతోట. అక్కడున్న ములగచెట్టు ఆవెన్నెల్లో వికృతంగా కనబడుతున్నది.

వెన్నెలరాత్రులలో పాములు పడగెత్తి ఆడతాయని చిన్నప్పుడు విన్న సంగతి గుర్తుకొచ్చింది. అపువ్వులతోట తటాకం చాలా పెద్దది. చెప్ప శక్యము కాని ఒక విషాద సంఘటన అతని మనసును కుదుపు తున్నది.

అతనికి అక్కడ నుంచి బయలుదేరినప్పుడున్న ఆత్రం ఇప్పుడు చప్పగా చల్లారిపోయింది.

ఐదు సవత్సరముల తర్వాత మళ్ళీ తను అ ఊరు వచ్చిన సంగతి అందరికీ తెలిసి పోయింది

ఆనాటి అప్పణి కాదు ఇప్పుడు వచ్చింది. ఇప్పుడతను తేయాకు తోటలో ఉద్యోగి. చేతినిండా డబ్బుంది. రోజుకొక పదిరూపాయలనోటు మీనాక్షమ్మ అంగడిలో మార్చుతున్నట్టు ఊరంతామాట్లాడు కొంటూన్నారు. మీనాక్షమ్మ కువచ్చిన మంచి రోజుల గురించి చెప్పుకునే వారుకూడా వున్నారు.

మూడవ నాటిరాత్రి ఒకస్త్రీ వచ్చింది తనను చూడటానికి కొంచెం వయసైన స్త్రీ.

"ఎవరు?" అప్పణి అడిగాడు.

మీనాక్షమ్మ చెప్పింది." ఇక్కడున్నవాళ్ళే"

"ఓహెూ!"

ఆమె అప్పణి దగ్గరకు వచ్చి నవ్వింది. మాట్లాడ పా్రరంభించిప్పుడు శాతంగానే అడిగాడు'

"ఏమిటి!"

"ఎవరది,మనిషి మారిపోయావు."

అప్పణి అందుకేమీ చెప్పలేదు.

"మీకేదీ జ్ఞాపకం లేదులా వుంది. మిమ్మల్ని—"

"నేనేం మరచిపోలేదు"

"వచ్చావని చెప్పారు. చూచిపోదామని వచ్చాను,"

"ఎందుకూ" నిలబడి గంభీరంగా అడిగాడు అప్పణి.

"వయసై పోయింది. మీవంటివారి వద్దకు వెళ్ళాలింక. చక్కిలాలు కొనేందుకు కూడా గతిలేకుండా ఉన్నాను. మీరు ఏదైన సహాయం చెయ్యాలి

స్నేహంతో కూడిన అధికారంతో' నవ్వుతూ, శాంతంగా ఆమెనడిగాడు,

"నాచిన్నతనములో నన్నుఆదరించారా?"

"ఏమిటి ఇలాగ అడుగుతున్నావు?"

"మీరు ఆదరించారా" అని-" నాతో సరిగా మాట్లాడారా? మీకూ నాకు ఏం సంబంధం వున్నది?"

అతని నవ్వు ఆగిపోయింది.

"మనమిద్దరము బంధువులమురా రక్తసంబంధం పోతుందా?"

"ఈసంబంధం ఈరోజు పుట్టినదికదూ? వెళ్లిపో. నాదగ్గర నుంచి నీకేంరాదు."

మళ్ళీ మాట్లాడటానికి ఆమెకు అవకాశమివ్వలేదు. మీనాక్షమ్మతోను అమ్మమ్మతోను చెప్పకుండానే ఆమె తిరిగి వెళ్ళిపోయింది. అప్పుడు అనుకున్నాడు అప్పుణి—

"రక్త సంబంధం! ఇప్పుడు కావలసి వచ్చింది."

ఆరోజు కృష్ణన్ కుట్టికూడా వచ్చాడు, ఎర్ర ట్రవుజరు వేసుకునీ ఉండేవాడు. ఇప్పుడు బాగా పెద్ద వాడయ్యాడు.

"ఏమిటి, కృష్ణన్ కుట్టి ?"

"ఏం లేదు"

"బాగున్నావా?"

"ఆ"

అక్కడితో సంభాషణ ఆగిపోయింది. కృష్ణన్ కుట్టి కొంచెంసేపు వేళ్ళు విరుచుకొంటూ నిలబడ్డాడు. లోపలకెళ్ళి అమ్మమ్మ దగ్గర రెండు నిముషాలు ఉండి మళ్ళీ బయటకు వచ్చాడు. సంకోచంతో

"అప్పుణి! అమ్మపిలుస్తోంది" అన్నాడు.

"ఏమిటి విశేషం?"

"ఏంలేదు ఇక్కడుండడానికి కష్టమైతే అక్కడికి రమ్మనిచెప్పింది" కృష్ణన్ కుట్టి చెప్పాడు. "అమ్మ నిన్ను చూడాలని చెప్పింది."

"అమ్మతో చెప్పు నన్నుచూడటం అంత ముఖ్యమైతే ఆమెను ఇక్కడకే రమ్మనమని చెప్పు." అన్నాడు అప్పుణి.

వాడిపోయింది అతనిముఖం, రాని నవ్వు పెదవులపై తెచ్చుకున్నాడు. శరీరమంతా చమటలతో తడిసిపోయింది

తర్వాత రెండు రోజుల వరకు ఎవరినీ చూడలేదు ఏటిలో పట్టిన పెద్ద చేప నొకదానిని తీసుకొని అప్పుణిని చూడడానికి అబూ బక్కరు వచ్చాడు దానికి డబ్బులు ఇమ్మని మీనాక్షమ్మతో చెప్పాడు.

మీనాక్షమ్మ పూర్వంలాగే ఉంది. అడిగితేనే ఏదైనా బదులు, ఇస్తుంది. పగటి సమయాల్లో అందరికి దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తుంది

రాత్రి భోజనమైన తర్వాత వీధిలోనో, తోటలోనో, పచార్లుచేస్తాడు. ఆ తోటలో ఒక ప్రక్క సగానికి విరిగిపడిన పనసచెట్టు ఒకటి ఉంది. క్రింద పడిన కొమ్మపై నిలబడి, ఆ వెన్నెలలో, చెట్టు మొదట్లో దట్టంగా అలుముకున్న చీకట్లో చెట్టు మొదట్లో వున్న పాము పుట్టలను చూస్తుంటాడు. ఆసమయాల్లోనే అక్కడ పాములు పడగెత్తి ఆడుతుంటాయేమో?

అప్పుడు కాంతివంతమైన దీపం ముందు, నృత్యంచేసిన ఆడపిల్లరూపం అతని మదిలో మెదిలింది..... అ....ఆమెను గురించి తెలుసుకోవాలనిపించింది. అడిగితే తెలుస్తుంది. కాని అడగలేదు

ఒకరోజు వెనుకనున్న తోట దారిగుండా కొండ ప్రక్కనున్న స్థలానికి వెళ్ళి మీనాక్షత్తను ఆ విషయమై అడగాలనుకొన్నాడు. ఆ కొండ దిగువ భాగంనుంచి, చాతప్పస్వామి గుడి ప్రక్కనున్న చెట్ల నానుకుని చెరువు వరకు ఉన్న స్థలంలో అతనికి భాగం ఇవ్వబడింది.

చిన్న చిన్నరాళ్ళను, అక్కడక్కడున్న ముళ్ళచెట్లను చూస్తే ఆ స్థలంలో శూన్యం రాజ్యమేలుతున్నట్లుంది. అక్కడున్న మట్టి తనకు స్వంతం.

తన భాగానికి వచ్చిన స్థలం గురించి అప్పుడప్పుడు మీనాక్షమ్మ చెప్పినందువల్ల అంతా అతనికి తెలిసింది. ఉత్తర వైపున్న పొలాలన్నీ పెద్దమామకు భాగంగా ఇవ్వబడ్డాయి. పెద్దమ్మకు, ఆమె పిల్లలకు నాలుగో భాగం ఇవ్వబడింది. పడవరేవు పక్కనున్న పొలము, మెట్ట భూమిలో సారవంతమైన కొంత భూమి ఆమెకిచ్చారు. ఆమె పొలములను కౌలుకిచ్చుకున్నది. గిడ్డంగి ఉన్న యిల్లు చిన్నమామ భాగం.

ఆ సమయంలో అక్కడ లేని భాగస్తులకు, ఎవరూ ఉపయోగించని చవిటి నేల భాగంగా వ్రాసిచ్చారు.

రాళ్లు, బండలు, ముళ్లచెట్లున్న కొండ దిగువ భాగం నుంచి చెరువు వరకున్న ఎర్రమట్టి పొలం కొన్ని వందల ఏళ్లుగా సుషుప్తిలో వుంది. ఆ పొలం మధ్య నిలబడితే అతని మనసులో, ఆ మట్టి ఏ ఏ పంటలకు అనుకూలంగా ఉంటుందానని అనేక భావాలు కలిగాయి.

దూరంగా నది అవతలి ఒడ్డు ప్రక్కనున్న చక్రవాకపు మైదానాన్ని చూస్తూ నిలబడ్డాడు.

కొండ దిగువ భాగంనుంచి, తాటాకు గొడుగువేసుకొని ఎవరో నడిచి రావటం చూశాడు. దగ్గరకొచ్చిన తర్వాతనే తెలిసింది అతనెవరైంది చిన్న మామ. ముఖంలో పూర్వమున్న మొరటు తనం ఇప్పుడులేదు ఇప్పుడు నవ్వు ముఖంతో వచ్చాడు. గొడుగును పైకి ఎత్తి అడిగాడు:

"అప్పణీ, ఎప్పుడొచ్చావు?"

"నాలుగురోజులైంది."

"మీనాక్షి చెప్పింది. నీవు కొండ ప్రక్కనున్న స్థలం చూడ్డానికి వచ్చావని. అప్పుడు నీతో మాట్లాడడానికి అవలేదు"

అప్పుడు తెలిసింది అప్పణికి -అతను ఏదో చెప్పాలని వచ్చాడని. అప్పణి ఆలోచించాడు,

"ఏమిటీ ?"

"నిన్ను చూడాలని వచ్చాను."

"చూశావు కదా ఇంక వెళ్లవచ్చని మొదట్లో చెప్పాలనిపించింది. కాని నిదానించాడు.

"భాగించిన తర్వాత పరిస్థితులు పాడైపోయాయి."

"ఎవరి పరిస్థితీ బాగులేదు."

"నేనూ, మాళూ ఉత్తరబాట కుట్టప్ప ఇంటితోటలో వుంటున్నాము"

"తెలుసును."

"నాకు ఇప్పుడు కష్టించి పనిచేసే శక్తిలేదు ఆ పిల్ల గురించే నా దిగులు"

అప్పణి తలాడించాడు.

"ఆమెకు నీవంటే ప్రాణం....."

చిన్నమామ ఇంకా ఏదో చెప్పాలన్నట్లు నిలబడివున్నాడు.

"నేనేం చెయ్యాలి?"

"ఆమెకు నువ్వంటే అభిమానం."

అప్పణి మనస్సులో పాత సంఘటనలు తుఫానులాగా చెలరేగాయి. మెల్లిగా తగ్గు స్వరంతో అప్పణి చెప్పాడు.

"ఏదీ నేనింకా కలెక్టరు కాలేదే!"

చిన్న మామ ముఖం చిన్నపోయింది.

"ఏమిటి అలా చెబుతున్నావు, అప్పణీ?"

"ఇంక నాతో మాట్లాడ వలసిన పనిలేదు...."

చిన్న మామ తాటాకు గొడుగు తీసుకొని వెళ్లిపోవటం చూస్తున్నప్పుడు అప్పణి క్రూరంగా నవ్వాడు.

దూరంగా వున్న ఏటి అలలను చూస్తూ కాస్సేపు అక్కడేకూర్చున్నాడు.

మాళును గురించి తలచినప్పుడు అతని మనసులో ఏదో ఒక విధమైన బాధ కలిగింది. ఆమె అమాయకురాలు. అయితే—

ఆ సంగతి తలపుకొస్తే అతనికి ఒక రకమైన ఏహ్యా భావము కలిగింది. శత్రుత్వాన్ని మరచిపోతే కలిగే ఆనందం గురించి అతనికి ఒక విధమైనవిరక్తి భావమేర్పడింది.

మాళు ఇప్పుడు పెద్దదై వుండాలి. కొన్ని సంవత్సరములకు ముందు మొట్ట మొదటి సారిగా తాను ఆ యింటి కెళ్ళినప్పుడు, తూర్పువైపు వరండాలో నల్లగా పీలగా నిలబడిన ఆమె ముఖము అతని మనసులో మెదిలింది. ఆమెపై సానుభూతి, అంత కంటె ఆమెకు అతని మనసులో చోటు లేదు.

తెల్ల మేఘాల మధ్య ప్రకాశం తగ్గుతుండగా అతను ఇంటికి తిరిగి వచ్చాడు.

రాత్రి పడుకోబోయేటప్పుడు అతని మనసులో కొన్ని రూపాలు కద లాడసాగాయి. సగమే మూసిన కాటుక దిద్దిన కళ్ళు, పొడవైన కేశములు కలిగిన నల్లని పాములా ఆడుతున్న ఒకకన్య ఆశ్చర్యము, వేదన కలిసినట్లున్న కళ్లతో నల్లగ మలినశరీరంతో వున్న ముఖం. సంధ్యాసమయంలో మేఘాలలో దాగిన చంద్రునిలాంటి ముఖంగల ఇంకొకామె. ఇలా ఆలోచిస్తూ అతను కళ్ళు మూసుకున్నాడు.

ఊళ్లోకొచ్చిన వారానికి ఒక ఉదయం పెద్దమామని చూశాడు. నడవలో సిగరెట్టు పీల్చుకుంటుండగా ఇంటి ముందు భాగం దగ్గర చెప్పుల శబ్దం విన పడింది. అతను గది దగ్గరకొచ్చాడు.

"అప్పణీ."

మొదట అతనిపేరు పెద్దమామ నాలుక సరిగా ఉచ్చరించలేకపోయింది

"అప్పణీ, కాస్త ఇలా రా."

"ఏం."

"ఇక్కడ వరండాలోకిరా" అతిశాంతంగా ఉంది కంఠస్వరం.పిడుగులు కురిసేలా మాట్లాడే పెద్దమామేనా ఇతను?

"ఇక్కడే నిలబడుతావే?"

ముళ్లకంచెకు రెండువైపుల ఇద్దరు నిలుచున్నారు. అప్పాణి సగం పీలుస్తున్న సిగరెటును వేళ్లమధ్యదాచి, చేతులను వెనక్కు పెట్టుకొని నిలబడ్డాడు.

పెదమామ ముఖంలో పూర్వపు కోపతాపాలు లేవు. శరీరము, మనస్సు కృంగిపోయినట్లు తెలుస్తోంది. అతనిని చూడగానే అప్పాణి కళ్లల్లోకి సూటిగా చూడటానికి ప్రయాస పడుతున్నట్లున్నాయి పెద్దమామ కళ్లు.

"మూడు నాలుగురోజులుగా రావాలనుకుంటున్నాను."

"ఊఁ"

వృద్ధాప్యం అలుముకున్న పెద్దమామ ముఖంచూస్తే అప్పాణి మనసులో పాతసంఘటనలు చిత్రంగా మెదిలాయి.

ఆ రోజు తిట్టి తరిమేశాడు.... పిచ్చెత్తిన వాడిలాగ.... ఆయింట్లోకి వస్తే కాళ్లు విరగ్గొడతానని చెప్పిన మనిషి ఇప్పుడు తనెదుట సాధువులాగ నిల్చున్నాడు.

"నేనొక పనిమీద వచ్చాను."

"చెప్పండి."

"ఆస్థిపంపకాలు చేసేటప్పుడు ఈ భాగం నేనే కోరుకున్నాను. ఉత్తర బాట యిల్లుకదా. అదీకాక భగవతి ఉన్నస్థలముకదా. అది అన్యులకు పోకూడదని భావించాను."

"అది బాగానే ఉంది."

"దాని మీద ఇప్పుడు ఐదువదంల రూపాయల అప్పున్నది. అప్పు పెరిగిపోతోంది."

అప్పాణి ఏం మాట్లాడకుండా శ్రద్ధగా వింటున్నాడు. కొద్ది నిముషాలు సంశయంతో నిలబడిన తర్వాత పెద్దమామ చెప్పాడు

"పదో తారీఖులోపల డబ్బు కట్టక పోతే ఇల్లు వేలం వేయాల్సి వస్తుంది. తల విధి. ఎంతైనా మన ఉత్తర బాట యిల్లుకదా!"

అప్పణి తల వూపాడు.

"వేలంలో కొంటానికి మాప్లవాళ్లున్నారు. భగవతి ఉండే యిల్లు వాళ్లకెలా ఇచ్చేది?"

మనస్సు కుమిలిపోయింది. అప్పణి గట్టిగా అడిగాడు.

"దానికి నేనేం చేయడం?"

"నీ దగ్గర డబ్బుందని విన్నాను. ఐదువందల రూపాయలు అప్పగా ఇచ్చావంటే చాలు. నోటు వ్రాసిస్తాను-"

ముళ్లకంచెలోంచి చూస్తున్న ఆ వృద్ధుని రూపం మరుగైంది. అరుగుపై నుంచి ఒకదూకులో క్రిందకు దిగి చేతులు పైకెత్తి అరుస్తూఉండే పెద్దమనిషి రూపం అతని కళ్లల్లో మెదిలింది.

అప్పుడు అప్పణి చెప్పాడు:

"ఈ ఇల్లు నిలబడుతుందని నాకు నమ్మకంలేదు."

"అప్పణీ, ఏం అలా చెబుతున్నావు?"

"స్పష్టంగా చెప్పాలంటే, ఈ యిల్లు నిలుపుకొనడంవల్ల నాకేం లాభం లేదు. ఇక్కడ నుంచి నన్ను కొట్టి తరిమేసిన విషయం మీరు మర్చిపోయుండ వచ్చు. కాని నేను మర్చిపోలేదు."

కొంచెం సేపు వారిద్దరి మధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది. తడబడుతున్న కంఠముతో పెద్దమామ అన్నాడు.

"అప్పుడు అలా ప్రవర్తించినందుకు ఇప్పుడు నేను విచారిస్తున్నాను. గతించిన దాన్ని మరిచిపో, అప్పణి."

"అది అంత సులభంకాదు."

"ఏ దారీ తెలియక అవస్థపడుతున్న సమయంలో నువ్వొచ్చావని విన్నాను. తరతరాలుగావున్న ఇల్లు."

"నాదగ్గర డబ్బుంది. కానీ ఇప్పుడు ఇవ్వడానికి నాకిష్టంలేదు."

కంచె ప్రక్కనున్న గుంద్రటి కర్రను చేత్తోరాస్తు ముఖం వంచుకొని పెద్దమామ నిలబడ్డాడు. అప్పణి నేలను చూస్తూ నిలబడ్డాడు.... పెద్దమామ తిరిగి వెళ్లిపోతున్నప్పుడు, అప్పణి పిలిచాడు.

"ఆగండి."

పెద్దమామ అప్పాజీ వైపుతిరిగాడు.

"మాప్లవారికి అమ్మటానికి మీకు ఇష్టంలేదు. నేనే కొంటే!"

పెద్దమామ కలవరపడ్డాడు. ఏం తోచక కొంచెంసేపు నిలబడిన తర్వాత:

"ఆలోచిస్తాను" అన్నాడు.

"ఆలోచించవలసినదేమీలేదు. ఇప్పుడే ఈక్షణంలోనే, తేల్చి చెప్పండి. నేను కొనుక్కోవచ్చా. ఇల్లూ, పొలములన్నీ కలసి మొత్తమెంతవుతుంది?"

పెద్దమామ మౌనంగానిల్చున్నాడు.

"మౌనం ఎందుకు? ఇదివ్యాపారం. ఇష్టమైతే నేనే కొంటాను".

పెద్దమామ మళ్లీ మౌనంగా నిల్చునేటప్పటికి అప్పాజీకి ఆవేశం ఎక్కువైంది.

"ఏమండీ, అప్పాజీ డబ్బు చెల్లించ దనుకున్నారా?"

"అదేం లేదు."

"అయితే చెప్పండి. కూలబోయే ఇల్లు ఎంత ధరకు ఇవ్వగలరో ఆలోచించి చెప్పండి."

"నాలుగువేల రూపాయలకు వెల పోతుందని హాజి చెప్పాడు......."

అప్పాజీ ఆలోచించాడు.

"గాలి వెలుతురు లేని ఈ యింట్లో ఎవరు ఉండటానికి ఆస్కారం లేదు. కాని నేను నాలుగువేల రూపాయలిస్తాను. ఇష్టమైతే విక్రయ పత్రాలు వ్రాయటానికి ఏర్పాట్లు చేయండి."

పెద్దమామ శిరస్సు వంగిపోయింది.

అతి ప్రయాసపడి చెప్పాడు పెద్దమామ "సరే."

"పత్రం వ్రాయటానికి ఏర్పాట్లు చేయండి."

మెల్లిగా దూరమౌతున్న చెప్పుల శబ్దం వింటూ అప్పాజీ అక్కడే నిలబడ్డాడు.

గదిలోకి వచ్చిన తర్వాత మీనాక్షమ్మ అడిగింది.

"వెళ్లారా?"

"ఆ, వెళ్లారు."

"అమ్మమ్మకు ఇదంతా వేదనగా ఉంది."

ఆ మాటలు అతనికి అంతగా నచ్చలేదు.

"పువ్వులతోట ఆస్తి ఏంలేదా?"

"అక్కడేం లేదు. పెద్ద ఆస్తి ఉండేది. కానీ ఆమె చనిపోయింది."

"ఎవరూ?"

"అమ్మణీ, తెలియదూ?"

"పాపం........"

"ఏమిటి మీనాక్షత్తా?"

"పోయిన వైశాఖమాసంలో మొదటి శిశువు కలిగినప్పుడు కదా చని పోయింది."

అప్పణి స్తంభించిపోయాడు. ఏం మాట్లాడలేకపోయాడు. మెల్లిగా లేచి చేతులు కట్టుకొని గుమ్మందగ్గిరకి వచ్చాడు. వణికే చేతులను గుమ్మంపై పెట్టి కళ్లు మూసుకొని నిలబడినప్పుడు మీనాక్షమ్మ ఎవరినీ ఉద్దేశించకుండ చెప్పింది.

"పాపం స్నేహశీలి అయిన అమ్మాయి."

*　　　*　　　*

మూసిన గడప తలుపును అప్పణి తెరిచాడు. దక్షిణవైపు గది వుంది. తలుపులు పూర్తిగా తెరచినప్పుడు వెలుగు లోపలకి పడింది. ఆ లోపలి గాలిలో ఏదో భరించలేని వాసన వేసింది. మూసిన తలుపులు తెరచినా, మూలల్లో చీకటిగానే వుంది. మధ్య నట్టింటి వాకిట్లో నల్లరాళ్లతో పూడ్చిన రాళ్లు పగిలి పోయాయి. స్తంభములో చెదల పుట్టలున్నాయి.

ఉత్తరవైపుగదికి ఉత్తరంగా మిద్దెవైపు వెళుతూ అతను ఆగాడు. అదే మూలగది.

ఆ గదిలోనే మూడేళ్లు గడిపాడు. ఆ నేలపై యిప్పటికీ కన్నీటి తేమ ఉన్నదా? మనస్సు ఎలాగో వుంది.

ఆ గదిలో నిలుచున్నప్పుడు ఆ చీకటిలో ఎర్రనిగాజులు శబ్దంచేస్తున్నట్లు అతనికి వినిపించింది. జాజిమల్లి పువ్వులు, సాంబ్రాణి వాసన ఆ గదిలోపల వీచినట్లనిపించింది.

మనస్సులో ఏదో అశాంతి కలిగింది. మిద్దెపైకెక్కిపోయాడు ఆ ప్రక్క నున్న ఒక గదిని మాత్రం అతను తెరువలేదు.

తంగేడత్తి భర్త కాపురమున్నగదిలో ఎలుకలు సంచరిస్తున్నాయి.

తంగేడత్తికి పెండ్లి అయి, భర్త వచ్చినట్లు తెలిసింది. మీనాక్షమ్మ చెప్పింది. ఆ తర్వాత అతను ఏదో కష్టంవచ్చి వదలి పోయాడట. ఆయింట్లో ప్రత్యేకంగా వున్న గది ఇప్పటికీ అలాగే వుంది.

తేమబడి, గబ్బిలాలు చుట్టిపరిగెడుతున్న పాత ఇల్లు లోపల సంచరిస్తున్నప్పుడు పగలైనా భయం కలిగింది. ఎన్నో తరాలు ఆ చీకటిలో కలిసి మెలిసి వున్నాడు. పొరమాన్, నారాయణమ్మాన్ వారి ఆత్మలు అక్కడ తిరుగుతున్నాయి. పెద్దలు దారుణంగా చంపేసిన ఆ స్త్రీ కథ జ్ఞప్తికి వచ్చింది.

ఇప్పుడు, ఈ ఇల్లు తనకు స్వంతమైనది. ఐదేండ్లు కష్టపడి సంపాదించిన డబ్బు అంతా అందుకోసరం ఖర్చు పెట్టాడు. అయినా చెప్పలేని ఆత్మసంతృప్తి కలిగింది. ఇక్కడ నుంచే ఒక రోజు ప్రాణాన్ని చేతుల్లో పట్టుకొని పారిపోయాడు. అందువల్ల ఒకప్పుడు ఓ స్త్రీ ఈ ఇంట్లో దూషింపబడింది. కారణం? తనకిష్టమైన వ్యక్తిని పెండ్లి చేసుకొన్నందుకు.

ఆ స్త్రీ ఎట్లా జీవిస్తోంది? అయిష్టంగానే ఆమె ఈ ఇల్లు వదలి వెళ్ళిపోయింది. అందుకే జీవిత కాలమంతా కష్టాలు పడవలసి వచ్చింది, ఆమెని ఎవరూ తిరిగి చూడలేదు. ఆమె మూలంగా వచ్చిన అపవాదుని శుద్ధిపరచుకోసాగారు. బహుశః కళంకితులమయ్యామని తృప్తిచెంది వుంటారు.

ఆ స్త్రీ కొడుకిప్పుడు ఈ ఇంటి యజమాని. ఆ స్త్రీ తన తల్లి.

ఆమెను మరచిపోవలసి వచ్చింది. తండ్రి కోల్పోయిన తనని ఆమె పెంచి పెద్ద చేసింది. ఎవరింట్లోనో రోలు దంచి పొయ్యి అంటించి తనకు అన్నం పెట్టింది.

దాన్నంతా అతను మరచిపోయాడు. ఎవరూ సహాయము చేయక పోయినప్పుడు ఒక మనిషి సహాయంచేయడానికి ముందుకి వచ్చాడు. సహాయం తనకు కావాలి, అని తాను అడుగలేదు. సోలి పడినప్పుడు ఆ చేతుల ఆధారంతో లేవగలిగింది. అది ఒక తప్పుగా భావించవచ్చా అని తనని తానే ప్రశ్నించుకున్నాడు.

తప్పెవరిది?

ఈ ఇంటి నుంచి బయటికి తరిమిన వారిది తప్పా? అయితే....

చెమట కారుతున్న శరీరముతో అతను వాకిట్లోకి వచ్చాడు. మధ్యాహ్నపు ఎండ బయట నిప్పులు కురుస్తోంది. గాలి లేదు. ఆకులు బొత్తిగా ఆడటం లేదు.

ఇన్నిరోజులుగా తనకెవ్వరూ లేరని లోలోపల బాధపడేవాడు. ఈ లోకంలో తాను ఏకాకినని తలుచుకున్నప్పుడెల్లా విపరీతమైన వేదన కలిగేది. వాస్తవానికి అందరూ వున్నారు. లేరని అనటం వంచన కాదా!

ఆప్రాంతంలో వున్నవన్నీ ఇప్పుడు కూడా తనకు సన్నిహితమైనవే. ఎక్కడో దూరంగా వయనాటి కొండలమధ్య ఒక చిన్న యింటి వైపు మనస్సు మళ్లింది. ఆప్రక్కనున్న చిన్న అంగడి లోపల పెట్టె తెరచి చిల్లర తెస్తున్న ఒక ముస్లిం యువతినతడు జ్ఞాపకం చేసుకున్నాడు. ఏదో ఒక క్లాసు గదిలోపల పిల్లలతో మాట్లాడుతున్న ఒక పంతులు గారి రూపం తన మనస్సులో మెదిలింది.

అలా ఆలోచిస్తూ అతను స్తంభానికి ఆనుకుని నిలబడ్డాడు.

తన జీవితములో సంపాదించిన గెలుపు ఓటమిలను బేరీజు వేయటానికి మనస్సు వ్యర్థ ప్రయత్నము చేస్తోంది.

* * *

వాకిట్లోపలవున్న మెట్లెక్కినప్పుడు ఆ యువకుడక్కడ ఆగాడు. తన వెనుక వస్తున్న స్త్రీతో:

"అమ్మా, పైకెక్కిరా" అన్నాడు.

ఆమె సంశయించి నిలబడడం చూసి అతను మళ్లీ పిలిచాడు.

"ధైర్యంగా గుమ్మం ఎక్కి లోపలికిరామ్మా."

నాలుగైదు నెరసిన తలవెంట్రుకలతో సన్నగా వున్న స్త్రీ గుమ్మము లోపలికి వచ్చింది.

ఇంకా ఆమె కూటములో సంశయముతో నిలబడింది. యువకుడు "రా అమ్మా," అని పిలిచాడు.

తల్లి వెనుకగా నడుస్తూ తాను ప్రవేశించుటకు అర్హతలేని ఒక స్థలములోకి వెళ్లేందుకు ప్రయాసపడుతున్నట్లు మెల్లిగా అడుగులు వేసింది.

లోపలికి వచ్చిన తర్వాత ఆ స్త్రీ,

"లోపల ఇంత చీకటియా, అప్పుణ్ణీ?" అని అడిగింది.

"పగలుకూడా ఇందులో చీకటియే. ఇక్కడ పూర్వీకుల ప్రేతాత్మలు పగటిపూట కూడ సంచరిస్తాయట."

అమ్మ మనశ్శాంతితోగల సంభ్రమంతో అతని వంక చూసింది

"అమ్మా, భయపడవద్దు. ఇంటిని పునరుద్ధరించే ఏర్పాట్లు చేశాను. ఇది గాలి, వెలుగు వచ్చే ఇల్లుగా మార్చితే చాలు."

"ఏమిటి ఈ ఇల్లు పడగొట్టి మళ్లీ కట్టడమా, భగవతి గృహము కాదా?"

అతను బిగ్గరగా నవ్వాడు. ఆ నవ్వు శబ్దం మూలమూలల్లో, పుట్టలు పెట్టిన స్తంభములలో, చుట్టూ వున్న గదులలో ప్రతిధ్వనించింది.

